# రామాయణరహస్యాల సమీక్ష



రచయిత :

"మహోపాధ్యాయ"

"బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాంతకేసరి"

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

*This book is Published*
*With the financial Assistence*

**OF**

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

*Under their scheme*
*'Aid to Publish religious books'*

# ప్రస్తావన

## రామాయణ రహస్యాలు—వాల్మీకము.

రచయిత—పండిత—కొత్త సత్యనారాయణచౌదరం.

ఈయన పరిచయముకొరకు ముందుగా ఈయన మాటలే కొన్ని పాఠకులకు ప్రదర్శింపబడుచున్నవి—

1. రంకుకథలతో నిండినదే రామాయణము. వంకరటింకరసంకర జాతులే రామాయణములో పారాయణచేయదగినవారు.

2. శ్రీరాము డవివేకి, సమయమునకు తగినట్లు మాటలు మార్చిన ఘట్టములు చిన్నవో, పెద్దవో అబద్ధము లాడిన సందర్భములు–రాముని జీవితములో ఎన్నో ఉన్నవి.

3. లక్ష్మణుడు– పశువు– షండుడో, పాషండుడో.

4. రామరాజ్య మనగా – అన్నమో రామచంద్రా అని ఆకలి మంటలచే అలమటించిన రాజ్యము. దేశములో ఆలన పాలన లేక పదునాలుగేండ్లు బగ్గముపాడై పంటలు లేక తిండి చాలక అలో లక్ష్మణా అని యేడ్చిన రోజులు.

5. పైకి పితృవాక్యపరిపాలన మని బడాయి కొట్టుటే. లోలోన, రాజ్యము పోయెనే అనెడి వగపు ఈఅన్నదమ్ములకు హెచ్చుగా లేకపోలేదు. దానము చేసి పిదప విచారపడినదాతవలె పితృవాక్యపరిపాలనమునకై వచ్చినట్టు నటించి ఈ తీరుగ ప్రవర్తించిన ఈఅన్నదమ్ములు ఆదర్శపురుషు లెట్లగుదురు?

6. రవి యస్తమింపని ఆంగ్లసామ్రాజ్యమును తాను వలచిన కాంతకోసమై విడనాడి విచారపడని ఆంగ్ల రాజ్యకుటుంబము లోని వ్యక్తి–"విండ్సర్ – ఎడ్వర్డు" కన్న రాము డెట్లు మిన్న యగును?

7. ఈ యున్నదమ్ములు చేసిన స్త్రీహత్యాకాండకు ఈ జన్మము లోనే ఫలిత మనుభవించి భార్యల ఎడబాటుచే దగ్ధచిత్తులై తుదకు సరయూనదిలో బడి చచ్చిపోవలసిన దుర్గతి పట్టినది.

8. లంకలో ఎందరో ఆడువాండ్రను - బిడ్డలకు, భర్తలకు దూరముగా చేయించిన పాతకము కట్టి కుడుపుటచే సీతమ్మ సైతము రాములవారివలన అడవులకు నెట్టబడి, దిక్కు మొక్కు లేనిచోట బిడ్డలను గని, తుదకు ఆత్మహత్యయే చేసికొనవలసివచ్చినది.

9. అహల్యకు గౌతముడు కట్టుకొన్న పెనిమిటి. ఇంద్రుడు, సూర్యుడు- ఉంచుకొన్న ఉపపతులు,

10. ఆంజనేయునకు గౌతముడు మాతామహుడు. వాలిసుగ్రీవులు వరుసకు మేనమామలు, రంకులహనుమయ్య ఆంజనేయులు.

ఇవి వాల్మీకిరామాయణరహస్యాలుగా కొత్తపండితుని పాండిత్యసూచకములైన మాటలు.

ఈయన వైఖరిని, ఈయన అర్థము చేసికొన్న పద్ధతిని, ఈయన ప్రమాణీకరించిన పుస్తకమును, మహర్షులపట్ల ఈయన వాచాటతను, సీతారామలక్ష్మణులపై ఈయన ఆడిన దుర్భాషలను, రామరాజ్యదూషణమును ఖండించు మా రహస్యాల సమీక్షను పాఠక మహాశయులు అవలోకింతురుగాక.

ఇదివరలో రామాయణముపై బహుముఖముల విమర్శము లుద్భవించినవి. వాని కన్నిటికిని "రామాయణ తత్త్వకథనము"లో సమాధానములు చెప్పియే యున్నాము.

అందరిని మించినవాడను నేననుటకు ఈ కొత్తపండితుడు "రంకులకథలతో నిండినదే రామాయణము" అని వ్రాసి సాగిం

చెను. "యేన కేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్" అను వాక్యము ఈయనపట్ల సార్థకమైనది. గొప్ప ప్రసిద్ధియే ప్రాప్తించినది.

ఇది సర్వతోముఖముగా విజృంభించుచున్న విప్లవమునకు, అనగా దేశోపద్రవమునకు కాలమగుటచేత విప్లవకారులకు స్వాగతమిచ్చి సత్కరించుచున్నది.

ఇట్టి విప్లవమువలన ఆర్థికముగా కలుగు నష్టము ఎంత కలదో లోకము గ్రహించుచునే యున్నది.

ఆర్థికమైన నష్ట మనగా - ఆస్తులకు కలుగు నష్ట మొక్కటే కాదు, విద్య- భూమి హిరణ్యము- పశువులు- ధాన్యము- గృహోపకరణములు - మిత్రులు - వీనిని ఆర్జించుట, ఆర్జించినవానిని వృద్ధిపరచుకొనుట ఇవన్నియు అర్థముగానే చెప్పబడినది,

"విద్యా భూమి హిరణ్య పశు ధాన్యం భాండోపస్కర
మిత్రాదీనా మర్జన మర్జితస్య వివర్ధన మర్థః"

(కామసూత్రమ్)

దీనినిబట్టి విద్యకు కలిగించు నష్టముకూడ ఆర్థికనష్టమే. విద్యకు నష్టమనగా—విద్యాస్థానములగు ఆర్షగ్రంథములకునష్టముకలిగించుటే.

ఈపని చేసిన ప్రయోజకుడు 'రామాయణరహస్యాలకర్త'. రాజదండభయము లేకపోవుటచే ఇట్టివారు చెలరేగినారు. దీనికి నిదర్శనము.

ఆంధ్రప్రభ-19—మే71

రావణకావ్యంపై నిషేధం రద్దు.

"మద్రాసు - మే 18 'రావణకావ్యం' అను గ్రంథముపైన గత 23 ఏళ్ళుగా ఉన్న నిషేధాన్ని తమిళనాడుప్రభుత్వం 17న తొలగించింది.

ఈ గ్రంథం ప్రతులను స్వాధీనం చేసుకోవలసిందిగా ఆదేశిస్తూ 194౪లో జారీ చేసిన ఉత్తర్వులను ప్రభుత్వం 17న రద్దు చేసినట్టు ప్రభుత్వప్రతినిధి చెప్పారు.

ఈగ్రంథాన్ని – 'పులవర్ కుళందాయ్' వ్రాశారు. ఈ గ్రంథంలో రావణుడు కథానాయకుడుగా, రాముణ్ణి దుష్టుణ్ణిగా చిత్రించారు"

రాముణ్ణి దుష్టుణ్ణిగా చిత్రించిన రావణకావ్యము రామాయణ విరుద్ధమని 23 ఏండ్లనాడు ప్రభుత్వముచే నిషేధింపబడి ఆ ప్రతులు స్వాధీనము చేసికొనబడిన వా?

నిషిద్ధమైన ఆరావణకావ్యమునకే - ఈనాడు ప్రభుత్వమే ఆ నిషేధము రద్దుచేసి స్వాగత మిచ్చి కన్ను తెరచి రాముణ్ణి దుష్టుణ్ణిగానే నిర్ణయించినదా?

ఇది చూడగా జంకు లేకుండ చేయబడు నిషిద్ధకార్యములకు ప్రోత్సాహమిచ్చుచున్నది ప్రభుత్వమే అనవలసివచ్చుచున్నది. కనుకనే-"రాజా కాలస్య కారణమ్" అని చెప్పబడినది.

ఏది ఏమయినను "రామాయణప్రమాణమునుబట్టి రామ చరిత్ర పవిత్రమనియు పూజ్యమనియు భావించుచు రాముని భజించు నట్టి ప్రజలపట్ల ఆరాముని దూషించువారిత నేరమే" అని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది.

ఆంధ్రప్రభ – 27 ఆగస్టు – 1958

పవిత్రవస్తువుల అపవిత్రీకరణ నేరం — సుప్రీంకోర్టు తీర్పు. న్యూఢిల్లీ - ఆగస్టు- 25. ఒక విషయం ఎంత స్వల్పమైనదైనా, వాస్తవమైన విలువలు లేనిదైనా, ఒక వర్గంవారు దానిని పవిత్రమని భావిస్తున్నపుడు దానికి ఇండియన్ పీనల్‌కోడ్డు - 295 వ సెక్షన్ వర్తిస్తుందని సుప్రీంకోర్టు డివిజన్ బెంచి నేడు వ్యాఖ్య

చేస్తూ తీర్పు చెప్పింది- శ్రీ ఎన్. వీరభద్రిన్ చెట్టియార్ మద్రాసు హైకోర్టు తీర్పుపై ద్రావిడకజం నాయకుడు - శ్రీ ఇ. వి. రామ స్వామినాయకర్ మున్నగువారిమీద చేసిన అప్పీలులో సుప్రీంకోర్టు డివిజన్‌బెంచి న్యాయమూర్తి - శ్రీ బి. పి. సిన్హా పైన పేర్కొన్న విధంగా తీర్పు చెప్పారు.

ఇండియన్ పీనల్ కోడ్ 295 సెక్షన్ వివరాలివి— 'ఒకవర్గం వారి మతవిశ్వాసాలను అవమానించే ఉద్దేశించే ఆవర్గంవారు పవిత్రంగా భావించిన వస్తువునుగాని, పూజాస్థలాలనుగాని, విధ్వంసం చేసే వ్యక్తికి-అలాంటి పవిత్రస్థల విధ్వంసనం అపవిత్రం చేయడం, ఆవర్గంవారి మతవిశ్వాసానికి - అవమానకరం - హానికరం - అని భావిస్తున్నారన్న సంగతి తెలిసికొని ప్రవర్తించే వ్యక్తికి - 2సంవత్సరాలవరకు కైదుశిక్షగాని, జరిమానాగాని లేక రెండుగాని విధించవచ్చు" అని.

ఇప్పుడు పరిశీలింపవలెను—రాముణ్ణి దుష్టుణ్ణిగాచిత్రించిన రావణకావ్యమును తమిళనాడు ప్రభుత్వము 1948 సం॥ ములో నిషేధించినది.

పైనుదాహరించిన సుప్రీంకోర్టు తీర్పు—1958 సం॥ వెలువడినది. ఈ తీర్పుతరువాతనే ఆ తమిళనాడుప్రభుత్వమే 1971లో ఆరావణ కావ్యముపై గల ఆనిషేధమును రద్దుచేసినది.

సుప్రీంకోర్టు తీర్పునకు కట్టుబడి యుండవలసిన ఆప్రభుత్వము ఆతీర్పునుల్లంఘించి, తాను చేసిన నిషేధమును రద్దు చేసి' నిషిద్ధమైన ఆరావణకావ్యమునే తాను వెనుక చేసినది పొరపాటన్నట్టు స్వాగతముతో స్వీకరించుట ఎంత యోగ్యమో పాఠకమహాశయులు గ్రహింపవలసి యున్నది.

ఏమయినను రాముణ్ణిదుష్టునిగా చిత్రించిన రావణకావ్యకర్తయు— రాముని అవివేకిగా— అబద్ధాలాడువానిగా— లక్ష్మణుని పశువుగా—

రామదూత యగు హ ను మ ం తు ని రంకులహనుమయ్యగా — చిత్రించిన రామాయణ రహస్యాలకర్త యు, "పవిత్రవస్తువుల అపవిత్రీకరణ" మను నేరము చేసినవాడును, ఇట్టి నేరమునకు పై నుదాహరింపబడిన సుప్రీంకోర్టు తీర్పు ప్రకారము శిక్షార్హులును అయి యుండిరని పాఠకమహాశయులు గమనింతురుగాక.

రహస్యాలకర్త యగు కొత్త పండితుడు స్వవిషయ మిట్లు చెప్పు కొనెను—

విద్యాభ్యాసము— గురుపాదులు —

బ్రహ్మశ్రీ కంభంపాటి స్వామినాథశాస్త్రిలవారు.

(మీమాంసాశిరోమణి)

శ్రీమత్తిరుమల గుడిమెళ్ళ వరదాచార్యులవారు, ఎమ్. ఏ.

బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిలవారు, విద్వాన్.

శ్రీమాన్ కరి రామానుజాచార్యులవారు (వ్యాకరణశిరోమణి)

అని, ఇట్టి విద్వాంసుల యొద్ద చేసిన విద్యాభ్యాస మెట్లుండ వలెను?

"విద్య యొసగును వినయంబు వినయమునను
బడయు పాత్రత పాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుడు"

అన్నట్టి విద్య - వినయముద్వారా ధర్మాచరణముతో ఐహి కాముష్మికసుఖములకు సాధనమై యుండవలెను. ఈలక్షణములు ఈయనలో ఉన్నవా?

ఈయన వ్రాతకు ఆగురుపాదులు హర్షించిరా? ఆగురుపాదుల యొద్ద అభ్యసించిన ఈయన విద్య - పాము త్రాగిన పాలుగా పరిణ మించినది. ఈవిషయ మీ గ్రంథములో విశద మగును.

ఈ సమీక్షకై పరిశీలింపబడిన

# గ్రంథరాజములు

1. రామాయణము
2. అధ్యాత్మరామాయణము
3. రఘువంశము
4. పూర్వగాథాలహరి
5. విచిత్రరామాయణము
6. మహావీరచరితము
7. ఆంధ్రప్రభ
8. విష్ణుపురాణము
9. ఆనందరామాయణము
10. చంపూరామాయణము
11. శివపురాణము
12. అనుశాసనపర్వము
13. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము
14. మహాభాష్యము
15. భాష్యప్రదీపము
16. యోగదర్శనము
17. శాన్తిపర్వము
18. ధర్మప్రదీపము
19. లఘుశబ్దార్థసర్వస్వము
20. యుక్తికల్పతరువు
21. భవిష్యపురాణము
22. వనపర్వము
23. ధర్మసూత్రము
24. ధర్మతత్త్వపరిశిష్టము
25. తన్త్రవార్త్తికము
26. వీరరాఘవీయము
27. బృహన్నారదీయము
28. కలిశకవిజ్ఞానము
29. ఆంధ్రజ్యోతి
30. హరిజన్ పత్రిక
31. అశ్వఘోష॥ బుద్ధచరిత్ర
32. పద్మపురాణము
33. దేవీభాగవతము
34. శ్రీభాగవతము
35. వాయుపురాణము
36. హరివంశము

ఈ ప్రమాణముల నాధారము చేసికొని ఈగ్రంథము రచింపబడినది.

ఇట్లు గ్రంథకర్త.

# విషయసూచిక

శ్రీమహాగణాధిపతయే నమః.

# రామాయణ రహస్యాల సమీక్ష.

## పాయస ప్రదాన విషయము.

—♦ 'దశరథుడు ధర్మజ్ఞుడు కాదు, ధర్మాత్ముడు కాదు' అట! ♦—

దశరథమహారాజు ప్రాజాపత్యపురుషునివలన ప్రాప్తించిన పాయసము భార్యలు ముగ్గురికి ఇచ్చినట్లున్నది—

"కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా ।
అర్ధా దర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః ॥
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థ కారణాత్ ।
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యాఽమృతోపమమ్ ॥
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః ॥"

ఇక్కడ "కౌసల్యాయై పాయసార్ధం దదౌ" "అర్ధా దర్ధం సుమిత్రాయై దదౌ" అన్నపుడు కౌసల్య కిచ్చిన అర్ధములోని భాగమే సుమిత్ర కిచ్చినట్టు చెప్పవలసియున్నది. ఆ యిచ్చుట కౌసల్యకే సంభవము. దశరథునిచే ఆమెకు దత్తమైనది కనుక. అయితే 'నరపతిః సుమిత్రాయై దదౌ' అని దశరథు డిచ్చినట్లు చెప్పుట యెట్లు సరిపడు నందురా?

ఇక్కడ 'దదౌ' అన్నది అన్తర్భావితణ్యర్థము. 'దాపితవాన్' అను అర్థము కలది. ఇట్లు చూడ కౌసల్యచేత దశరథు డిప్పించెను. అని యర్థము.

"అవశిష్టార్ధం కైకేయ్యై దదౌ", "సుమిత్రాయై మహీపతిః పునరేవ ప్రదదౌ" ఇక్కడకూడ కౌసల్య కివ్వగా మిగిలిన పాయసార్ధమును కైకేయి కిచ్చెను. ఆమెకు దత్తమైనదానిలో భాగమును కైకేయిచేత సుమిత్ర కిప్పించెను. అనియే యర్థము. అని అధ్యాత్మ రామాయణవ్యాఖ్యాత శ్రీరామవర్మచే ప్రతిపాదింపబడినది.

ఈయర్థమునే కాళిదాసమహాకవి చెప్పెను—

'అర్చితా తస్య కౌసల్యా ప్రియా కేకయవంశజా ।
అత స్సంభావితాం తాభ్యాం సుమిత్రాం మైచ్ఛ దీశ్వరః ॥'

అర్చితా- జ్యేష్ఠా మాన్యా, కైకేయీ ప్రియా-ఇష్టా, అతో హేతోః ఈశ్వరః-భర్తా నృపః, సుమిత్రాం, తాభ్యాం సంభావితాం-భాగదానేన మానితా మైచ్ఛత్ ।

జ్యేష్ఠభార్య పూజ్యురాలు, కైకేయి ఇష్టురాలు. ఆ యిద్దరి చేతను వారివారి భాగములతో సుమిత్ర సమ్మానితురాలు కావలయు నని తలచెను.

'తే బహుజ్ఞస్య చిత్తజ్ఞే పత్న్యౌ భర్తు ర్మహీక్షితః ।
చరో రర్ధార్ధభాగాభ్యాం తా మయోజయతా ముభే ॥'

ఉచితజ్ఞుడైన దశరథుని అభిప్రాయము తెలిసికొని కౌసల్యయు, కైకేయియు తమ తమ పాయసములోని భాగములు సుమిత్ర కిచ్చిరి. అని.

రహస్యాలకర్త వ్రాత—'దశరథుడు కౌసల్య చేతిలో సగము పెట్టెనట. ఆవిడ వెంటనే దానిని గుటుక్కున మ్రింగివేసెనట! తక్కిన సగమును సుమిత్ర కీయగా ఆయమ్మ అట్లే చేతిలో ఉంచుకొన్నదట. దశరథుడు దానిని రెండుగాచేసి ఒక భాగమును కైకేయికి బంచెనట. ఆమెయు వెంటనే దానిని ఆరగించెను.

మిగిలిన అష్టమాంశమును పెద్దది సుమిత్రకే ఇచ్చెనట... దశరథుడు ధర్మజ్ఞుడు కాదు. ధర్మాత్ముడు కాదు' (పు11) అట!

'కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ', 'కైకేయ్యై చావ శిష్టార్ధం దదౌ' పాయసములో అర్ధము కౌసల్య కిచ్చెనని, మిగిలిన అర్ధము కైకేయి కిచ్చెనని, 'అర్ధా దర్ధం దదౌ చాపి సుమిత్రాయై' కౌసల్య కిచ్చిన అర్ధమునుండి భాగము సుమిత్ర కిచ్చెనని, కైకేయి కిచ్చినతరువాత అందులోని భాగము 'ప్రదదౌ చ సుమిత్రాయై పున

రేవ మహీపతిః' మరల సుమిత్రకు ఇచ్చెను. అనగా ఇప్పించెను అనియు, వాల్మీకములో నుండ - 'కౌసల్య చేతిలో పెట్టిన సగము ఆమె మ్రింగివేసెను. తక్కిన సగము సుమిత్ర కిచ్చెను' అని ఇది యేమి అర్థము? వీరు వ్రాసినవి 'వాల్మీకిరామాయణరహస్యాలు. ఇప్పుడు దశరథుడు ధర్మజ్ఞుడు కాడో, ఈయన అర్థజ్ఞుడు కాడో పాఠక మహాశయులు తెలిసికొందురుగాక.

"వాల్మీకముప్రకారము కైకేయి మూడవ భార్య. భోజరాజాదుల కావ్యముల ప్రకారము కైకేయి రెండవభార్య. అందువలననే భరతుడు మధ్యమాంబాసుతుడైనాడు' అట! (పు13)

భరతుడు మధ్యమాంబాసుతు డన్నది, కైకేయి మూడవభార్య అన్నది వాల్మీకమే. భరతుడు మధ్యమాంబాసుతు డగుటకు కైకేయి రెండవ భార్య కానక్కరలేదు.

ఈరహస్యాలకర్త —'దశరథునకు ఉంచుకొన్నవారు, తెచ్చుకొన్నవారు కాక, ధర్మపత్నులను పేరట ఉన్నవారు ముప్వురు' అనిరి.

ఆముగ్గురు గాక మిగిలినవారుకూడ దశరథుని భార్యలే.

'సుమన్త్రాఽఽనయ మే దారాన్ యే కేచి దిహ మామకాః ।
దారైః పరివృత స్సర్వై ర్ద్రష్టు మిచ్ఛామి ధార్మికమ్ ॥'

శ్రీరాముని వనగమనసందర్భములో దశరథుడు నాదారల నందరను రప్పింపుము. దార లందరితో కలిసి శ్రీరాముని దర్శింతు నని సుమంత్రునితో చెప్పెను.

అప్పుడు కైకేయీభవనమునకు దశరథదార లైన కౌసల్యాసుమిత్రాదు లెల్లరును వచ్చిరి. అని యున్నది.

దీనినిబట్టి కౌసల్యాదులు ముగ్గురిలో కనిష్ఠభార్య కైకేయి అయినను, ఈమెకు తరువాత భార్యలనుబట్టి మధ్యమాంబ కైకేయి అగును.

"న లక్ష్మణాఽస్మిన్ మమ రాజ్యవిఘ్నే
మాతా యవీయ స్యవిశంకితవ్యా ॥

'యవీయసీ కనిష్ఠా, కానిష్ఠ్యం మహిషీత్రియాపేక్షయా। 'న తేంబామధ్యమా' ఇత్యత్ర మధ్యమాత్వం సర్వరాజపత్న్యపేక్షయా'

అని కైకేయి మహిషీ త్రియములో కనిష్ఠ యని, సర్వరాజ పత్నులనుబట్టి మధ్యమ యని ద్వివిధముగా వాల్మీకమందే చెప్ప బడినది. ఇట్లుండ దశరథుని పత్నులను "ఆతడుంచుకొన్న వారు" అనుట, "భోజరాజాదుల కావ్యములప్రకారము కైక రెండవభార్య" అనుట అసంబద్ధ మగుటచే పరాస్తమైనది.

## ఆంజనేయ విషయము

1. "ఆంజనేయుని జన్మగాధ "రామాయణము రంకు" అనుప్రతీతికి ఆధారమైనదట!
2. "ఆతడు రామభక్తుడై తుదకు దేశములో దైవముగా వెలసెను" అట!
3. "ఆంజనేయుని కోవ వెదుకవలె నన్న అహల్య గాధ కావలసి యుండు" నట!
4. ఇంద్రసంబంధదోషమునుబట్టి అహల్యను గౌతముడు శపించెను.
5. అహల్యకు గౌతముడు కట్టుకొన్న పెనిమిటి; ఇంద్రుడు, సూర్యుడు ఉంచుకొన్న ఉపపతులు. అహల్యాగౌతములకు "అంజన" అను కూతురు పుట్టెను.
6. అహల్యకు ఇంద్రునివలన వాలి, శతానందుడు ఇద్దరు కలిగిరి. శతమఖుని ఆనందమువలన సంభవించిన వాడు కనుక శతానందు డాయె. ఈతడే జనకునికి పౌరోహిత్యములో కుదిరి బ్రతికెను" అట!
7. "మూడవ భర్తయైన సూర్యునివలన సుగ్రీవుడు పుట్టెను." అట! (పు 17)
8. వాలిసుగ్రీవుల పుట్టుకనుగూర్చి వాల్మీకములో మరొకపాఠ మున్నది—"ప్రజాపతేస్తు పౌత్రస్త్వం తద్దైవర్క్షరజస్సుతః" "సుగ్రీవా! నీవు ప్రజాపతికి పౌత్రుడవు" (పు 18)

ఇవి 8 అంశములు. ఈ ఎనిమిదవ యంశములో సుగ్రీవుడు ప్రజాపతికి పౌత్రుడని ఋక్షరజస్సునకు పుత్రుడని, చెప్పబడినది వాల్మీకములో మరొక పాఠమట!

అయితే 7వ యంశములో సూర్యునివలన సుగ్రీవుడు అహల్యయందు పుట్టెనన్నది ఎందులోని పాఠము? అది వాల్మీకములోనిది కానట్టే. ఈవాల్మీకిరామాయణరహస్యాలకర్త వాల్మీకములో లేనిది వాల్మీకమునకు విరుద్ధమైనది వ్రాయుట, అది ఎక్కడిదో తెలుపక దాటుట ఇది యేమి పని? నిర్మూలమైన ఈవ్రాత వాల్మీకివచన ప్రమాణముచేత ప్రతిహతమైపోయినది. ఇక 6వ యంశమును పరిశీలింతము—

"పూర్వగాథాలహరి"లో విచిత్రరామాయణపు వ్రాత తీసికొని వాలినిగూర్చి ఇట్లున్నది—

"ఇంద్రునివలన అహల్యయందు బుట్టిన కుమారుడు గౌతముడింట లేని సమయమున వాసవాదిత్యులు అహల్యతో రమించిరి. ఆమెకిద్దరు పుత్రులు పుట్టిరి.... వీరే వాలిసుగ్రీవులు" (విచిత్రరామాయణము)

'మన రహస్యాలకర్త తీసుకొన్నదిదియే. 6వ యంశములో "అహల్యకు ఇంద్రునివలన శతానందుడు కలిగినట్టు" చెప్పు ఈరహస్యాలకర్తను అడుగుచున్నాము.

ఇంద్రునివలన అహల్యకు శతానందుడు కలిగిన దెప్పుడు? 4వ అంశములో నున్నట్టు ఆ అహల్యకు గౌతముడు పెట్టిన శాపమునకు పూర్వమా? పరమా? పూర్వమన్నచో-'ఇంద్రుడు గౌతమరూపముతో అహల్యవద్దకు వచ్చి ఇది ఋతుకాలమా, కాదా? అన్న చర్చతో బని లేదని కలిసెను' (పుట 21)

అను తమ వ్రాత, అది ఋతుకాలము కాదనియే తెలుపుచున్నందున ఋతుకాలము కానపుడు కలియుటలో సంతతి కల్గుట అసంభవమే.

ఇంకొకటి— ఆ కలిసిన వెంటనే సంభవించినది అహల్యకు శాపము. ఆశాపవిముక్తి శ్రీరామదర్శన మగువరకు కానేలేదు. ఆమెకు శాపవిముక్తి కలిగించి, అక్కడనుండి ఆవెంటనే జనకుని యొద్దకు శ్రీరాముడు వెళ్ళెను. అప్పటి కప్పుడే "శతానందుడు జనకునికి పౌరోహిత్యములో కుదిరి బ్రతుకుచుండెనామె. ఇట్టి శతానందుడు అహల్యకు ఇంద్రునివలన పుట్టిన దెప్పుడు?

ఇంకొకటి—అహల్యకు గౌతమశాప మిది—

'ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి ।
వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ ॥
అదృశ్యా సర్వభూతానా మాశ్రమే త్వం భవిష్యసి ।
యదా చైత ద్వనం ఘోరం రామో దశరథాత్మజః ॥
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతా భవిష్యసి ।'

నీవు వేలకొలది సంవత్సరములు సర్వభూతములకు అదృశ్యురాలవై వాయుభక్షణముతో ఈ ఆశ్రమమం దుండెదవుగాక! శ్రీరాముడు ఇక్కడకు రాగలడు. అప్పుడు నీవు పవిత్రురాల వగుదువు.

ఇట్టిది శాప మగుటచే శాపానుభవకాలములో వేలకొలది సంవత్సరములు సర్వులకు అహల్య అదృశ్యురాలే. శాపవిముక్తి శ్రీరామదర్శనపర్యంతము కానేలేదు. ఆమెకు శాపవిముక్తిని కలిగించిన శ్రీరాముడు అక్కడనుండియే జనకుని యొద్దకు వెళ్ళెను. అప్పటికప్పుడే శతానందుడు జనకుని పౌరోహిత్యములో కుదిరి బ్రతుకుచుండెనామె.

ఇట్లు చూడ ఇంద్రునివలన అహల్యకు శతానందోత్పత్తి శాపమునకు పూర్వమా కాదు. శాపానంతరమా? కాదు. శాపవిముక్త్యనంతరమా కాదు. శతానందు డహల్యకు ఇంద్రునివలన పుట్టెనా! ఈ విషయంశములో వ్రాసినట్లు ఇంద్రుడు, సూర్యుడు అహల్యకు కంచు కొన్న ఉపపతులా! చాలు చాలు.

6వ అంశ మిట్లు పరాస్తమైనది.

ఇక 7వ అంశమును పరిశీలింతము—

'అహల్యాగౌతములకు అంజన అను కూతురు పుట్టె' నట! 'అమ్మకు అబ్బకు పుట్టిన అసలుబిడ్డ 'అంజన' సంగతి చూతము.

ఇంటిలో ఈగల మోతవలె అమ్మ చేయుచున్న దురాగతములను ఆబిడ్డ పసిగించుకొని ఇంద్రాదుల రాకను గూర్చి తండ్రి చెవిలో వేసెను. ఇది తల్లి తెలిసికొని శాపమిచ్చెను-ఓసీ ముండా! నీవు కోతిముండవయ్యెదవుగాక. నీకొక కోతిమగడే దాపరించుగాక! అని. ఆబిడ్డ అట్లే అయి 'కేసరి' అను కోతినే కట్టుకొన్నదట. ఆపైన ఆఅంజనకు వాయుదేవుడు మరొక భర్తగా కుదిరెనట.

'ఆయిరువురకు బుట్టినవాడే శ్రీరామభక్తుడైన మన ఆంజనేయులువాడు' అట. (పు 20)

ఈరామాయణరహస్యాల కర్త వ్రాతకు "పూర్వగాథాలహరి" లో పేర్కొనియున్న "విచిత్రరామాయణము" లోని వ్రాత ఆధారము. ఆవ్రాతను కూడ ఇక్కడ చూపుచున్నాము—

"అంజన—అహల్యాగౌతముల కుమారిత... ఒకనాడు గౌతముడు లేని సమయమున సూర్యుడు వచ్చెను. ఆతని తేజస్సుల కామె గుడ్డిదయ్యె. సూర్యుడు యహల్యతో రమించెను. ఆతనివలన కుమారుడుకూడ కలిగెను. యహల్యకు మరియొక కుమారుడు కూడ పుట్టెను.

గౌతముడు కుమారుల నెత్తుకొని కూతుని నడిపించుచు సముద్రతీరమున తిరుగుచుండ— 'తండ్రీ! కుమార్తెను నడిపించి పరుల బిడ్డల నెత్తుకొనెదవా? అనికూతు రనగా గౌతముడు సందేహించి వీరు పరుల బిడ్డలైరేని వీరిముఖములు వానరముఖము లగు నని శపించి వారిని సముద్రములో పడద్రోచెను. వారే వాలిసుగ్రీవులు.

తన గుట్టు బయల్పెట్టె నని అహల్య ఈమెను గ్రుడ్డిదానవై యుండు మని, నీయందు వానరుడు జన్మించు నని శపించెను. (విచిత్ర రామాయణము)

# విచిత్రరామాయణముయొక్క యోగ్యత

ఇందులో వ్రాసినట్లు అహల్యయొద్దకు వచ్చిన సూర్యుని తేజస్సునకు "అంజన" గ్రుడ్డిది కాగా అహల్య కాకపోవుటేమో? సూర్యుడు అహల్యతో రమింప కుమారుడు పుట్టెనట! ఆమెకు మరియొక కుమారుడు పుట్టెనట! అదెప్పుడు? గౌతముడు, వారు పరుల బిడ్డలని ఎరుగనివాడట! అంజన చెప్పగా వానిని శపించెనట! అంతటి అజ్ఞాని వానరముఖులగుదురని వారిని శపింప వారట్లయిరా? ఇందరి సంబంధముచుబట్టి ఇందురిని, అహల్యను శపించి వేలకొలది సంవత్సరములు అహల్యను సర్వులకు అదృశ్యురాలిని చేసిన ఆ గౌతముడు, ఆపరుల బిడ్డలను శపించి, ఆపరులను, ఆ అహల్యను శపింపక సహించి ఊరకుండునా?

తన శాపముతో, శ్రీరామదర్శనపర్యంతము నిరాహారయై సర్వభూతములకు అదృశ్యురాలై భస్మశాయినియై తపించునట్టిఅహల్యతో పరు లెవరో రమించిరా? సూర్య తేజస్సుచేతనే గ్రుడ్డిదైపోయిన "అంజన"ను తల్లి అహల్య తనగుట్టు బయల్పెట్టె నని గ్రుడ్డిదానవై యుండు మని శపించెనా? ఇంత అసంబద్ధ మీ వ్రాత.

మన 'రహస్యాలకర్త', దీని కభినందించుచు దీనికి రంగులువేసి 'దురాగతములు చేయు అహల్యచే నీవు కోతిముండ వగుదు వని శపింపబడిన 'అంజన' అల్లే అయి 'కేసరి' అను కోతినే కట్టుకొనినట్లు, ఆ అంజనకు వాయుదేవుడు మరొక భర్తగా కుదిరినట్టు వ్రాసి ఆయిద్దరకు బుట్టినవాడే మన ఆంజనేయులవారు'

'ఆంజనేయునకు గౌతముడు మాతామహుడు' అని వ్రాత సాగించిరి.

'పూర్వగాథాలహరి'లో అక్కడనే ఉన్న మరొక గాథ–

అంజన—వానరస్త్రీ. కుంజరు డనువాని కూతురు. కేసరియొక్క భార్య. ఈమె విహరించుచుండగ వాయుదేవుడు చూచి మోహించి నీకు కామరూపుడును, బలసంపన్నుడును అగు కుమారుడు

పుట్టును. నీ పాతివ్రత్యమునకు భంగము కలుగదు. అని చెప్పి ఆమెతో కలిసెను. ఆమెకు అంజనేయుడు పుట్టెను" (రామాయణము) ఇది మనరహస్యాలకర్తకు, నచ్చక అసంబద్ధమైన ఆవిచిత్రరామాయణస్థమే నచ్చినదా!

"హనుమాన్ హనూమానితి మహో నయం వీరవాదః.
అత్ర భవతో జాతమాత్రస్య సతతపరిభ్రాన్త దేవాసురాణి ఆశ్చర్యాణి శూ్రయన్తే, అపిచ—
"యద్వాజ్రలక్షణే వీర్యం య ద్వాయా వా సమున్నతమ్ ।
యద్వాలిని మహోబాహా తచ్ఛ వీరే హనూమతి ॥"

ఏవ మీాదృశో హేమగిరివాస్తవ్యస్య తత్రభవతః ప్లవంగపుంగవాఒనీకవృద్ధయూధపతేః కేసరిణః క్షేత్రసంభవః సూను రాంజనేయో హనుమా న్నామ.యస్య రేతోధాత్ భగవాన్ మాతరిశ్వా" (మహావీరచరితమ్)

వీరప్రశస్తికల పూజ్యు డగు హనుమంతుడు పుట్టిన వెంటనే దేవాసురులకు భయసంభ్రమాశ్చర్యములు కలిగించిన చేష్టలు వినబడుచున్నవి. (రామాయణములో)

వజ్రహస్తు డగు దేవేంద్రునియం దున్న బలము, వాయువునందలి బలము, వాలియందలి బలము కూడ హనుమంతునియం దున్నది (తన బలము తనకు తెలియకుండు నట్టి శాపము)

ఇట్టి ఈతడు వానరసేనాధిపతి యగు కేసరికి క్షేత్రమగు అంజనయందు వాయుదేవునివలన సంభవించెను.

ఆ పూర్వగాథాలహరిలోనే హనుమంతునిగూర్చి ఇట్లున్నది- "హనుమంతుడు అంజన పుత్రుడు. (అంజన వానరస్త్రీ, అని వెనుక చెప్పబడినది) కేసరి యను వానరుని భార్య" కేసరి తపస్సున కేగుచు వాయువును గొలుచుచుండు మని తన భార్యతో చెప్పెను. ఆమె వాయువును సేవించుచుండెను. అంజన భక్తికి వాయువు ప్రసన్నుడై

తన గర్భమందున్న శివుని వీర్య మామె కిచ్చెను. దాన నామె గర్భ వతియై కుమారుని గనెను. ఈతడే ఆంజనేయులు..."(రామా.భార)

ఇట్లు రామాయణ భారతములలో గల గాధలు 2, 3 పేజీలు వ్రాయబడినవి.

మన రహస్యాలకర్త దీని నెత్తనే లేదు. ఇక ఈయన తీసుకొన్న విచిత్రరామాయణమును గూర్చి కొంచెము చెప్పుకొందము—

ఇది— శ్రీకాకుళముతాలూకా వాడాడగ్రామము బోర్డు స్కూల్ ప్రధానోపాధ్యాయుం డగు కళ్లేపల్లి వెంకటనరసింహమూర్తి చే రచింపబడినట్టిది. కృతికర్తృవంశానుక్రమణికలో "సృష్టికరణాన్వయాంబుధిశీతకరుడ"

దీనిలో కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయము, చిత్రపటము కలదు. ఇది 1900 జూన్ నాటిది.

ఇంకొక విచిత్రము వినుడు—రావణవధానంతరము భర్తతో సహగమనము చేయుట కనుజ్ఞ నిమ్మని మండోదరి రామునికోరెనట! శ్రీరాముడు—నాభార్య నపహరించిన వాని భార్యను అన్యుని కిచ్చెద నని నేను ప్రతిజ్ఞచేసియుంటిని గనుక నిన్ను విభీషణుని భార్యగాచేసెద ననెనట! ఆమె లంకేశ్వరుని పట్టపురాణి నయి సంతానవంతురాల నయి లోకగర్హితకార్యము నేనెట్లు చేయుదు నన్నదట.

శ్రీరాముడు—నీవు సంశయింపకుము. నీపతివ్రతాత్వమునకు భంగము కలుగ దన్నాడట! చూడుడు—

ఉ॥ ఇంతుల మిన్న............నా
పంతము చెల్లు నట్లుగ.........న విభీషణుం
గాంతుని గాగ గైకొని సుఖంబున నుండు మటంచు నమ్మహీ
కాంతుడు పల్క నయ్యబల......ఇట్లనెన్.

క. ఓ యవనీశ్వర లంకా
నాయకునకు దేవి నయ్యు నందనుల మరు

త్ప్రియుల గని యిపు డొరులకు
జాయం గాగలనె లోకజనములు దూరన్.

వ. అనిన నా రామచంద్రుం డమ్మండోదరిం గని నీ విందునకు సందియం బందనేల ... భవత్పతివ్రతాత్వంబునకుం గొరంత రాదనిన నవ్వనజనయన యియ్యకొని' అట.

ఈ కవి, వితంతువివాహప్రవర్తకుడైన వీరేశలింగముగారి శిష్యు డని, ఈ వ్రాతయు ఈయన చిత్రపటము స్పష్టపరచుచున్నవి. ఈనాటి వీరి దురభిప్రాయము ఆనాటి వారి కంటెంచుట హేయము.

ఇట్టి పుస్తకమును ప్రమాణీకరించుచు "రహస్యాలకర్త, అహల్యాగౌతములను, ఆంజనేయుని నోటికి వచ్చినట్టు దూషించిరి. 'శాంతం పాపమ్' ఆవిచిత్రరామాయణపువ్రాత ఎంత అసంబద్ధమై అప్రమాణమై యుండెనో నిరూపించియే యున్నాము.

దీనితో 5వ యంశము పరాస్తమై పోయినది. ఇక 4వది గౌతమశాపమే. ఆంజనేయుని కోవ వెదుకవలె నన్న అహల్య గాధ కావలసియుండును. అను 3వ అంశము పరాస్తమైనది.

ఇక 2వ అంశము— "ఆతడు రామభక్తుడై తుదకు దేశములో దైవముగా వెలసెను" అన్నది.

"గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వన్దేఽనిలాత్మజమ్ ॥"

అని కీర్తింపబడువాడు దైవము కాడా?

దూరీకృతసీతార్తిః ప్రకటీకృతరామవైభవస్ఫూర్తిః ।
దారితదశముఖకీర్తిః పురతో మమ భాతు హనుమతో మూర్తిః ॥
బుద్ధి ర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వంచ హనూమత్ స్మరణా ద్భవేత్ ॥"

అని కీర్తింపబడువాడు దైవము కాడా?

"మయ్యేవ జీర్ణతాం యాతు యత్త్వయోపకృతం హరే ।
నరః ప్రత్యుపకారార్థీ విపత్తి మభికాంక్షతి ॥"

ఆంజనేయా! నీవు చేసినట్టి సముద్రలంఘన, సీతాదర్శన, సీతా సంభాషణ, సీతాప్రేషితాఽలంకారప్రదర్శన రూపమైన ఉపకార మేది యున్నదో అది నాయందే జీర్ణమైపోవుగాక.

ప్రత్యుపకారము చేయ దలచినపుడు అట్టి ప్రత్యుపకారము కావలసిన అవసర మాతనికి రావలెనని కోరుదురు. అట్టి అవసరమే నీకు లేకుండుగాక. అనుచు రామప్రభువుచేత ఆలింగనము చేసికొన బడినవాడు రామభక్తుడు కాడా? ఇట్లు 2వ యంశము పరాస్తము.

"ఆంజనేయుని జన్మగాధ రామాయణము రంకు అను ప్రతీతికి ఆధార మైనది" అను 1వ అంశము, "అహల్యాగౌతములకు అంజన కూతురు" అన్న 5వ అంశ మపాస్త మెప్పుడైనదో అప్పుడే "దండా పూపికా" న్యాయమున ఇదియును అపాస్తమై పోయినది.

ఆంజనేయుని జన్మగాధనుబట్టి "రామాయణము రంకు" అను" ప్రతీతి కలిగె ననుట అసంబద్ధప్రలాపము.

ఇట్లు రహస్యాలకర్త వ్రాతలోని 6అంశములు నిరస్తములు.

—♦ రామాయణమును గూర్చి థాయ్‌లాండు రాయబారి ప్రసంగము ♦—

ఇక్కడ, ఇలయుత్తాంగుడి— ఆగమశిల్పసదస్సులో థాయ్ లాండు రాయబారి—శ్రీ సుకిచేనిమ్మనీహేమంద చేసిన ప్రసంగము వినిపించుచున్నాము—

ఆంధ్రప్రభ 28-9-62.

"రామాయణం" థాయ్ సాహిత్యంలో వెల లేని మూలధనం. హనుమంతుని లీల థాయ్ ప్రజలహృదయ ఫలకాలపై చెరగని చిత్రం. భారత దేశంకంటె భారతీయత థాయ్‌లాండ్ లో ఎక్కువగా ఉన్నట్లు తనకు తోచిన" దని శ్రీ హేమంద వక్కాణించారు......

థాయ్ ప్రజలకు భారత దేశం మాతృస్థాన మని వారు భావిస్తు న్నారని శ్రీ హేమంద వివరించారు.

ఈ ప్రసంగమునుబట్టి 'రామచరిత్ర' మైన రామాయణమును, రామభక్తు డగు హనుమంతుని దూషించు వ్యక్తులు సిగ్గుపడి తల వంచుకొని పడియుండవలసియున్న దని మనవి చేయుచున్నాము.

## అహల్యా పవిత్రతా నిరూపణము.

మన రహస్యాల కర్త "అపవిత్రురాలైన అహల్యకు పవిత్రత నారోపించినా" రనుటచే దానిపై చెప్పుదము—

ఆమె కపవిత్రత ఇంద్రసంబంధమూలకమే కద! దానికే కదా ఆ గౌతమశాపము, ఆ శాపములోనే—

"యదా చైత ద్వనం ఘోరం రామో దశరథాత్మజః ।
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతా భవిష్యసి ॥
మత్సకాశే ముదా యుక్తా స్వం వపు ర్ధారయిష్యసి ।

శ్రీరాము డీవనమున కెప్పుడు వచ్చునో అప్పుడు నీవు పవిత్రురాల వగుదువు. నా సమీపమున సంతోషముతో నీవు నీ స్వస్వరూపమును ధరింపగలవు"

అనుచు శ్రీరామదర్శన మగుటతో పవిత్రురాలవై నా యెదుట స్వస్వరూపము ధరింతు వని చెప్పలేదా?

"రామోపి దర్శనమాత్రేణాఽహల్యా మపాపాం చకార"
విష్ణుపురాణము–4 అం, అ 4.

'రామో దాశరథి శ్శ్రీమా నాగమిష్యతి సానుజః ।
తదైవ ధూతపాపా త్వం రామం సంపూజ్య భక్తితః ॥
పరిక్రమ్య నమస్కృత్య స్తుత్వా శాపా ద్విమోక్ష్యసే ।
పూర్వవ న్మమ శుశ్రూషాం కరిష్యసి యథాసుఖమ్ ॥"
(అధ్యాత్మరా- స 5)

"శ్రీరామచంద్రో నిజపాదపద్మస్పర్శేన తాం గౌతమ ధర్మపత్నీం । నిష్కల్మషా మద్భుతరూపయుక్తాం, చకార దేవః కరుణాసముద్రః ।" ఆనందరా । అ 3.

శ్రీరామచంద్రుడు అహల్యను నిష్కల్మషురాలిని చేసెనని ఆనందరామాయణమందే యుండగా, దానిని చూడక, చూచినను-చూపక- "మునిరూపమహేన్ద్రేణ భుక్తాం రహః" అని ఆనంద రామాయణ మన్నది" అని ఈకొత్త పండితుడు వ్రాయుట సారస్వత ద్రోహము కాదా!

"అహల్యా నామ గౌతమస్య మహర్షే ర్ధర్మపత్నీ ।
సేయ మద్య రామభద్ర తేజసా తస్మా దేనసో నిరముచ్యత ॥"
(మహావీరచరితమ్)

'తదేనా మేనసో ముక్తాం ప్రతిగృహ్ణాతు గౌతమః ।
ఇతి తస్యాశ్రమం భేజే సాకం రామేణ కౌశికః ॥"

ఇట్లు రామాయణ, విష్ణుపురాణ, అధ్యాత్మరామాయణ, ఆనంద రామాయణ, మహావీరచరిత, చంపూరామాయణములు ఏకగ్రీవముగా శ్రీరామదర్శనముతో అహల్యాపవిత్రతను, అహల్యాగౌతమ దాంపత్యానుబంధమును చాటుచుండ, ఆమెకు లేనిపవిత్రత నారోపించినారా? "సిగ్గులేని అహల్యకు రాయిగా పడియున్న మొద్దునకు పవిత్రత నారోపించి ఆ రాతిని నాతిగా జేసి ఖ్యాతిని బడసిన అవతారపురుషునిచే, అవ్యభిచారిణికి ఒకానొక సనాతనమ్మన్యుడు వ్రాసిన రామాయణములో సిగ్గులేక, అభివందనాదికములు చేయించెను." అట! (పు 22)

వీరు అకార్యమునకు సిగ్గుపడవలె నన్నారు. సంతోషము. అపవిత్రులకు పవిత్రత నారోపించుట అకార్యమైనట్లు పవిత్రులకు అపవిత్రత నారోపించుటకూడ అకార్యమే. అహల్య అపవిత్రయైనంత కాలము అదృశ్యురాలై యుండి శ్రీరామదర్శనమూలక మగు పవిత్రతతో స్వస్వరూపము ధరించి గౌతమాదృతయై యొప్పిన దని రామాయణము మొదలుగా ప్రదర్శింపబడిన గ్రంథములు ఘోషించుచుండ ఆమె అపవిత్ర యనుట అకార్యము.

"శాపస్యాన్త ముపాగమ్య తేషాం దర్శన మాగతా ।
రాఘవౌ తు తత స్తస్యాః పాదౌ జగృహతు స్తదా ।
స్మరన్తీ గౌతమవచః ప్రతిజగ్రాహ సా చ తౌ ।
పాద్య మర్ఘ్యం తథాఽఽతిథ్యం చకార సుసమాహితా ।
పుష్పవృష్టి ర్మహ త్యాసీ ద్దేవదుందుభినిస్స్వనైః ॥"
(బాల-స-49)

శాపాన్త మగుటచే ఆ అహల్య విశ్వామిత్రరామలక్ష్మణులకు దృశ్యురాలయినది. రామలక్ష్మణులు ఆమె పాదములకు అభివందనము చేసిరి. ఆమె వారికి అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించినది. పుష్ప వృష్టి, దేవదుందుభినినాదములు జరిగినవి.

"ప్రత్యపద్యత చిరాయ యత్పునః
చారు గౌతమవధూ శ్శిలామయీ।
స్వం వపు స్స కిల కిల్బిషచ్ఛిదాం
రామపాదరజసా మనుగ్రహః ॥" (రఘువంశము)

పాపహారమైన రామపాదరజఃప్రభావముచేత చిరకాలము శిలామయమై యున్న గౌతమపత్ని మనోహరమైన స్వస్వరూపమును పొందినది.

అని కాళిదాసమహాకవి చెప్పుటచేత రహస్యాల కర్త వ్రాసి నట్లు 'రాయిగా పడియున్న మొద్దే' మనోహరరూపముగల స్వస్వరూప మును ధరించి రామలక్ష్మణులకు గోచరించిన దని, వాల్మీకిమహర్షి చెప్పినట్లు రామలక్ష్మణులు ఆమెపాదముల కభివందనము చేసి రని, ఆమె వారికి అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించెనని, పుష్పవృష్టి కురిసె నని స్పష్టమగుచుండ, అహల్యయొక్క పవిత్రతలో సంశయ మెవరికి!

ఇట్టి స్థితిలో— "ఆ వ్యభిచారిణికి ఒక సనాతనమన్మన్యుడు అవతారపురుషునిచే సిగ్గులేక అభివందనాదికములు చేయించెను" అను ఈ

పండితమ్మన్యుని ఈమాట ఎవరోఒకనికే కాదు. వాల్మీకిమహర్షికి—

"న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి ।
ప్రకాశం యది వా రహః విదితం తే భవిష్యతి ॥
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమాం"

అనుచు కావ్యమందు నీవాక్కు ఏ యొకటియు అనృతము కానేరదు నీకు ప్రకాశ మయినదియు, అప్రకాశమగునదియు విదితమగును. పుణ్యమయిన రామకథను రచింపుము. అని బ్రహ్మచేత అనుగ్రహముతో ప్రోత్సహింపబడి రామాయణము రచించిన వాల్మీకి మహర్షికి, తదనుయాయులైన ప్రదర్శిత గ్రంథకారులకును గూడ తగినది. రామాయణములోనే ఆమెకు సంభవించిన దోషము చెప్పబడినది. దానికి శ్రీరామాగమనము. అహల్యాస్వరూపదర్శనము, ఆమెతో గౌతమానుబంధము చెప్పబడినది. ఇదంతయు గౌతమ శాపనిర్దిష్టమే.

ఆవిధముగా శాపవిమోచన మై ఆగౌతమునిచేతనే ఆదరముతో స్వీకరింపబడినట్టి ఆఅహల్యను ఈనాడు వ్యభిచారిణి అని రహస్యాలకర్త అన్నపుడు సిగ్గులేక అని ఎవరినోఅన్న వీరికి అది యున్నదేమో పాఠక మహాశయులు ఆలోచింతురుగాక.

## గౌతమమహర్షి విషయము

ఈమహర్షి అహల్యాసమేతుడై ఈశ్వరు నారాధించి స్తుతించిఅంజలి ఘటించి యుండ ఈశ్వరు డిట్లు పలికెను —"త్వదీయదర్శనా ల్లోకా నిష్పాపా శ్చ భవన్తిహి। ఉపద్రవ స్త్వయి మునే యైః కృతస్తు దురాత్మభిః। తే పాపాశ్చ దురాచారా హత్యావన్త స్త ఏవహి। ఏతేషాం దర్శనా దన్యే పాపిష్ఠా స్సంభవన్తు చ॥

(శివ... కోటి. సంహితా అ26)

నీదర్శనమువలన లోకులు పవిత్రులగుదురు. నీయెడల దోష

మును కల్పించినవారు పాపాత్ములును, దురాచారులును. వారిని దర్శించినవారు పాపిష్ఠు లగుదురు. అను ఈయాశ్వరోక్తి ఆమహర్షి పూజ్యతకు నిదర్శనము. అట్టి అహల్యాపతి యగు గౌతమమహర్షిని దూషించినవారు దురాత్ము లని దీని సారాంశము.

## దేవేంద్రుడు

ఈతడు లోకపాలకుడు; స్వర్గాధిపతి; దేవతా శ్రేష్ఠుడు; త్రిమూర్తులకు రక్షణీయుడు; వారివారి తపోనిష్ఠను విఘ్నములు కలిగించి పరీక్షించువాడు. లోకక్షేమముకొరకు ఎవరి తపశ్శక్తుల నేవిధముగా క్షీణింపజేయవలయునో ఆవిధముగా చేయుచుండువాడు.

ఇట్టి అధికారము కల ఈతడు దేవతలతో చెప్పెను—

"కుర్వతా తపసో విఘ్నం గౌతమస్య మహాత్మనః । క్రోధ ముత్పాద్య హి మయా సురకార్య మిదం కృతమ్ ॥ శాపమోక్షేణ మహతా తపోఽస్యాఽపహృతం మయా ॥" (బాల-స 49)

మహాత్ముడగు గౌతముని తపస్సునకు విఘ్నము కలిగింపదలచి, నాచేత ఆయనకు ఆగ్రహము కలిగించి సురకార్యము సాధింపబడినది. మహాశాపము పెట్టుటతో ఆయన తపస్సు అపహృతమైనది. అని.

ఈకారణముచేతనే రహస్యముగా అంతర్ధానము కాక గౌతమ రూపముతో ఆమహర్షి యెదుటకే వెళ్ళెను. అది కాముకవ్యాపార మైనచో అట్లు చేయునా?

మరియు, ఆ ఆశ్రమములో స్వస్వరూపముతో గాక గౌతమ రూపముతో ప్రవేశించెను. స్వస్వరూపముతో ఆమెను సమీపించుట అసంభవమని, గౌతమరూపముతోనే అది సంభవమని చనువుతో మాటలాడి లోబరచుకొనవచ్చునని ఆరూపముతో ప్రవేశించెను.

అందుచేత ఇంద్రుడు కాముకు డనికాని, గౌతమపత్నికి ఇంద్రునియం దభిలాష యని కాని మతిమంతుల కనిపించునా?

విశ్వామిత్రుడు అహల్యావృత్తాంతమును చెప్పుచు రామలక్ష్మణులను ఆ ఆశ్రమమునకు తీసికొని వెళ్ళెను.

ఇంద్ర-అహల్యా-సంబంధమును విన్నట్టి రామప్రభువు అహల్యది తప్పనికాని, ఇంద్రునిదే తప్పనికాని ఏమియు అనలేదు. ఏమి కారణము ?

"నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్ ।
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సదా ॥"

అను ప్రమాణమును బట్టి ప్రజారక్షణార్థమై తప్పపని ఒకప్పుడు కర్తవ్య మగుటచేతను, అది కాముకవ్యాపారము కాకపోవుటచేతను ఇంద్రుని అనలేదు.

"దేవానా మస్మి వాసవః" అని భగవద్గీతలో దేవతలలో దేవేంద్రుడను నేనే అని చెప్పబడియున్నవాడు.

ఇట్టివాడు తనకు గౌతముడు శాపము పెట్టవలె ననియే ఆయన యెదుటకు స్వయముగా వెళ్ళెను. ఆశాపమునకు తట్టుకొను శక్తి తన కుండుటచేతనే అట్లు వెళ్ళెను. ఆమహర్షికి ఆగ్రహము వచ్చుటకే అట్లు వెళ్లెను. తన్మూలమున ఆయన తపశ్శక్తిభంగముతో, సురకార్యసాధనముకొరకే అట్లు వెళ్లెను. ఇట్టి దేవేంద్రుని మతిమంతులు పామరుడని భావింతురా ?

మన రహస్యాలకర్త — "అహల్యాగౌతములు అంతవారు, మహేంద్రులవారు ఇంతవారు.

ఇట్టివారే మనకు శ్రీమద్రామాయణములో పూజ్యులైన ఆదర్శమూర్తులు. ఇంతకన్న లోకములో రంకుకథ లేముండును? రంకుకథలతో నిండినదే రామాయణము," (పుట 22)

అని వ్రాసెను. భవభూతి - కాళిదాసాది - మహాకవుల దృష్టికి శిరోధార్యమైన రామాయణము వీరి దృష్టికి రంకుకథలతో నిండిన దయినది. బుద్ధిదోష మంతపని చేయును. అది రామాయణదోషమా? బుద్ధిదోషమా? కనుకనే,అశ్వము, శస్త్రము, శాస్త్రము ఇత్యాదులను ప్రవర్తింపజేయువా డెట్టివాడగునో అట్టివే అవియు

వ నని చెప్పబడినది—

"అశ్వ శ్శస్త్రం శాస్త్రం వీణా వాణీ నరశ్చ నారీ చ ।
పురుషవిశేషం ప్రాప్తా భవన్తి యోగ్యా అయోగ్యాశ్చ ॥"

## గౌతమ మహర్షి

"కశ్యపోఽత్రి ర్వసిష్ఠ శ్చ భరద్వాజోఽథ గౌతమః ।
విశ్వామిత్రో జమదగ్ని స్సాధ్వీ చైవా ప్యరుంధతీ ॥"

వీరు సప్తర్షులు. వీరు సంచారముచేయుచుండగా వృషాదర్భి మహారాజు వారికి ధనమీయదలచి ప్రతిగ్రహింపవలసినదని కోరెను.

రాజప్రతిగ్రహము మేము చేయ మని చెప్పి వారు వెళ్ళు చుండిరి. అప్పుడు మహారాజు ఉదుంబర (మేడి) ఫలము లిచ్చునట్లు భృత్యులకు చెప్పి పంపగా—

"ఉదుంబరా ణ్యథాన్యాని హేమగర్భా ణ్యుపాహరన్"

ఇందులో బంగార ముంచినట్టి ఫలములనుగూడ వారు తెచ్చి ఇవ్వ బోవ, వారు తీసికొనక వెళ్ళిరి.

అది భృత్యులు మహారాజునకు దెలుపగా ఆతడు వారికి ప్రతిక్రియ చేయదలచి హోమప్రక్రియ నవలంబించే 'కృత్య'ను ఆవిర్భ వింపజేసి ఆవ్యక్తికి 'యాతుధాని' అని పేరు బెట్టి, నీవు ఆమహర్షుల యొద్దకు వెళ్ళి వాని నామార్థము లడిగి తెలిసికొని ధారణచేసి తరువాత వారిని నశింపజేయుము. అని చెప్పగా అట్లే అని ఆమె వెళ్ళి ఒక సరోవరతీరమం దుండెను.

అంతట మహర్షులు ఆ సరోవరతీరమం దున్న తామరతూడులకై సరస్సులో ప్రవేశించునపుడు ఆ యాతుధానిని చూచి మేము తామర తూడులను గ్రహింప వచ్చితి మనగా ఆమె ఇట్లన్నది—

"ఏకైకశో నామ మే ప్రోక్త్వా తతో గృహ్ణీత మా చిరమ్"

మీరొక్కొక్కరే మీ మీ నామార్థములు నాకు తెలియ జెప్పి తీసికొనుడు. అని.

అప్పుడు, అత్రి, వసిష్ఠుడు, కశ్యపుడు, భరద్వాజుడు తమ తమ నామనిర్వచనములతో నామార్థములను తెలుపగా ఆ నామార్థములు దురవగాహము లగుటచే—'నైత ద్ధారయితుం శక్యం గచ్ఛాఽవతర పద్మినీమ్' అనుచు వారిని సరస్సులో ప్రవేశపెట్టుచుండెడిది.

తరువాత గౌతముడు ఇట్లు చెప్పెను—

'గోదమో దమతోఽధూమోఽదమ స్తే సమదర్శనాత్ ।
విద్ధి మాం గౌతమం కృత్యే యాతుధాని నిబోధ మామ్ ॥'

నీలకంఠీయమ్ - గోదమ ఇతి ।

'గోపదార్థం స్వర్గం భూమిం చ దమయతి వశీకరో తీతి గోదమః, తత్ర హేతుః దమత ఇతి. దమేన ఇన్ద్రియ జయేన దమయతీతి జితేంద్రియత్వాత్, గాం ద్యాం చ దమితుం శక్తోస్మీత్యర్థః। అధూమః, నిర్ధూమాగ్నితుల్యః ।

అతఏవ అదమః అన్యేన దమితు మయోగ్యః, తత్ర హేతుః— తే త్వయి, సమదర్శనాత్ సమస్య బ్రహ్మణో దర్శనాత్, 'నిర్దోషం హి సమం బ్రహ్మ' ఇతి భగవద్వచనాత్ ॥

'తస్య హ దేవాశ్చ నాఽభూత్యా ఈశతే ।
ఆత్మా హ్యేషాం స భవతి ॥' ఇతి శ్రుతేః ॥

తస్య బ్రహ్మవిదోఽనైశ్వర్యాయ దేవాశ్చ దేవా అపి న ఈశతే న సమర్థా భవన్తి । కిముత నిస్సారా యాతుధానా ఇతి శ్రుత్యర్థః । అత్ర దకారస్థానే తకారం కృత్వా గౌతమ ఇతి నిపాత్యతే । త్వయా వహ్నివ ద్దుష్ప్రధర్షోఽహ మిత్యర్థః' ఓ యాతుధానీ! గోదమో దమతః, ఇంద్రియజయముచేత, గోదమః - గోశబ్దార్థమైన భూమిని, స్వర్గమును వశీకరించువాడను, జితేంద్రియుడ నగుటచే స్వర్గమర్త్యలోకములను వశపరచుకొనగలవాడను.

అధూమః- పొగలేని అగ్నితో సమానుడను. కనుకనే అదమః- ఇతరునిచేత తిరస్కరింపదగనివాడను, ఏమనగా- తే, త్వయి, సమదర్శనాత్ - బ్రహ్మస్వరూపమును నీయందు దర్శించువాడ నగుటచేత,

బ్రహ్మజ్ఞానియొక్క ఐశ్వర్యభంగమును దేవతలుకూడ చేయజాలరు. నిస్సారులైన యాతుధానులమాట చెప్పవలెనా?

ఇట్టి అర్థము కల 'గోదమ' శబ్దములోని దకారస్థానమందు తకారము 'గౌతమ' అని నిపాతితమైనది. నీకు నేను అగ్నివలె స్పృశింప శక్యముకానివాడను అను అర్థము కల తన నామనిర్వచనము ఆ యాతుధానికి వినిపించెను.

ఆయాతుధాని అది విని —

'యథోదాహృత మేత త్తే మయి నామ మహామునే !
నైత ద్ధారయితుం శక్యం గచ్ఛావతర పద్మినీమ్ ॥'

(అనుశాసన - అ 93)

ఓగౌతమమహామునీ! నీవు చెప్పిన నీనామార్థము ధారణచేయ శక్యముకాలేదు. నీవును సరస్సులోనికి వెళ్ళుము అని చెప్పి పంపినది.

వారందరి వెనుక దేవేంద్రుడును రూపాంతరముతో వచ్చి ఆమెతో సంభాషించి సప్తర్షుల రక్షణార్థమై ఆయాతుధానిని వధించెను.

ఇది గౌతమమహర్షి యొక్కయు, లోకరక్షణకర్తయగు దేవేంద్రుని యొక్కయు ఉదంతము. ఎప్పుడు ఏవో రంకులు కల్పించి 'గౌతములవారు అంతవారు; మహేంద్రులవారు ఇంతవారు'' అని వ్రాత సాగించిన రహస్యాలకర్త వారెంతటివారో మనస్సునకు తెచ్చుకొందురుగాక.




## వసిష్ఠమహర్షి

రహస్యాలకర్త వ్రాత ఇట్లున్నది.—

1. ప్రాచీనఋషుల కెవ్వరికిని ఆదిలో కులగోత్రములన్నవి లేనే లేవు. అప్పటికి వివాహాదిసంస్కారములుకూడ లేవు.

2. "అరుంధతీపతి యని పేరు వడసిన వసిష్ఠుడు.

3. వసిష్ఠునకు మాలెత యైన అరుంధతి ధర్మపత్ని అయ్యెను.

ఇవి 3 అంశములు. ఇందులో 1వ అంశములోని "ఆదిలో వివాహాదిసంస్కారములు లేవు" అనుమాట 2వ అంశములోని "అరుంధతీపతి యని పేరు వడసిన వసిష్ఠుడు" అను తమ మాటచేతనే కొట్టబడిపోయినది.

పతి-పత్నీ-వ్యవహారము వివాహసంస్కారమూలకమే. అట్లే 1 లో "ప్రాచీనఋషుల కెవ్వరికిని కులగోత్రము లన్నవి లేవు." అనుమాటకూడ "వసిష్ఠునకు మాలెత యైన అరుంధతిపత్ని" అను 3వ యంశములోని తమ మాటచేతనే ఖండింపబడిపోయినది. "మాలెత" అనుమాట కులమునకు చెందినది కాదా?

ఇంకొకటి- విశ్వామిత్రుడు వసిష్ఠునియొద్ద తన బలము పనికి రాలేదని ఇట్లనుకొనెను—

'ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్" ఇక్కడ బ్రహ్మక్షత్రియులు చెప్పబడలేదా?

'వసిష్ఠుని ధర్మపత్ని అయిన అరుంధతి మాలెత' అన్నమాటపై చెప్పుచున్నాము—

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము—

'అరుంధతి:—స్వాయంభువమన్వంతర మందలి వసిష్ఠుని భార్య. కర్దమప్రజాపతికిని దేవహూతికిని పుట్టిన కూతురు. 2వైవస్వతమన్వంతర మందలి మైత్రావరుణి వసిష్ఠుని భార్య.

ఈమెకు నారదుడు తోడబుట్టినవాడు. ఈమెకు వసిష్ఠునివలన 'శక్తి' అను పుత్రుడు కలిగెను.'

ఈవిషయములు — శ్రీమద్భాగవత-శివపురాణ- బ్రహ్మాండపురాణ-విష్ణుధర్మోత్తర-మత్స్యపురాణ - ప్రసిద్ధములు. ఇట్లు వీరి వ్రాత పరాస్తమైపోయినది.

ఈవిషయములు —మా"అరుంధతి"లో చూచి తెలిసికొనవలయును.

## కానీనశబ్దార్థము

"కానీనులుగా పుట్టి సంస్కారము కలిగి మహర్షులైనవారు, కన్యాప్రాయములో దానయ్యలను గలిసి గర్భములు దాల్చి పుట్టిన పిల్లలను బారవైచి ఆవల పెండ్లిండ్లు చేసికొని పతివ్రతామణులుగ పురాణాల కెక్కినవారు ఎందరో కలరు. ఇట్టివారు, ఇట్టివారి బిడ్డలు మనకు ఆదర్శవ్యక్తులుగ ఆరాధింపబడుచున్నారు." అట! (పు 24)

ఇక్కడ వీరి నడుగుచున్నాము —కానీనులుగా పుట్టిన వారిని, కానీనులను కని ఆవల పెండ్లిండ్లు చేసికొన్నవారిని ఎందరిని మీరు చూపగలరేమి? కానీనశబ్దార్థమును తెలుపుచున్నాము—

"కన్యాయాః కనీన చ" కానీనః కర్ణో వ్యాసశ్చ । కౌముదీ । మహాభాష్యమ్—

అపత్య మితి వర్తతే, యది చ కన్యా నాఽపత్యమ్, అథాఽపత్యం న కన్యా చాపత్యం చేతి విప్రతిషిద్ధమ్.

భాష్యప్రదీపః:— ముని-దేవతామాహాత్మ్యాత్ యా పుంయోగే ప్యక్షతయోని ర్భవతి, యథా కున్తీ మన్త్రాహూతదిన కరోత్పాదితకర్ణాఖ్యపుత్రాపి పునః కన్యైవాఽభూత్, తదపత్యం కానీనశబ్దాభిధేయమ్ । అక్షతయోనిః కన్యా ॥'

ఇక్కడ కానీనశబ్దము కర్ణునకు వ్యాసునకు వర్తించునని చెప్పబడినది. అయితే కన్యయొక్క అపత్యము కానీనుడు కదా. అక్షతయోని కదా కన్య, అట్టి కన్యకు సంతానమెట్లు? సంతానముకలది, కన్య అగు టెట్లు? అని శంకింపిపబడినది. ఆపై సమాధానము చెప్పబడెను—

ముని దేవతాప్రభావమునుబట్టి పుంయోగముకలిగినను అక్షతయోని అగును.

ఎట్లనగా, కున్తీదేవి, మన్త్రాహూతు డగు దినకరునివలన కలిగినట్టి కర్ణుడను పుత్రుడు కలదై కూడ పునః అక్షతయోని యగు కన్యయే అయినట్లు.

అట్టి కన్యయొక్క సంతానమే కానీనశబ్దార్థము. అని చెప్ప బడినది. ఇట్టి కానీనులు కర్ణుడొకడు, వ్యాసుడొకడును. కర్ణ జననియగు కుంతీదేవికి సూర్యదేవుడు 'ప్రాదాచ్ఛతస్యైకన్యాత్వం పున స్స పరమద్యుతిః' అన్నట్టు పునఃకన్యాత్వ మనుగ్రహించెను. అట్లే వ్యాస జనని యగు సత్యవతీదేవికి — పరాశరమహర్షి — 'కన్యా చైవ భవిష్యసి' అని పునః కన్యాత్వ మనుగ్రహించెను. ఈవిషయములే, ముని-దేవతా-మాహాత్మ్యములని వ్యాకరణశాస్త్రకారులచే కీర్తింప బడినవి. సూర్యదేవునివలన బుట్టిన బిడ్డను సూర్యదేవాజ్ఞచే పెట్టెలో పెట్టి దానికి రక్షాబంధము కట్టి కుంతీదేవి నదిలో విడిచినది. అది క్రమముగా వెళ్ళి పుత్రప్రాప్తికై భగవంతుని ఆరాధించుచుండు సూతదంపతులకు, స్నానమునకు వెళ్ళినపుడు వారికి లభించినది.

దీనినే తీసికొని "కన్యాప్రాయములో దానయ్యలను కలిసి గర్భములు దాల్చి పుట్టిన పిల్లలను బారవైచిన పతివ్రతామణు లెందరో కలరు" అనుచు వ్రాసెను రహస్యాలకర్త. ఆకుంతీదేవిని, ఆ కర్ణోత్పత్తిని ఎత్తుకొని శంకించి సప్రమాణముగా సమర్థించినవారు వ్యాకరణశాస్త్రకర్తలు. వీరు సత్యవతీదేవి విషయముగూడ సప్ర మాణముగా సమర్థించినారు.

ఇట్టి స్థితిలో సూర్యదేవుని గర్హించుచు కున్తీదేవిని గర్హించి పరాశరమహర్షిని గర్హించుచు సత్యవతీదేవిని గర్హించెను రహస్యాల కర్త.

ఈయనది వారల యోగ్యతను గ్రహింపగల బుద్ధి కాదు. వారల పూజ్యతను మహాభారతము చాటినది. వ్యాకరణశాస్త్రము సమర్థించినది. ఈయన గర్హించుట మానలేదు. ఇప్పట్టున భవభూతి మహాకవి చెప్పిన మాట జ్ఞప్తికి వచ్చుచున్నది—

'యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః'

రహస్యాలకర్తల వ్రాత —

1. "గణికాగర్భసంభూతో వసిష్ఠః" వేశ్యాసుతుడు వసిష్ఠుడు.

2. "ఒకప్పుడు సూర్యభగవానుడు, వరుణదేవుడు, వీరలకు ఊర్వశి ఎదురయ్యెను. ఆమెను చూడగానే ఆయిర్వురకు రేతస్ఖలన మయ్యెను. ఊర్వశి ఆవీర్యమును కుండలో భద్రపరచుకొనెను. ఆ వీర్యమునుండియే వసిష్ఠులవారు, అగస్త్యులవారు జన్మించిరి. అందు వలననే అగస్త్యులవారిని కుంభసంభవులని పిలిచెదరు" అట!

ఇవి 2 అంశములు. అయితే, వసిష్ఠుడు వేశ్యాగర్భసంభవుడా? కుంభసంభవుడా? "ఊర్వశి కుండలో భద్రపరచిన వీర్యమునుండియే వసిష్ఠులవారు, అగస్త్యులవారు జన్మించిరి" అను ద్వితీయాంశము చేతనే 'వేశ్యాగర్భసంభవుడు" అను తమ వ్రాత ఖండింపబడినది.

ఈవ్రాత చూడవలెను—

'ఇట్టివి బయట పెట్టినచో గుట్టుమట్టులు తెలిసి వానియెడ అనాదర మేర్పడునేమో. తనూ్మలమున తమ పొట్టలు మాడు నేమో, అన్న జంకుచే కుక్షింభరులు, స్వార్థపరులు, మహాత్ము లయు మహానదులయు పుట్టుపూర్వము లెత్తరాదని ఆంక్ష విధించిరి" అట! (పు 25 )

కొంచెము వినుడు— పృథుచక్రవర్తి వేనభూపతి కుమారుడు. ఆవేనుడు— 'చకార లోకే మర్యాదాం ధర్మబాహ్యా నరాధిపః। న యష్టవ్యం న హోతవ్యం న దేయం ధర్మకారణాత్ ॥'

అని శాసించినట్టి ధర్మబాహ్యుడు. ఆయన పుత్రుడై ధర్మ మూర్తియై యొప్పెను పృథుచక్రవర్తి.

ప్రహ్లాదుడు— 'స్తంభంబున చూపగలవె చక్రిన్ గిక్రిన్' అని గర్జించినట్టి దేవశత్రువగు హిరణ్యకశిపుని పుత్రుడై 'స్తంభాన్తర్గతు డయ్యు నుండుటకు నేసందేహమున్ లేదు' అని చెప్పి నరసింహావ తారమును తండ్రికి ప్రత్యక్షము చేసినట్టి పరమభాగవతోత్తముడై

చెప్పెను. కనుకనే— 'మహాత్ముల పుట్టుపూర్వము లెత్తరాదు'అని చెప్పబడె నని తెలుపుచున్నాము.

వారి జన్మగాథలు బయట పెట్టునది పాపము తామే అని కాబోలు. నేను కనుక ఇంత పని జేసితి నని ఈయన ఎవరినిగూర్చి మురియుచుండెనో, వారే తమ జన్మగాథలను బయటపెట్టినవారు. వారు తెలుపనిదే నేడు వీరికి తెలియునేమి?

ఆమహర్షులు తమ జన్మగాథలను, తమ జ్ఞాన-యోగ-తపః-ప్రభావములను గ్రంథస్థము చేసియే యున్నారు. వారి అసాధారణ ప్రభావములను దాచిపెట్టి తమ దోషదృష్టి కనుగుణముగా వారి జన్మగాథలనుమాత్రము బయటపెట్టుటే వీరు చేసినపని. ఋషులను గ్రహించిన ఆమూలగ్రంథములు పఠన-శ్రవణ-ప్రక్రియలతో ప్రచారములో నున్నంతకాలము ఎవరి పొట్టలును మాడవు.

యుగములు యుగములే గడచినవి. రాజ్యములకు రాజ్యములే మారినవి. ఇప్పటికి కూడ ఆర్ష సంప్రదాయవిశ్వాసము భారతీయులలో ఎంతగా ఉన్నదంటే ఇది ఇంకను అంతరింపలేదే అని, అంతరింపజేయుటకు ప్రయత్నించువారి హృదయములను కలచివేయునంతగా నున్నది. పాశ్చాత్య దేశములకును వ్యాపించియున్నది.

దీని కుదాహరణము— ఆంధ్రప్రభ 28-11-1970 "అమెరికాలోని న్యూయార్కులో హిందూదేవాలయనిర్మాణానికి ఆంధ్రనుంచి 10 వేల డాలర్లు ఇవ్వబడినవి."

'మహాత్ములయు, మహానదులయు పుట్టుపూర్వోత్తరము లెత్తరాదని ఆంక్ష విధించిరి' అన్నారు.

గంగానదిలో ఛొల్లునీరు వచ్చిపడినను ఆదోషమునుహరింపగల గంగయొక్క పవిత్రతకు అది భంగకరము కాదని, తేజశ్శాలు లగు ఆమహాత్ముల ఉత్పత్తులకు చెందిన దోషమును హరింపగల శక్తి వారి కున్నందున వారి పవిత్రతకు భంగము లేదని చెప్పుటకే. కనుకనే

"తేజీయసాం న దోషాయ వహ్నే స్సర్వభుజో యథా" అని చెప్ప బడినది.

మరియు అట్టి పవిత్రస్వరూపములను- ఈ "రహస్యాల కర్త వలె దూషింపకుడని చెప్పుటకును" అని తెలిసికొనవలెను.

రహస్యాలకర్త వ్రాత—

1. "కృతయుగములో హరిశ్చంద్రాదుల పరిపాలనము చూచిన వసిష్ఠుడు.

2. రామాయణములో నాలుగైదు తరాలు పురోహితుడుగా బ్రదికి భారతకాలమునాటి భీష్మునకు సాంగోపాంగముగ వేదములు బోధించిన వసిష్ఠమహర్షి.

3. ఈ వసిష్ఠుడు ఎన్నివేల సంవత్సరములు బ్రతికెనో? మను స్మృతిలో మానవుని వయస్సు నాల్గు వందల యేండ్లని ఉన్నది.

4. వసిష్ఠులవారు సూర్యవంశములోని దిలీపాదులకు పురో హితులై ధర్మోపదేష్ట అయ్యెను. అవురా! వారు చిరంజీవులు కాబోలు! అట! (పు 29)

వీరికి చెప్పుచున్నాము— వీరు, వసిష్ఠమహర్షి-కృత, త్రేతా, ద్వాపరయుగములలో ఉన్నట్లు చూపి మనుస్మృతిలో చెప్పబడిన ఆయుష్యపరిమితికి ఇది విరుద్ధ మని తేల్చినారు.

3వ అంశములోని వ్రాత – "మనుస్మృతిలో మానవుని వయస్సు నాల్గువందల ఏండ్లు, అనియే కద!

అది మానవుని వయస్సు కాని, మహర్షి వయస్సు కాదు. కనుక విరోధము లేదు.

మానవుడు వేరు, మహర్షి వేరునా? అందురు కాబోలు. యోగదర్శనము చూడుడు—

"మనుష్యజాతిః శ్రేయసీ, న వా శ్రేయసీ. ఇతి పృష్టే విభజ్య వచనీయః ప్రశ్నః, పశూ నధికృత్య శ్రేయసీ, దేవాం స్తృషీ నధికృత్య నేతి ।

మనుష్యజాతి పశువులకంటె శ్రేష్ఠము కాని, దేవతలకంటెను ఋషులకంటెను శ్రేష్ఠమైనది కాదు. అని చెప్పబడుటచేత మానవులకంటె మహర్షులు వేరే. ఇక వశిష్ఠమహర్షి స్థితినిగూర్చి — "అవురా!" అన్నందున ఆయన విషయము చెప్పుచున్నాము —

"క్రతుపులహాద్యా మునయ స్సప్తైతేషాం త్రియ స్త్రయో ముక్తాః । ప్రతికల్పన్తు వసిష్ఠోఽరున్ధత్యాఽఽస్తే పదే జగద్వన్ద్యః ॥" (ఖిలసంహిత)

క్రతు- పులహ- పులస్త్య- ప్రభృతి సప్తర్షులలో ముగ్గురు ముగ్గురు ముక్తులైరి. అందులోని వసిష్ఠమహర్షి జగద్వంద్యు డయి ప్రతికల్పము అరుంధతీసహితుడై జీవన్ముక్తావస్థలో తన పదవియం దుండెను.

దీనినిబట్టి వేలకొలది సంవత్సరములే కాదు, యుగములేకాదు, కల్పములతో సంబంధము కలవాడు వశిష్ఠమహర్షి అని తెలిసికొనవలెను.

ఇక 4వ అంశములో దిలీపాదులకు పురోహితు డని యున్న వ్రాతపై చెప్పవలసియున్నది —

ఆ దిలీపమహారాజే వసిష్ఠమహర్షియొద్ద చేసియున్న ప్రసంగము కొంచెము వినుడు —

'దైవీనాం మానుషీణాం చ ప్రతికర్తా త్వ మాపదామ్ ।
హవి రావర్జితం హోత స్త్వయా విధివ దగ్నిషు ॥
వృష్టి ర్భవతి సస్యానా మవగ్రహవిశోషిణామ్ ।
పురుషాయుషజీవిన్యో నిరాంతకా నిరీతయః ॥
య న్మదీయాః ప్రజా స్తస్య హేతు స్త్వద్బ్రహ్మవర్చసమ్ ॥"

మహర్షీ! రాజ్యములో దైవికములు, మానవములు అగు ఆపదలు రాకుండ నీవు నివారించుచున్నావు.

విధ్యుక్తముగా అగ్నులయందు నీవు సమర్పించిన హవిస్సును బట్టి వర్షాభావముచే శోషించు సస్యములకు వర్షము కురియుచున్నది.

నా రాజ్యములోని ప్రజ లందరు దీర్ఘాయుష్మంతులును, నిర్భయులును, ఈతిబాధారహితులును అయి యుండుటకు నీ బ్రహ్మవర్చసమే కారణమై యున్నది. ఇప్పుడు వశిష్ఠమహర్షి దిలీపమహారాజునకు రాజ్యరక్షకుడై యుండెనో, పురోహితుడై జీవించుచుండెనో నిర్మలచిత్తముతో తెలిసికొందురుగాక!

ఇట్లు 4 అంశములును ప్రత్యుక్తములైనవి.

## పరాశరమహర్షి

రహస్యాలకర్త వ్రాత —

1. 'వసిష్ఠునకు, మాలెతయైన అరుంధతి ధర్మపత్ని. ఆ దంపతులకు పుట్టినవాడు శక్తి. ఆశక్తి కొడుకు పరాశరుడు. వానికి దారిలో ఏటిరేవొడ్డున ఆకస్మికముగ అవతరించినవాడు వ్యాసుడు.

2. వసిష్ఠుని మనుమడు, శక్తికి పుత్రుడు అగు పరాశరుడు మాలెతకు, ఈయన పుత్రుడైన వ్యాసుడు పల్లెతకు పుట్టి మహర్షులౌట చిత్రము.'' అట! (పు 25)

ఇక్కడ ప్రథమాంశములో వసిష్ఠుని ధర్మపత్నియైన అరుంధతి మాలెత' అనుట అసంబద్ధము.

ఆమెకు కర్దమప్రజాపతివలన దేవహూతియందు జన్మ 1. మేధాతిథిమహర్షివలన జన్మ 1.

నారదాదులతో బ్రహ్మమానససృష్టికి సంబంధించినజన్మ. 1.

ఇక వశిష్ఠమహర్షినిగూర్చి—

నిమి-వసిష్ఠులు పరస్పర శాపములతో విదేహులు(స్థూలదేహ) రహితులైనపుడు బ్రహ్మ.—

'మిత్రావరుణయోః పుత్రో వసిష్ఠ త్వం భవిష్యసి ।
వసిష్ఠ ఇతి తే నామ తత్రాపి చ భవిష్యతి ॥
జన్మద్వయ మతీతం చ తత్రాపి త్వం స్మరిష్యసి ॥'

వసిష్ఠా! నీవు మిత్రావరుణుల పుత్రుడవై జన్మింతువు. అప్పుడు కూడ నీకు వసిష్ఠనామమే ఉండును,

అతీతమైన నీజన్మద్వయమును అప్పుడు నీవు స్మర
వగుదువు. అని చెప్పెను.

ఇట్టివాడు వసిష్ఠమహర్షి. బ్రహ్మమానసపుత్రికయైన
ఈయన ధర్మపత్ని.

"అరుంధత్యాం వసిష్ఠ స్తు శక్తి ముత్పాదయ త్సు
దంపతులకు జన్మించినవాడే "శక్తిముని"

ఇతోధికము మా "అరుంధతి"లో చూచి తెలిసికో

"స్వాంగజం జనయ చ్ఛక్తి రదృశ్యన్త్యాం పరాశర
శక్తిమునికి 'అదృశ్యన్తి' యందు పరాశరుడు జన్మించెను
యము— బ్రహ్మాండ-విష్ణుధర్మోత్తర-మత్స్య-కూర్మ-పు
ద్ధము. దీనికి విరుద్ధ మగుటచే ప్రథమాంశ మపాస్తము.

ఇక ద్వితీయాంశము— శక్తికి పుత్రుడగు
మాలెతకు పుట్టెనట!

'స్వాంగజం జనయ చ్ఛక్తి రదృశ్యన్త్యాం పరాశరమ్
పరాశరుడు అదృశ్యన్తి'కి జన్మించె నని యుండగా
జన్మించినట్లు ఏది?

ఆ 'అదృశ్యన్తి' మాలెతయే అందురా? అట్లనుట
మేమి? ఇంకొకటి—

పెద్దకొడకైన శక్తి అనువాని భార్య, నిండు
గన్పించెను. ఆమె గర్భమునుండి వేదనాదము వినబ
కోడలిని ఆశ్రమములో కాపాడుకొనుచుండెను" (పు ౩౦)

అని చెప్పుటచేత ఆ 'అదృశ్యన్తి' ఎవ్వతి యైనను
ఆమె గర్భస్థుడగు పరాశరునినుండి వేదనాదము వినబడినది
ఈ పరాశరుని పుత్రుడైన వ్యాసుడు పల్లెతకు పుట్టె
పల్లెత కాదు.

ఉపరిచరవసువువలన జన్మించిన దై మత్స్యపువా
యుండుటచే ఆవాసన కలవాటుపడిన దాశరాజునకు, మ
పెంచుకొనుట కివ్వబడినట్టి రాజకన్యయే.

ఆదాశరాజే భీష్మునితో చెప్పినది చూడుడు—

"అపత్యం చైత దార్యస్య యో యుష్మాకం సమో గుణైః।
యస్య శుక్రా త్సత్యవతీ సంభూతా వరవర్ణినీ।
తేన మే బహుశ స్తాత పితా తే పరికీర్తితః॥
అర్హ స్సత్యవతీం వోఢుం ధర్మజ్ఞ స్స నరాధిపః।

ఈమె, ఉపరిచరవసువు వీర్యసంభూతురాలు. మీకు సర్వవిధముల తుల్యుడైన వాడు; ఈమెతండ్రి, ఈమెను వివాహము చేసికొనుటకు అర్హుడు శంతనుమహారాజే అని చెప్పియున్నాడు. కనుక ఆమె పల్లెతకాదు.

ఇట్టి వీరు మహర్షులు, బ్రహ్మర్షులు అగుట చిత్రమా? వ్యాసమహర్షివలన శుకయోగి జన్మించెనని చెప్పి భీష్ము డిట్లు చెప్పెను—

"ఉత్పన్నమాత్రం తం వేదా స్సరహస్యా స్ససంగ్రహాః।
ఉపతస్థు ర్మహారాజ యథాఽస్య పితరం తథా॥"

(శాన్తి - అ 324)

ఆశుకయోగి పుట్టినతోడనే సాంగోపాంగముగా ఆయనకు స్వాయముగా వేదము లుపస్థితము లైనవి. తండ్రియగు వేదవ్యాసునకు జన్మించుటతో అవి ఉపస్థితము లైనట్టే. అని.

ఇప్పుడు చూడుడు— "శక్తి" కుమారు డగు పరాశరునకు వేదములు తమంతట తామే సాంగోపాంగముగా ఉపస్థితము లైనవి.

పరాశరపుత్రు డగు వేదవ్యాసునకును అవి తమంతట తామే ఉపస్థితము లైనవి.

అట్లే ఆ శుకయోగికిని ఉపస్థితము లైనవి.

రహస్యాల కర్త ఆక్షేపమేమి? "బ్రాహ్మణునివలన బ్రాహ్మణియందు జన్మింపనివానికి బ్రాహ్మణ్య మెట్లు?" అని.

"ఆర్ష్టిషేణోపాఖ్యానే మన్త్రదర్శనాఖ్యమేవ బ్రాహ్మణ్యమితి ప్రతిపాదితమ్.

ఏ తేన స్వయంప్రతిభాత వేదమన్త్ర త్వాఖ్య మేవ బ్రాహ్మ
ణ్యం బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా దజాతానామపీతి సిద్ధమ్"
(ధర్మప్రదీపః)

అని చెప్పబడుటచేత ఆపరాశర-వ్యాస-శుకమహర్షులు-స్వయం ప్రతిభాత వేదత్వము కలవారుగా శరశయ్య పైనుండి యుధిష్ఠిరునకు ఉపదేశించు భీష్ముని ప్రబోధములో మహర్షుల గూర్చి ఇట్లున్నది—

"నమో వసిష్ఠాయ మహావ్రతాయ పరాశరం వేదనిధిం నమస్యే।
నమోఽస్త్వృషిభ్యః ..."

పశ్చిమాం దిశ మాశ్రితాః—"అత్రిర్వసిష్ఠో భగవాన్ కశ్య
పశ్చ మహాన్ ఋషిః। గౌతమ శ్చ భరద్వాజో విశ్వామిత్రోఽథ
కౌశికః। ఋచీకతనయ శ్చోగ్రో జమదగ్నిః ప్రతాపవాన్ ॥...
"విముక్తా ధూతపాప్మానో నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః।
మానార్హా మానితా నిత్యం జ్ఞానవిద్భి ర్మహాత్మభిః॥
చన్దనే మలపంకే చ భోజనేఽభోజనే సమాః।
సమం యేషాం దుకూలం చ తథా క్షౌమాఽజినాని చ।
తిష్ఠేయు రప్యభుంజానా బహూని దివసా న్యపి॥
శోషయేయుశ్చ గాత్రాణి స్వాధ్యాయైస్సంయతేన్ద్రియాః॥
అదైవం దైవతం కుర్యుర్దైవతం చాప్యదైవతం।
లోకా నన్యాన్ సృజేయు స్తే లోకపాలాంశ్చ కోపితాః॥'
(అనుశాసప- అ 15)

ఇట్లు కీర్తింపబడినట్టి వసిష్ఠాదిమహర్షులు జ్ఞానులకు జగద్వంద్యులు. అజ్ఞానుల మాటల కేమి?

ఇంకొకటి- వసిష్ఠమహర్షిపై స్పర్ధ వహించినవాడు విశ్వామిత్రుడు. ఆయన వసిష్ఠుని నిరసించునపుడు- 'నీభార్య మాలెత, నీకుమారు డగు 'శక్తి' భార్య మాలెత, నీ పౌత్రుడగు పరాశరుని భార్య పల్లెత, నీది సూర్యవంశపురాజులకు పురోహితపు బ్రతుకు' అని రహస్యాల కర్త అన్నట్టు అనలేదేమి? అట్లనకుండుటే కాదు-

'ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్ ।
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే ॥''

అనుచు ఆయన బ్రహ్మతేజోబలమును మెచ్చుకొని ఆయన వలె తాను బ్రహ్మర్షి యగుటకు మహాతపస్సు చేసి సాధించిన వాడుకూడను.

'అనార్యసంగమా ద్వరం విరోధోపి సమం మహాత్మభిః'

అన్నట్లు బుద్ధిమంతులకు మహాత్ములతో విరోధము కూడ శ్రేయోదాయకమే. ఆవసిష్ఠమహర్షి మొగ మెరుగనట్టి రహస్యాల కర్తకు అయనమీద ద్వేషము. దుర్భాషణములును చూడుడు—

''రాజులు వసిష్ఠులవారి చేతిలో మెలగి ''ఎద్దు ఈనె ననగా గాట గట్టివేయు'' మన్న ధోరణిలో వెలసి శంబూకాదుల హత్యలకు కారణ మైరి. ఈ కథలు ఈతీరుగ పెరిగి కుక్షింభరుల గ్రాసవాసము లకు మాన్యక్షేత్రములుగా పరిణమించినవి'' అట! (పు 31)

ఇక్ష్వాకుమహారాజు మొదలు రామప్రభుపర్యంతము వసిష్ఠుని చేతిలో మెలగినవారును, ఆయన ఎద్దు ఈనె ననగా ఆరాజు లందరు కట్టుటకు సిద్ధపడినవారును. అట! నిజమే— మధ్యాహ్నమార్తాండ మండలము దివాంధముల దృష్టికి అంధకారముగా కనబడుచుండునట!

ఇట్టి కథలు కలవి పురాణములు. అవి ఎవరికో గ్రాసవాసము లకు మాన్యక్షేత్రము లైనవట! వీరికో, అవి కంటకప్రాయము లై దుస్సహము లైనవి. వీరి అదృష్ట మంతటిది. విద్యాస్థానము లైన పురాణములు విద్యోపజీవులకు మాన్యక్షేత్రములు కావా ?

తాము చేయు దూషణములకు ఆ పురాణములనే ఆధారము చేసికొనుచున్న వీరు మాత్రము ఆకుక్షింభరులలో చేర రా ?

ఫలపుష్పములు కల వృక్షముల నాశ్రయించి వాని ఫలపుష్ప ములను విక్రయించి వృక్షమును కాపాడుచు జీవించువారు కొందరు.

దాని కొమ్మలు ఛేదించుచు బొగ్గులు చేసి అమ్మి జీవించువారు మరి కొందరు. ఇది యే భేదము. వీరిది రెండవరకము.

ఈ విసురు, ఒక్క వసిష్ఠు నుద్దేశించియే కాదు, రామ ప్రభువు నుద్దేశించికూడను. ఈ విషయమై ముందు చెప్పబడును. ఇట్లు వెనుక చూపిన ద్వితీయాంశముకూడ పరాస్తమైనది.

## వ్యాస మహర్షి

రహస్యాలకర్త వ్రాత —

'పరాశరునకు ఏటిరెయొద్దున ఆకస్మికముగా అవతరించినవాడే వ్యాసుడు.

పుట్టగానే ఒడ్డు పొడువు కలిగి కన్పించిన ఆబిడ్డయే వేదవ్యాసుడై అష్టాదశపురాణకర్త యై- 'వ్యాసో నారాయణో హరిః' అని కీర్తింపబడెను. అట! (పు 26)

ఇక్కడ పరాశరునివలన వ్యాసోత్పత్తిప్రకారము తెలిసికొనవలయును.

ఆసత్యవతితో పరాశరుని ప్రసంగము—

'శృణు సుందరి పుత్రస్తే విష్ణ్వంశసంభవ శ్శుచిః ।
భవిష్యతి చ విఖ్యాత స్త్రైలోక్యే వరవర్ణిని ॥
కేనచి త్కారణే నాహం జాతః కామాతుర స్త్వయి ।
కదాపి చ న సంమోహో భూతపూర్వో వరాననే ।
దృష్ట్వా చాప్సరసాం రూపం సదాహం ధైర్య మావహమ్ ॥
దైవయోగేన వీక్ష్య త్వాం కామస్య వశగోఽభవమ్ ।
త త్కించిత్కారణం విద్ధి దైవం హి దురతిక్రమమ్ ॥
దృష్ట్వాహం చాతిదుర్గన్ధాం త్వాం కథం మోహ మాప్నుయామ్।
పురాణకర్తా పుత్రస్తే భవిష్యతి వరాననే ॥'

సుందరీ! నిన్ను చూచినంతనే ఏమోకాని కామాతురుడ నైతిని. ఇట్టి మోహము నా కెన్నడును కలుగలేదు.

అప్సరసల దివ్యరూపము చూచినప్పుడుకూడ చలింపని మనస్సు కలవాడను. అతిదుర్గంధము కల నిన్ను చూచి మోహపడుటా! ప్రబలమైన దైవయోగముచేతనే నా కీస్థితి సంభవించినది. నీకు విష్ణ్వంశసంభవుడును, పురాణకర్తయు నగు పుత్రు డుద్భవించును.

అని చెప్పి 'కృతా యోజనగన్ధా చ' ఆమెను యోజనగన్ధగా తన ప్రభావముచేత చేసి,

'కాన్తే ఽద్య మత్ప్రియం కృత్వా కన్యైవ త్వం భవిష్యసి' నాకు ప్రీతిని కలిగించి నీవు కన్యవే అగుదువు. అని చెప్పెను.

దీనినిబట్టి తనవలన సంభవింపవలసియున్న మహాపురుషుని ఉత్పత్తి కొరకే తనకు ఆకస్మిక మైన కామవికారము కలిగె నని, సంకల్పసిద్ధు డగుటచేతనే ఆమెను యోజనగన్ధిగా చేసెనని, కన్యాత్వవరముచే ఆమెకు వివాహయోగ్యతను ప్రసాదించె నని స్పష్టము.

'జాతమాత్రో జగామాశు వృద్ధిం విష్ణ్వంశయోగతః॥' ఆ సత్యవతీసుతుడు విష్ణ్వంశసంభవు డగుటవలన పుట్టిన వెంటనే వృద్ధి బొంది తపస్సునకు వెళ్ళెను.

పరాశరునివలన వేదవ్యాసోత్పత్తి ప్రకార మిది.

రహస్యాలకర్త వ్రాత చూడుడు—

'మెడలో జందె మున్నవానికి బుట్టినంతమాత్రాన వారిని విప్రుడుగానే నిర్ణయింపవలెను. ఇది యంతయు చాతుర్వర్ణ్యపరిస్థితిలో అంతర్గతమైయున్న మహాదోషము' అట! (పు 28)

సృష్టిసిద్ధమై యున్న చాతుర్వర్ణ్యవ్యవస్థ మహాదోషమా?

చాతుర్వర్ణ్యవిభాగము అశ్వములలో నున్నది; వృక్షములలో నున్నది; సర్పములలో నున్నది.

— అశ్వములలోను, వృక్షములలోను

## వర్ణవిభాగము

లఘునిఘణ్టు సర్పస్వమ్-

'పున రశ్వాః బ్రాహ్మణాదిజాతి భేదేన చతుర్విధాః ।
బ్రాహ్మణాదిజాతయో బ్రాహ్మణాదితత్తజ్జాతిభిస్సహైవ స్థాప్యాః।
న తు భిన్నజాతిభిః'

యుక్తికల్పతరువు—

'వృక్షాయుర్వేదే హి వృక్షా అపి బ్రాహ్మణ - క్షత్రియ-వైశ్యాది-చతుస్సృషు శ్రేణిషు విభక్తాః—

లఘుః కోమలః అనాయాస మేవ అన్యేన వృక్షేణసహ సుయోజ్యః బ్రాహ్మణః, లఘుః సుదృఢః సహజ మేవ అన్యేన సహ అసంయోజ్యః క్షత్రియః, కోమలో గురుభారో వైశ్యః ॥ దృఢో గురుభారశ్చ శూద్రః'

'సర్పాణాం కతి రూపాణి కిం చిహ్నం కిం చ లక్షణమ్ ।
జాతిం కులం తథా వర్ణాన్ బ్రూహి సర్వం ప్రజాపతే ॥
శుక్లా తు బ్రాహ్మణీ జ్ఞేయా రక్తాతు క్షత్రియా స్మృతా ।
వైశ్యా తు పీతికా జ్ఞేయా కృష్ణా శూద్రా తు కథ్యతే ॥'

(భవిష్య- అ ౩౩)

సర్పములు ఉత్పత్తి, ప్రభేదములు, ఆయువు, విషప్రసారము మొదలగు సర్వవిషయములు4-5అధ్యాయములలో చెప్పబడియున్నవి.

ఇట్లు సృష్టిసిద్ధమై వర్ణవ్యవస్థ యుండగా—

'నిమ్నోన్నతము లేర్పరచుచు సంచరించు వంచకులను శిక్షించి బుద్ధి చెప్పవలసియున్నది' (267) అను ఈరహస్యాలకర్త వాచాటతను చెప్పవలసియున్నదా? మరెవ్వరికో చెప్పవలసియున్నదా? పాఠక మహాశయులే గమనింతురుగాక.

రహస్యాలకర్త వ్రాత—

'కానీనుడైన వ్యాసుడే, మారుమనువులో మహారాజ్ఞియై సత్యవతి యని పేరు మార్చుకొన్న తన యమ్మగారి యనుమతితో ఆవిడ కోడండ్రతో రమించి మువ్వురు కొడుకులను పుట్టించెను' అట! (పు 27)

పాపము ఈయనకు తెలిసినది మారుమనువే. పరాశరమహర్షి సత్యవతీదేవికి — "కన్యైవ త్వం భవిష్యసి" అని కన్యాత్వ వర మిచ్చెను. ప్రత్యక్షనిదర్శనముగా ఆమెను యోజనగంధిగా చేసెను. ఆమెకు వరముగా ఇచ్చిన కన్యాత్వము వివాహయోగ్యతారూపమే. తరువాత శంతనుమహారాజుతో జరిగిన వివాహము కన్యావివాహమే. కనుకనే—

"ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి" అనుచు- సంభవింపని విషయమునుకూడ తమ అమోఘవాక్కు-(వరము) చేత సంభవింపజేయగలవారు ఋషు లని భవభూతి మహాకవి చాటెను.

ఇట్లు యోజనగంధిగా చేయుట, కన్యైవ త్వం భవిష్యసి" అని వర మిచ్చుట, కలియుట ఇవి గ్రంథస్థములై యుండ, ఆవరము సార్థకమే అని మహాకవి సమర్థించియుండ, కలియుటమాత్రమే తెలిసికొని మిగిలినది త్రోసివేసి- "యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనోజనః" అన్నట్లు సత్యవతీదేవికి శంతనునితో వివాహము మారుమను వని చెప్పవచ్చిరి. నిరంకుశులనోటికి అడ్డేమున్నది ?

## బీజప్రాధాన్య, క్షేత్రప్రాధాన్య వ్యవస్థ

రహస్యాల కర్త వ్రాత—

"క్షేత్రము ప్రధానమా ? బీజము ప్రధానమా? అన్నప్రశ్నలో ఒక నియమము, నీతియు లేక సమయోచితముగ జూచుకొనిరి,

పల్లెతకు బుట్టిన వ్యాసుడు తండ్రినిబట్టి బ్రాహ్మణు డయ్యెను. ఆబ్రాహ్మణుడే రాజకాంతలను కలియగా ధృతరాష్ట్ర - పాండు రాజులు పుట్టిరి. అతనికే దాసియందుపుట్టిన విదురుడు శూద్రుడయ్యె నట!" (పు 28)

ఇక్కడ "పల్లెతకు బుట్టిన వ్యాసుడు తండ్రినిబట్టి బ్రాహ్మణు డయ్యెను" అని వీరనుటలో - ఆపరాశరమహర్షిని, వ్యాసమహర్షి నెట్లయినను బ్రాహ్మణు లన్నందుకు సంతోషము.

"అబ్రాహ్మణియందు బ్రాహ్మణునివలన పుట్టిన వ్యాసుడు బ్రాహ్మణు డైనపుడు ఆవ్యాసునివలన బ్రాహ్మణేతర స్త్రీలయందు కలిగినవారును బ్రాహ్మణులు కావద్దా" అని వీరి శంక.

సత్యవతీదేవియందు పుత్రు నపేక్షించి ప్రవర్తించినవాడు పరాశరుడే కాని సత్యవతి కాదు.

పుత్రాపేక్షతో వ్యాసునితో కలిసినవారు అంబిక, అంబాలికా, దాసి వీరే కాని వ్యాసుడు కాదు.

ఈ స్థలములలో పుత్రునిగూర్చి దృఢసంకల్పము వ్యాసుని విష యమై పరాశరునిదే. ధృతరాష్ట్ర-పాండు-విదుర-విషయమై దృఢ సంకల్పము ఆయా స్త్రీలదే.

"అథ ఖలు క్రతుమయః పురుష" ఇతి సంకల్పప్రాధాన్యశ్రుతేః స్త్రీపుంసయో ర్మధ్యే యస్య సంకల్పో దృఢః తస్యైవ పుత్రః."

అను ప్రమాణమునుబట్టి వారి కాభేద ముపపన్నము కనుక నీతినియమములు లేనట్టివారు ఆనాటివారు కారు. ఈనాటివారే.

రహస్యాలకర్త వ్రాత—

1. వంశము నిలువవలె నని వ్యాసుని, వానితల్లి- అంబిక, అంబాలిక, వీరికి సంతతికై నియమించెను.

2. అత్తగారి సమాపంక్తికి ఈకోడండ్రు ఇరువురును వచ్చిరి.

3. అంబాలిక కోడలు కుంతీదేవి. ఈమె అత్తగారైన అంబాలికవలె, ఆమె అత్తగారైన సత్యవతీదేవివలె, ఒక్కపురుషుని కట్టుకొని ముగ్వురితో రమించి నలుగురు బిడ్డలనుగన్నది. మొదటివాడు కర్ణుడు.

4. ఈమె కోడలు ద్రౌపదిని బిచ్చగాండ్రయిన ఏవురు భర్తల కంటగట్టినది.

5. ద్రౌపదికి కర్ణునిమీదకూడ మోజు కలిగినట్లు శ్రీకృష్ణభగవానులే సెలవిచ్చిరి.

ఈకథ లన్నియు రంకులు గాక మరేమగును? అట! (పు. 29)

ఇక్కడ కొంచెము చెప్పవలసియున్నది—

ఆపద్ధర్మము నియోగవిధి. కురువంశమునకు ఆస్థితి సంభవించినది. అప్పుడు సత్యవతీదేవి భీష్మునితో ఆలోచించినది. ఆయన బ్రహ్మచర్యశపథము, రాజ్యత్యాగము చేసి యున్నందున—

'హేతుం సంతానవృద్ధయే వక్ష్యామి మాతః' అనుచు సంతానప్రాప్తి కుపాయము చెప్పెను —

'బ్రాహ్మణో గుణవాన్ కశ్చిత్ ... ఉపనిమన్త్ర్యతామ్ ।
విచిత్రవీర్య క్షేత్రేషు య స్సముత్పాదయే త్ప్రజాః ॥'

విచిత్రవీర్యభార్యలయందు సంతానము కలిగింపగల ఉత్తముని కోరవలెను. అని ఆమెను ప్రేరేపించెను.

అప్పు డామె వ్యాసుని తలచుకొనగా ఆయన దర్శనమిచ్చి ఆనియోగవిధి ననుసరించి సంతాన మనుగ్రహించెను. అది క్షేత్రజ సంతానము.

లోకములో దత్తుడు తనకు పుత్రు డగుట శాస్త్రీయమైనట్లు, క్షేత్రజుడు తనకు పుత్రు డగుటయు శాస్త్రీయమే అయినందున అది రంకు అగునా?

2. అంబిక, అంబాలిక, అత్తగారు సత్యవతీదేవి సహాజపంక్తికి వచ్చిరట! వీరిద్దరును నియోగవిధానమునకు చెందినవారు. సత్యవతీదేవి కన్యావివాహవిధానమునకు చెందినదే. ఆకన్యాత్వము వరప్రభావప్రాప్తము కనుక ఈవ్రాత తప్పు.

3. 'కుంతీదేవి అత్తగారైన అంబాలికవలె ఒక్క పురుషుని కట్టుకొని ముప్వురితో రమించి 4రు బిడ్డలను కన్నది.' అట!

ఇక్కడ కుంతీదేవికి బాల్యములో దుర్వాసు డుపదేశించిన మంత్రముయొక్క ప్రభావముచే సూర్యసాన్నిధ్యముకలిగి సహాజకవచకుండలములతో కర్ణుడు కలిగెను.

ఆమెకు వివాహయోగ్యతారూపమైన కన్యాత్వవర మీయబడినది. తరువాత పాండురాజు వివాహము చేసికొనెను. ఆయన రాజ్యాభిషిక్తుడై ఒకప్పుడు వేటకు వెళ్ళి ప్రమాదపడి, 'తన భార్యలతో కలిసినపుడు మరణింతువు.' అను శాపమునకుపాత్రుడై తన భార్యలు వెంట రాగా శతశృంగపర్వతమునకు వెళ్ళి ఋషుల సన్నిధానములో నివాసము చేసెను. అప్పటికి సంతానము లేదు.

ఒక గోష్ఠిలో ఋషులు నీకు సంతానయోగ్యత కలదు. ప్రయత్నింపు మని చెప్పగా కుంతీదేవితో ఎంతయో చెప్పి ఆమెను నియోగవిధి నవలంబింపజేసెను. దేవతల నాకర్షింపగల మంత్ర మున్నందున పాండురాజు చెప్పిన దేవతల నుద్దేశించి జపించుచు వారి సాన్నిధ్యమును పొందుచు యుధిష్ఠిర-భీమ-అర్జునులను పొందినది.

ఇదియును, భర్త్రాజ్ఞ ననుసరించి జరిగినట్టి శాస్త్రీయమైన నియోగవిధి కనుక ఇది రంకు అగునా? కనుక 'ముగ్గురుతో రమించె' నన్న వ్రాత తప్పు.

4. "ఈకుంతీదేవి కోడలు ద్రౌపదిని బిచ్చగాండ్రయిన ఏవురు భర్తల కంటగట్టినది" అట! అట్లు చేయుట ఆద్రౌపది తన్ను దెప్పకుండుటకే" అట!

ఓహోహో! ద్రౌపదీదేవి సర్వైశ్వర్యసమృద్ధికలద్రుపదమహా రాజు పుత్రిక. హవనప్రక్రియచేత వేదీమధ్యమునుండి ఆవిర్భవించిన స్వర్గలక్ష్మి.

ఇట్టిది కట్టుకొన్నది బిచ్చగాండ్రనా? వారికి అంటగట్టినది కుంతీదేవియా? అట్టిపనికి ద్రుపదమహారాజు ఎట్లు అంగీకరించెనో!

5 గురికి, అందులో బిచ్చగాండ్రకు ఆ ద్రౌపది నిచ్చి ఆతండ్రి వివాహ మెట్లుచేసెనో, శాస్త్రజ్ఞానము మాటకేమి? లోకజ్ఞానము కూడ వీరిలో మృగ్య మైపోయినదే. అసంబద్ధమగుటచే ఇది కూడ త్రోసివేయబడినది.

5. "ద్రౌపదికి, కర్ణునిమీదకూడ మోజు కలిగినట్లు కృష్ణభగ వానులే సెలవిచ్చి" రట! ఆమాటకు కుంగిపోయి శ్రీకృష్ణా! ద్యూత సభలో దుర్యోధనప్రీతికై నాడిన దుర్భాషలకు నేను పరితపించు చున్నాను—

"య దబ్రవ మహం కృష్ణ కటుకాని స్మ పాండవాన్ ।
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యే హ్యకర్మణా ॥"

అని చెప్పుకొనెను. ఆజ్ఞానము వీరి కేదీ?

దీనికి సంబంధించిన విశేషములు మా 'ద్రౌపదీనిందానిరా కరణము' చూచి తెలిసికొనవలెను. "ఈకథలన్నియు రంకులుగాక, మరేమగును?" అన్న వీరికి, వీరెత్తిచూపినవి కావని బోధించు చున్నాము. ఇట్లు 5 అంశములు ప్రత్యుక్తములైనవి.

## పరశురామ మహర్షి

రహస్యాల కర్త వ్రాత:-

1. "రేణుక బ్రహ్మర్షి జమదగ్నికి భార్య. పరశురామునిగన్న తల్లి. అయ్యు పౌంశ్చల్యమున పిచ్చిపని చేసెనట— ఒకనాడు నీటికై ఏటికి వెళ్ళెను. ఆప్రాంతములో జలక్రీడలో మునిగియున్న గంధ

ర్వులను చూచి వారి యందచందములకు మురిసిపోయి వారితో ఈమె ప్రేమకలాపము సాగించెను.

2. భర్త దివ్యదృష్టితో చూచి వ్యభిచరించిన ఈ ముండను చంపివేయు డని బిడ్డల కాజ్ఞాపించెను. వారు చేయము అనగా శపించి కనిష్ఠ డగు పరశురామునకు ఆపని అప్పగింప ఆతడు సంశయింపక ఆపని చేసెనట!

3. ఆ అయ్య మెచ్చుకొని ఆకొయ్య కేవో వరా లిచ్చె నన్న మాట అట్లుండనిండు" అట! (పు 36)

ఇవి 3 అంశములు—

'రేణుకా స్నాతు మగమ త్కదాచి న్నియతవ్రతా।
సా తు చిత్రరథం నామ మార్తికావతకం నృపమ్॥
దదర్శ రేణుకా రాజ న్స్నా గచ్ఛన్తీ యదృచ్ఛయా।
క్రీడన్తం సలిలే దృష్ట్వా సభార్యం పద్మమాలినమ్॥
బుద్ధిమన్తం తత స్తస్య స్పృహయామాస రేణుకా।
వ్యభిచారా చ్చ తస్మా త్సా క్లిన్నాఽంభసి విచేతనా॥
ప్రవివేశాఽఽశ్రమం త్రస్తా తాం వై భర్తాఽన్వబుధ్యత॥'

నియమాన్వితురాలైన రేణుక ఒకప్పుడు స్నానమునకు వెళ్లెను. స్నానముచేసి వచ్చుచు, భార్యతో కలిసి జలమందు విహరించు చిత్రరథుడను మహారాజును ఆకస్మికముగా చూచినంత అట్టి స్పృహ కలిగెను. అంత హృదయము చలించెను-"అంభసిక్లిన్నా" ఇట్లు మానసికవికారము జలమందున్నపుడే సంభవించి ఆశ్రమమునకు వచ్చెను.

ఆ మానసికవికారమునే భర్త గ్రహించెను. "వ్యభిచారా చ్చ సా క్లిన్నాఽంభసి" అన్నపుడు మానసికవ్యభిచారమే అర్థము.

రహస్యాలకర్త ఏమి వ్రాసెను?—"గంధర్వులతో ప్రేమకలాపము సాగించెను. పరాయివారి ముద్దులలో సుద్దులలో మునిగి

యుండెను" అనుచు అది కాయికవ్యభిచారమే లను దురభిప్రాయము వెల్లడించెను. అంతమంది గంధర్వులతో జలములో కాముకవ్యభిచారము సంభవమా? గ్రంథములో నున్నట్టి 'సభార్యం చిత్రరథమాగచ్ఛన్తి జలే దదర్శ' భార్యతో కలిసియున్న రాజును వచ్చుచున్నపుడు జలములో చూచెనుకద! ఆస్థితిలో కాముకవ్యభిచారము సంభవమా? "దదర్శ-స్పృహయామాస-వ్యభిచారా చ్చ తస్మాత్ క్లిన్నా" ఈశబ్దములు మానసిక వ్యభిచారమును కాక కాయికవ్యభిచారమును తెలుపునా? ఇట్లు ఆపై "నియతవ్రతా" దీనిని నేమిచేయుదురు? దురభిప్రాయము కల ప్రథమాంశము పరాస్తమైనది.

2. ఆమెకు కలిగిన మానసికవికారమునకే శిక్షగా ఆమెను వధింప కుమారుల కాజ్ఞాపింప, వారు తిరస్కరించిరని వారినిశపించెను-

"తత శ్శశాప తాన్ క్రోధాత్ ... క్షిప్రమాసన్ జడోపమాః"

శాపముచేత వారు జడులై యుండిరి. తరువాత ఫలములకు వెళ్ళిన పరశురామస్వామి ఆశ్రమమునకు రాగా ఆపని ఆయన కాజ్ఞాపించెను. ఆయన నిశ్శంకగా ఆపని చేయ ప్రసన్నచిత్తుడై ఆమహర్షి నీవాంఛిత మేదో తెలుపు మనెను—ఆయన ఇట్లు కోరెను—

"స వవ్రే మాతు రుత్థాన మస్మృతిం చ వధస్య వై ।
పాపేన తేన చాఽస్పర్శం భ్రాతౄణాం ప్రకృతిం తథా ॥
అప్రతిద్వంద్వతాం యుద్ధే దీర్ఘ మాయుశ్చ భారత ।
దదౌ చ సర్వాన్ కామాం స్తాన్ జమదగ్ని ర్మహాతపాః॥"

(వనప- అ 116)

తల్లి లేచి సంచరించుట, ఈవధవిషయము ఆమెకు జ్ఞప్తిలో లేకుండుట, నాకు ఆపాప మంటకుండుట, సోదరులు స్వాభావికస్థితిలో నుండుట అనుగ్రహించి, యుద్ధవిజయము, దీర్ఘాయుష్యము నాకనుగ్రహింపు మని వేడుకొనెను. ఆయన అవన్నియు అనుగ్రహించెను,

3 "ఆ అయ్య మెచ్చుకొని ఆకొయ్య కేవేవో వరాలిచ్చె
నన్నమాట అట్లుండ నిండు" అట!

ఈపైత్య మేమిటికో! పరశురామస్వామి వచ్చిచూచునప్పటికి
మహర్షి శాపముచే జడులై కనబడిరి సోదరులు; తాను రాగానే
"జహీమాం మాతరం పాపామ్" అని ఆజ్ఞాపించెను. "ఆ పని జేయ
కున్న తనను శపించును. చేసిన ప్రసన్నుడగును. అఘటితఘటనా
సామర్థ్యముకల మహర్షిని ప్రసన్నుని చేసికొన్నచో ఏలోప ముండదు"
అని ఆలోచించి చేసిన దాపని. అట్లే ఆయన ప్రసన్నుడయ్యెను.

పరశురామస్వామి అనుకొన్నట్లు వరము లిచ్చి అందరి
అనుగ్రహించెను. అంతయు స్వప్నవృత్తాంతముగా జరిగెను.

ఇట్టి వరప్రభావవృత్తాంతమునకు సంబంధించి జరిగినదే
పరశురామచర్య కాగా దీని నటుంచుటా? ఆయన తల్లి లేచి తిరుగు
కోరెను. జరిగినది. తల్లికి తెలియకుండుట కోరెను. మాతృవధపాపము
తన కంటకుండుట కోరెను సోదరుల శాపవిముక్తిని కోరెను.

"కొయ్య" ఆయనా? దాని నటుండ నిమ్మన్న ఈయనా? ఇట్ల
ఈయనవ్రాత పరాస్తము. ఇంకొకటి పరశురామునిపై వ్రాత—

1 "వాల్మీకములో పరశురాముడు ముఖ్యవీరుడు. నిత్యవ
రాజసములో తామసములో బ్రదు కంతయు గడపినవ్యక్తి
సీతారాముల పెండ్లి జరిగిన పిదప వారి కెదురయి ఇతడ
చేసిన కోలాహలమునకు, కోసిన కోతలకు శ్రీరాముడు
సరియైన సమాధాన మిచ్చెను. శృంగభంగమై శ్రీరాము
క్షమింపు మనెను.

"2 శ్రీరాముని మాట ఇది— బ్రాహ్మణోஉసీతి పూజ్యో మే
(పు 32

వీరు పరశురామునకు శృంగభంగ మెవనివలన అయినట్ల
చెప్పిరో, ఆ శ్రీరాముడే ఆయనను "నీవు బ్రాహ్మణుడవుకనుక నాకి

పూజ్యుడవు" అన్నమాట గుర్తుంచుకొనవలసినదని వీరికి చెప్పు చున్నాము.

ఇంకొకటికూడ శ్రీరాముడనెను—

"శ్రుతవా నస్మి య త్కర్మ కృతవా నసి భార్గవ ।
అనురుంధ్యామహే బ్రహ్మన్ పితు రానృణ్య మాస్థితః ॥"

నీవు నీతండ్రి జమదగ్ని మహర్షిని వధించిన క్షత్రియులను పితృఋణము తీర్చుకొనుటకై వధించితి వని వింటిని. పితృఋణము పుత్రులు తీర్చుకొనవలసినదే. కనుక దానికి అంగీకరించితిని. అని.

ఇట్లు పరశురాముడు పూర్వము చేసిన క్షత్రియ సంహారము శ్రీరామునకు సమ్మతమే అన్న విషయముకూడ గుర్తుంచుకొమ్మని చెప్పుచున్నాము.

"అవజానాసి మే తేజః పశ్య మేఽద్య పరాక్రమ్ ।
ఇత్యుక్త్వా రాఘవః క్రుద్ధో భార్గవస్య శరాసనమ్ ॥
శరం చ ప్రతిగ్రాహ హస్తా ల్లఘుపరాక్రమః ।
తద్ధస్తా త్స్వయమేవ ధనుః శరం చ చాపాత్ ॥
భార్గవనిష్ఠాం వైష్ణవీం శక్తిం చ జగ్రాహ॥" తదుక్తం పాద్మే-
"ఇత్యుక్త్వా దేవి వైష్ణవ్యా శక్త్యా తద్గతయా సహ । జగ్రాహ వైష్ణవం చాపం వినయేన చ లీలయా॥" ఇతి॥ అతాగ్రేప్యగ్రే వక్ష్యతి — "నిర్వీర్యో జామదగ్న్యోఽసౌ" ఇతి। నిర్గతం వీర్యం బలం యస్య సః"

నీవు నన్ను అవమానించుచున్నావుకనుక నా పరాక్రమమును చూడుము. అనుచు పరశురామహస్తమునుండి ఆ ధనుస్సు, బాణ మును, దానితో బాటు ఆయనలో నున్న వైష్ణవశక్తిని ఆకర్షించెను.

రామప్రభువుది పూర్ణావతారము. పరశురామునిది శక్త్యా వేశావతారము అగుటచే ఆశక్తి రామప్రభునిలో చేరిపోయినది.

అప్పుడు పరశురాముడిట్లనెను—

శ్రీరామా! పూర్వము జయించి స్వాధీనము చేసికొన్న భూతలమును కాశ్యపునకు దత్తము చేసి మహేంద్రగిరియందు తపము చేసికొనుచున్నాను.

పుణ్యకర్మ, పాపకర్మ ఈ రెండింటిచేత ప్రాప్తించునది మానవ జన్మ. అందులో పాపకర్మ తపస్సుచేత క్షీణించిపోయినది. ఇక పుణ్య కర్మవలన కలుగు లోకము లున్నవి. వానిని నీ శరముచేత క్షీణింప జేయుము అప్పుడు జీవన్ముక్తుడ నగుదును. అని.

"న చేయం మమ కాకుత్స్థ వ్రీడా భవితు మర్హతి।
త్వయా త్రైలోక్యనాథేన య దహం విముఖీకృతః ॥"

శ్రీరామా! త్రైలోక్యనాథుడవైన నీయెద్ద నేను నిర్వీర్యుడ నగుట నాకొక లోపము కాదు. జగదీశునియెద్ద అది సంభవమే అని పలికెను.

ఇక రహస్యాలకర్త వ్రాత చూడుడు—

"రామాయణకథలో జగదగ్ని కొంపలో వెలసిన సంకరజాతుల రంకులో ఉద్భవించిన పరశురామావతారములోని బండారమిది. ఇట్టి అభాగ్యమైన అవతారమునకు గుడులు కట్టి విగ్రహములు వేసి నైవేద్యము లర్పించు ప్రబుద్ధులకు రామాయణము పారాయణ గ్రంథము" అట! (పు 37)

'బ్రాహ్మణోసీతి పూజ్యో మే' అన్న శ్రీరామునకు పరశు రాముడు బ్రాహ్మణుడు; ఈయనకు సంకరుడు. శ్రీరామునకు పూజ్యుడు; ఈయనకు అభాగ్యుడు.

క్షత్రియుడైన శ్రీరామునకు, క్షత్రియాంతకుడు పరశురాముడు వంద్యుడు; ఈయనకు నింద్యుడు.

ఏది లేకున్నను, ఉన్నది వాక్స్వాతంత్ర్య మారామె!
గతించినవారినిగూర్చి ఉచ్చనీచములు లేకుండ ఈమాత్రమయినను అనకపోతే దాని కుపయోగ మెక్కడ? మనకు పేరెక్కడ?

"యేన కేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్"
అనికదా ఉన్నది. అని ఈరహస్యాలకర్త ఆలోచించుకొన్నట్లున్నది.

'విరూపో యావ దాదర్శే నాత్మనః పశ్యతే ముఖమ్ ।
మన్యతే తావ దాత్మాన మన్యేభ్యో రూపవత్తరమ్ ॥
యదా స్వముఖ మాదర్శే వికృతం సోఽభివీక్షతే ।
తదాఽన్తరం విజానీతే ఆత్మానం చేతరం జనమ్ ॥
అతీవ రూపసంపన్నో న కంచి దవమన్యతే ।'

అని భారతములో చెప్పినట్లు-కురూపి, అద్దములో తన ముఖము చూచుకొనకున్నప్పుడు రూపవంతుడను నేనే అనుకొనును. వికృతమైన ముఖమును అద్దములో చూచుకొన్నపుడు ఇతరులకు తనకు గల అంతరము తెలియబడును. అతిరూపవంతుడు ఎవ్వనిని గర్హింపడు.

మహర్షులు.

ధర్మప్రవర్తకులైన మహర్షులలో ధర్మవిరుద్ధమైన ఆచరణము కనబడుచున్నది. లోకమునకు ధర్మముపదేశించు వారు ఆధర్మమునకు విరుద్ధముగా తామే ప్రవర్తించునపుడు వారని లోకమెట్లు విశ్వసించును ? అనుశంకకు ఆపస్తంభమహర్షి సమాధాన మిట్లు చెప్పెను -

దృష్టో ధర్మవ్యతిక్రమ స్సాహసం చ పూర్వేషామ్ ।
తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే ।
త దన్వీక్ష్య ప్రయుంజాన స్సీద త్యవరః ।' (ధర్మసూత్రమ్)

అది ధర్మవ్యతిక్రమమే, సాహసమే, వారి అసాధారణ తేజస్సు చేత వారి కది ప్రత్యవాయజనకము కాదు.

ఆ ధర్మవ్యతిక్రమమును, ఆ సాహసమును చూచి ఇప్పటివాడు అట్లు ప్రవర్తించినయెడల ప్రత్యవాయము నొందును. ఇక్కడ 'సాహస' పదప్రయోగముచేత లభించెడి అర్థమిది. —

ప్రబలమైన కారణము లేకున్న సాహసము సంభవింపదు. అందువలన అప్రబలకారణమే అట్టి పనియందు ఆవ్యక్తిని ప్రవర్తింప జేయుచు మనుష్యునిచేత సాహసకార్యము చేయించుచుండును. అక్కడ ఆప్రబల కారణమే ప్రవర్తకము కనుక సాహసము జరిగెను. అనుటే ఉచితము కాని, సాహసము చేసెననుట ఉచితముకాదు.

"న ప్రకుప్యతి దుర్వాసాః ప్రసుప్తే నాఽఽహతః పదా" అను న్యాయమున సుషుప్త్యవస్థలో పాదాఘాతము జరిగెనందురా? చేసెనందురా?

అట్టి సాహసకర్మ ఎక్కడ సంభవించెనో అక్కడ ఆ ప్రబల కారణావిష్టమైన మనస్సునందు వివేక మాత్రణమందు లుప్త ప్రాయ మగును. ధర్మవిరుద్ధకార్యము అవశ్యకర్తవ్యముగా భావించును. అంతమాత్రమే కాదు, ఆ ధర్మవిరుద్ధాచరణమువలన సంభవించు అనర్థమును పరిహరించుకొనగల సామర్థ్యమును బట్టియే ప్రవర్తించును. అన్యుడు అట్టి సామర్థ్య మేమియు విచారింపకయే ప్రవర్తించి అనర్థములకు పాలగును. (ధర్మతత్త్వనిర్ణయపరిశిష్టము)

ఇట్లు మహర్షులలోని ప్రవృత్తిపై శంకించి అది ధర్మవ్యతి క్రమమే అనియు, ప్రబలమైన కారణముయొక్క ప్రేరణకు వశుడై ధర్మవిరుద్ధ కార్యమందు సాహసముతో తన్మూలకముగా సంభవించు అనర్థములను పరిహరించుకొనగల సామర్థ్యముతో ప్రవర్తించు ననియు— "తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే," అనుచు బోధించినవాడు ఆపస్తంబమహర్షి.

"తపోబలారూఢస్య చరితం 'సర్వం బలవతః పథ్యమ్'" ఇతిన్యాయేన మహాన్తి చ తపాంసి కృత్వా, తాని క్షయం నయతః ఉత్తరకాలం వా, పాపవిశుద్ధిం ప్రాయశ్చిత్తైః ప్రకుర్వాణస్య జీర్యత్యపి మంద తపసా మగజై రివ మహావటకాష్ఠాదిభక్షణ మాత్మవినాశాయైవ స్యాత్ ॥ (తంత్రవార్తికమ్)

తపోబలారూఢుని చరితము-మహాతపస్సులు చేసి ఆశక్తిని పొని యోగించుకొనునట్టియు, తరువాతనైనను పాపశుద్ధిని చేసికొను మహానీయునకు 'సర్వం బలవతః పథ్యమ్' అనున్యాయమున అది జీర్ణమై పోవును. మరిక్రొమ్మ్రలను భక్షించిన మహాగజములకు అవి జీర్ణమై పోవునట్లు.

అట్టి తపశ్శక్తి లేనివానికి ఇతరజంతువులకు వటకాష్ఠభక్షణము వలె ఆత్మవినాశకమే అట్టి పని యగును. అనుచు ఆమహాత్ములకే అది చెల్లును. అనుచు బోధించినవాడు కుమారిలభట్టపాదుడు.

వేదవ్యాసప్రభృతులు ఆధికారికపురుషులనియు, బ్రహ్మనిష్ఠులనియు, అధికారసమాప్తిపర్యంతము వారు జీవన్ముక్తులైయుందురనియు, వారికి ఆగామిసంచితకర్మ లంట వనియు, శ్రుతి స్మృతి ప్రమాణములతో నిరూపించి—

"యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా ॥"

అను గీతావచన ముదాహరించి బ్రహ్మజ్ఞాన నిష్ఠుల సర్వవిధ కర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధము లగును. వారి కేవిధమైన దోషమంటదు. అని ఉద్ఘోషించుచున్నది వేదాంత దర్శనము.

"కృతాని యాని కర్మాణి దైవతై ర్మునిభి స్తథా ।
న చరే త్తాని ధర్మాత్మా శ్రుత్వా చాపి న కుత్సయేత్ ॥
సంచిన్త్య మనసా రాజన్ విదిత్వా శక్య మాత్మనః ।
కరోతి య శ్శుభం కర్మ స వై భద్రాణి పశ్యతి ॥
నవే కపాలే సలిలం సంన్యస్తం హీయతే యథా ।
నవేతరే తథా భావం ప్రాప్నోతి సుఖభావితమ్ ॥
(శాన్తి - అ 29)

ఇక్కడ, కర్మఫలము అపరిహార్యము కదా— అందువలన వసిష్ఠుని పుత్రశతము విశ్వామిత్రునిచే హతమైనది, దాని ఫలముగా

నరకపాత మాహమహర్షికి కలుగలేదేమి ? అని శంకించి విశ్వామిత్ర కృత్యము ఆవిషయమున కుదాహరణము కానేర దనుచు చెప్పుచుండెను-

దేవతలచేతను, మునులచేతను చేయబడిన కార్యములను ధర్మాత్ముడు చేయరాదు; వారిని గర్హింపరాదుకూడను. తనకు శక్యమైన శుభకర్మలనే చేసి శుభములు పొందవలెను.

పచ్చికుండలో నీరు పోసినపుడు కుండ విచ్చిపోవును. ఆనీరు కాల్చిన కుండలో పోసినప్పుడు చెక్కుచెదరదు. అట్లే పాపపుణ్యము లంటనట్టి తేజశ్శాలికి, కర్మ ప్రమాదకరము కానేరదు. ఇతరులకే ప్రమాదకర మగును. అని యుధిష్ఠిరున కుపదేశించినవాడు భీష్ముడు.

ఇట్టి స్థితిలో— "అహల్యాజారుని కన్న, శాస్త్రకర్తలగు శుక్రబృహస్పతుల కన్న నీచులు లేరని నిరూపింపవచ్చును" (పు 7)

అన్న రహస్యాలకర్త— "తేషాం తేజోవిశేషణ ప్రత్యవాయో న విద్యతే" అనుటచే వారికి ప్రత్యవాయము లేదు. అని తెలిసికొనవచ్చును.

అట్లు చేయుడని వారు శాస్త్రములలో చెప్పనేలేదు.

అహల్యాజారుడు- 'సురకార్య మిదం కృతమ్"
"శాపమోక్షేణ మహాతా తపోఽస్యాపహృతం మయా"

అని చెప్పుటచేత కాముకుడై ప్రవర్తించినవాడు కాడని స్పష్టము. అట్టివారిని, నీచు లని ఎవ్వరును అననట్టివారిని నీచులని ఈయన నిరూపించునా ? కనుక ఇది అసంగతము.

వసిష్ఠ- శతానన్ద- పరశురాముల విషయమై పరశురామునితో విశ్వామిత్రవచనము —

"హిరణ్యగర్భాద్వృషయో బభూవుః వసిష్ఠభృగ్వంగిరస స్త్రయో యే।
స్తోఽయం వసిష్ఠో భృగునన్దన స్త్వం ఏషోఽపి తస్యాఽంగిరసః ప్రపౌత్రః॥"
(మహావీరచరితం)

హిరణ్యగర్భునివలన వసిష్ఠుడు, భృగువు, అంగిరస్సు అను ముగ్గురు ఋషు లుద్భవించిరి. పరశురామా! ఈతడు వసిష్ఠుడు. నీవు భృగునందనుడవు. ఈశతానందుడు ఆ అంగిరస్సునకు ప్రిపౌత్రుడు.

'హిరణ్యగర్భా త్కూటస్థా దంగిరాః, తస్మాదు చథ్యః, తస్మాద్గౌతమః, తస్మా చ్ఛతానందః ॥

ఏవం కూటస్థా ద్ధిరణ్యగర్భాత్ భృగుః, భృగోః ధాతా, విధాతాచ, తతః క్రమేణ ఋచీకః, తస్మాజ్జమదగ్నిః, తస్మా త్పరశురామః

(వీరరాఘవీయం)

భృగువంశము- కూటస్థుడైన హిరణ్యగర్భునివలన భృగువు, ఆ భృగువంశములో- ఋచీకుడు, ఆయనవలన- జమదగ్ని, జమదగ్ని వలన- పరశురామతపస్వి.

అంగిరస్సు వంశము— కూటస్థుడైన హిరణ్యగర్భునివలన- అంగిరస్సు, అంగిరస్సునివలన ఉచథుడు, వానివలన గౌతముడు, గౌతమునివలన- శతానందుడు. అని క్రమము చెప్పబడినది. రహస్యాల కర్త — 'దీర్ఘతముని బిడ్డలలో చేరిన వారే మన అహల్యాపతి శ్రీగౌతములవారు అనియు, "శతానందుడు- శతమఖుని ఆనందము వలన సంభవించినవాడు" (17) అనియు ప్రమాణవిరుద్ధముగా వ్రాసినది నిరస్తమైనది.

మహర్షుల పరంపర ఇట్లున్నది.

రహస్యాలకర్త ఇట్లనెను— 'ప్రాచీనఋషుల కెవ్వరికిని కుల గోత్రములు లేవు ? శతమఖునివల్ల జన్మించినవాడు శతానందుడు, 'జమదగ్ని కొంపలో సంకరజాతులరంకులో ఉద్భవించినది పరశు రామావతారము' వంకరటింకరసంకరజాతి మహానుభావులే గామాయణకావ్యములో,

అనుచు— 'పౌరాణికుల కూతలు, బజారుమాటలు ప్రమాణము లగునా ?' అని సెలవిచ్చుటచే వీరి [illegible] ధోరణికి వీరి మాటలనే అప్పగించుచున్నాము.



ఎప్పుడో ఒకప్పుడు మహర్షులు ధర్మవిరుద్ధముగా ప్రవర్తించినను, ఆదోషము వారి కంట దన్నపుడు ఈయన దుర్భావ లంటునా? వారికంటదు కాని, వీరికంటుకొనితీరును.

ఆమహర్షులు, అబ్భక్షులై వాయుభక్షులై చేసిన తపస్సు, ధర్మానుష్ఠానము, దాని ఫలము యుధిష్ఠిరుడు ద్రౌపదీదేవి కిట్లు బోధించెను—

ప్రత్యక్షం హి త్వయా దృష్ట ఋషి ర్గచ్ఛన్ మహాతపాః।
మార్కండేయోఽప్రమేయాత్మా ధర్మేణ చిరజీవితా ॥
వ్యాసో వసిష్ఠో మైత్రేయో నారదో లోమశ శ్శుకః ।
అన్యే చ ఋషయ స్సర్వే ధర్మేణైవ సుచేతసః ॥
ప్రత్యక్షం పశ్యసి హ్యేతాన్ దివ్యయోగసమన్వితాన్ ।
శాపానుగ్రహయో శ్శక్తాన్ దేవేభ్యోపి గరీయసః ।
ఏతే హి ధర్మ మేవాదౌ వర్ణయన్తి సదాఽ నఘే ।
కర్తవ్య మమరప్రఖ్యాః ప్రత్యక్షాగమబుద్ధయః ।
అస్మాకం వేదైకగమ్య మప్యర్థం ప్రత్యక్షేణ పశ్యన్తః ॥"

(వనప-అ 30)

ఆనాడు మార్కండేయ- వసిష్ఠ-వ్యాస-మైత్రేయ-నారద-లోమశ- శుక- ప్రభృతిమహర్షులను ప్రత్యక్షముగా సందర్శించి వారిని కీర్తించుకొన్నవారు పాండవులు.

ఈ రహస్యాలకర్త వారి మొగ మెరుగడు వారి దివ్యశక్తులను, నిగ్రహాఽనుగ్రహసామర్థ్యములను ఏమియు గమనింపడు. నోటికి వచ్చినట్లు దిట్టును.

"అతో హాస్యతరంలోకే కించి దన్య న్న విద్యతే ।
యత్ర దుర్జన ఇత్యాహ దుర్జన స్సజ్జనం స్వయమ్ ॥"

అన్నట్లు దుర్జనులు వారో, వీరో గమనింతురుగాక,

# ఏకపత్నీవ్రతుడే శ్రీరాముడు

వాల్మీకిరామాయణములో శ్రీరాముని ఏకపత్నీవ్రతమును గూర్చి—'భారతి' మే - 1960 'శ్రీరామునికి భార్య లెందరు?' అను వ్యాసమును గొట్టుముక్కల కృష్ణమూర్తిగారు- "జిజ్ఞాస" అని ప్రకటించియున్నారు.

తరువాత - "తెలుగువిద్యార్థి" మాసపత్రిక -

నవంబరు 1968. "శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడా?" అని ఆక్షేపించుచు, ఈ రహస్యాలకర్త వ్యాసమును ప్రకటించెను.

కృష్ణమూర్తిగారు- 'ఏకపత్నీవ్రతమునకు పురాణాంతరవిరోధమే కాక, రామాయణములోని స్థలాంతరవచనములతో గూడ విరోధము కనబడుచున్న, దనుచు 5 స్థలములలోని వచనము లుదాహరించినారు. ఆపురాణవచనములను ఉదాహరించినారు.

ఇంతేకాక- "న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘు నన్దనః । యజ్ఞే యజ్ఞే చ పత్న్యర్థం కాంచనీ జానకీ భవత్ ॥" అని యున్న వాల్మీకి కంఠోక్తినికూడ ఉదాహరించిరి.

ఇంతే కాదు - "గోవిందరాజీయాదివ్యాఖ్యాతలు- శ్రీరామునికి సీతయేకాని, ఇతరభార్యలు లేరని, దానికి ప్రమాణము- "న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునన్దనః" అను వాల్మీకి కంఠోక్తియే అని చెప్పుచు వాల్మీకములోని స్థలాంతరవచనములు 5 సమన్వయము చేసియున్నారు" అని కూడ వ్రాసియున్నారు. ఇట్లు రామాయణములోని వచనములకు అన్యోన్యవిరోధము లేకుండ గోవింద రాజాదివ్యాఖ్యాతలు సమన్వయము చేసియుండ కృష్ణమూర్తిగారి జిజ్ఞాస దేనికి? పురాణాంతరవచనవిరోధపరిహారమునకు మాత్రమే.

ఇక రహస్యాలకర్త చేసిన పని చూడుడు- ఈయన విరుద్ధము లనిపించు ఆపురాణవచనములే చూపి రామాయణములోకూడ విరుద్ధముగా నున్నట్లు కనబడు ఆ 5 స్థలాంతరవచనములే చూపి, "ఇతర భార్య లున్నా, రని గోవిందరాజవ్యాఖ్యానము కంఠరవేణ స్పష్ట

పరచినది" అనికూడ చెప్పి, "న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునందనః" అను వాల్మీకవచనము దాచివేసినారు.

ఇంతే కాదు. గోవిందరాజవ్యాఖ్యానము ఎట్లుండగా ఎట్లు చూపిరో అదికూడ చూడుడు—

'నను అత్ర స్త్రీశబ్దో భార్యాపర ఏవ... స్త్రీభి స్త్వ మన్యే... త్వాం రంస్యసే... దర్భశయనవర్ణనే- 'భుజైః పరమనారీణా మమ్మృష్టమ్'... ఇత్యుక్తమ్... అశ్వమేధప్రకరణే-'మాతర శ్చైవ సర్వా మే కుమారాః స్త్రీగణాని చ' ఇతి దర్శితమ్...

అతోఽ భిధీయతే—రామ స్యైకదారవ్రతత్వం సర్వసిద్ధం, తచ్చ పత్న్యన్తరసంభవే, న సంగచ్ఛతే... ఇతి దిక్' (అయోధ్యా-స 8)

ఇక్కడ 'నను' అని ఆరంభించి, 'ఇతి దర్శితమ్' అను వరకు అనేక భార్యలున్నట్లు పూర్వపక్షము ప్రదర్శించి— 'అతోఽభిధీయతే' అనుచు చెప్పిన సమాధానములో—శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడన్నది సర్వసమ్మతము. పత్న్యన్తరమున్న యెడల అది అసంభవము. 'న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునన్దనః' అనుచు ఏకపత్నీవ్రతుడే శ్రీరాము డని వాల్మీకిమహర్షియే యుద్ఘోషించెను. అని ప్రతిపాదించి, పై పూర్వపక్షములోని వచనములు ఏకపత్నీవ్రత సిద్ధాంతమునకు విరుద్ధములు కావని సమన్వయించెను. ఇది గోవిందరాజవ్యాఖ్యానము.

ఈ వ్యాఖ్యానములో—రహస్యాలకర్త, 'నను' అని యున్న పూర్వపక్షములో 'నను' తీసివేసి, 'అతోఽభిధీయతే' అని యున్న సిద్ధాంతము నంతయు తీసివేసి, ఆయావచనముల సమన్వయగ్రంథము తీసివేసి, 'ఈస్థలములలో స్త్రీనారీశబ్దములు భార్యాపరములే కాగలవని గోవిందరాజవ్యాఖ్యానము కంఠరవేణ స్పష్టపరచినది.'

అని వ్రాసినారు. ఇది ఎంత ద్రోహమో చూడుడు- విషయమంతయు అమర్చిపెట్టి ఈయన ఖండించిన ఆకృష్ణమూర్తిగారి సౌజన్యము, ఈయన కేశోశమందైన కలదేమో గమనింపుడు.

'రామాయణరహస్యాల' మాట కేమి? వీరి రహస్యాలలో బయటపడిన రహస్య మిదిఒకటి.

'ఈ రహస్యాల కర్త, 'తెలుగువిద్యార్థి' పత్రికలో ప్రకటించిన 'శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడా?' అను వ్యాసమునకు సమాధానము వ్రాసి పత్రికాసంపాదకులకు పంపితిని, దానిని ప్రకటింపలేదు.

ఆయన పక్షపాతబుద్ధికి సంతోషించి —అరుంధతి -శ్రీరాముని ఏకపత్నీవ్రతము. ఇత్యాద్యంశములతో ఒక పుస్తకమునే ప్రకటించి యున్నాము.

అందులో పురాణాంతరవచనవిరోధము రామాయణ వచనమునకు వలె రామాయణవచనవిరోధము పురాణాంతర వచనములకును సంభవించుచున్నందున అన్యోన్యవిరోధపరిహారము చేయబడి యున్నది. ఆగ్రంథము చూచి విశేషములు తెలిసికొందురుగాక.

## సత్యవ్రతుడే శ్రీరాముడు

రహస్యాల కర్త వ్రాత—

1. "శూర్పణఖ శ్రీరాముని కాంక్షించునపుడు ఆతడామెతో అన్నమాట—

"కృతదారోఽస్మి భవతి భార్యేయం దయితా...
అనుజ స్త్వేష మే భ్రాతా...అకృతదార శ్చ..."

తాను కృతదారుడనని, లక్ష్మణుడు అకృతదారుడనిచెప్పెను. రాముడు సత్యసంధుడని ప్రతీతి కద్దు. ఇది శ్రీరాముని హాస్యమైన కావలె. అసత్యమైన కావలె.

2. "నాశ్రౌష మితి రాజాన ముపాలబ్ధోపి వక్ష్యసి" ఆతడు సత్యవ్రతు డన్న మాట లక్షరాలా అసత్యమనియే చెప్పవచ్చును" అట. (పు-44)

ఈవిషయములుకూడ మా "అరుంధతి" లోనే "శ్రీరాముని సత్యవ్రతము" అన్నచోట నిరూపింపబడి యున్నవి. అది చూచి ఆవిశేషములు తెలిసికొందురుగాక.

రహస్యాలకర్త వ్రాత —

"ఒకే మాట, ఒకే భార్య, ఒకే బాణము. ఆత డాడిన మాట తప్పడట! సీత ఒక్కతే ఆతని ఇల్లాలట! ఆతడు ప్రయోగించెడి బాణము వ్యర్థము కాదట. ఈనూడింటను చూడ వాల్మీకము లోనే ఎన్నో తబ్బిబ్బు లున్నవి" అట. (పు 39)

ఇంత స్పష్టముగా శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు కాడన్న మాట రూఢి యగుచుండగా పౌరాణికుల కూతలు బజారు మాటలు ప్రమాణము లగునా?" అట!" (పు 54)

## పౌ రా ణి కు లు

పౌరాణికులు రెండు రకములుగా నున్నారు—

"సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్ ॥"

అని—సృష్టి, ప్రళయ, మన్వంతర, ఇత్యాది పంచలక్షణము లతో ఒప్పునది పురాణము. అట్టి దాని నవలంబించి వ్యవహరించు వారు పౌరాణికులు. వీరు ఒక రకము వారు.

1. "రాముని మాయామానుషవిగ్రహు డనిరి. అనగా తెలివి తేటలు లేని మానవు డని అర్థము.

2. ఏకపత్నీ వ్రతుడేనా? ప్రతినిమిషమును సీతను శంకించు చునే యుండెను.

3. "అన్నమో రామచంద్రా యటంచు నేడ్చు వా రయోధ్యలో చెక్కు రున్నారు కాని, అన్నమో రావణప్రభూ యంచు నేడ్చువారు లంకలో నెవరు కన్పట్టరారు."

ఇత్యాది లక్షణములతో ఒప్పుచున్నది. యథార్థ రామాయణ పురాణము. నూతనపురాణము. దాని నవలంబించి వ్యవహరించువారు

రెండవరకము పౌరాణికులు. ఈ పౌరాణికులవే కూతలు, బజారు మాటలు అని తెలిసికొందురుగాక.

## శ్రీరామునిపట్ల
## త్యాగరాజస్వామి ఆర్తి

'ఒక మాట, ఒక బాణము, ఒక పత్నీవ్రతుడే మనసా! ఒక చిత్తము కలవాడే ఒకనాడును మరువకనే'

"కలినరులకు మహిమ దెలిపి యేమి ఫల మనలేదా? ఇలను వెలయు వరవృషభాదుల కటుకుల రుచి తెలియు చందముగానే"

"సలలితు డని మును బలికిన వాల్మీకుల వాక్కులు కల్లలాయెనా"

"కలియుగమనుజులు నీకు మహాత్త్వము కలదు, లేదనుదాసులు కాల మాయెగా"

"కాముని దాసులు నాపల్కులు విని కావలసినటుల నాయెగా
పామరులను కని సిగ్గుపడును మరి మోము మరుగుచేసి తిరుగ నాయెగా"

'కార్యాకార్యము, సమ మాయెను నీశౌర్య దాచుకొంటి వయా!'

## మాంసభక్షణము

రహస్యాలకర్త వ్రాత—

1. "మాంసము ఏది ఏ సమయములో తినదగినదో ఆర్ష జాతికి తెలిసినట్లు ఇతరప్రపంచమునకు తెలియు దన వచ్చును. మాంసము తినవలె నని ఈరచయిత భావము కాదు." (పు 55)

2. "అతిథిపూజలలోగాని, ఆబ్దికాలలో గాని మాంసాహారము విధ్యుక్తము."

3. "ధర్మశాస్త్రములన్నియు మాంసాహారము శాస్త్రీయ మని విశిష్య గోమాంసము శ్రేష్ఠతమ మని పదే పదే ఘోషించినవి"

4. అందువలననే "గో-బ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్య" మ్మను పల్లవి ప్రతిఘట్టములోను పఠింపబడుచుండును. "బ్రాహ్మణులకు, గోవులకు ఉన్న సంబంధ మిట్టిదని గుర్తింపవలెను."

(పు 56) అట!

ఇవి 4 అంశములు.

1. మాంసము తిన దగిన సమయ మేదో ఆర్యజాతికే తెలియును. అన్నది.

2. "ఆ యా సందర్భములలో మాంసాహారము విధ్యుక్తము" అన్నది.

ఇక్కడ వీరు 1లో వాడిన "సమయ" పదము కాలవాచకము. ఆకాలము— కృత- త్రేతా- ద్వాపర- కలియుగ భేదమున చతుర్విధము. అందులో వర్తమానము కలియుగము. ఈ కలియుగములో వర్జింపవలసిన వేవో చెప్పబడెను.

"ద్విజానా మసవర్ణాసు కన్యాసూపగతం తథా। దేవరాచ్చ సుతోత్పత్తిః, మధుపర్కే పశో ర్వధః, మాంసదానం తథా శ్రాద్ధే..."

"దీర్ఘకాలం బ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ।
ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యా నాహు ర్మనీషిణః॥"

(బృహన్నారదీయమ్)

"వర—అతిథి-పితృభ్యశ్చ పశూపాకరణక్రియా।
దత్త- ఔరస- ఇతరేషా న్తు పుత్రత్వేన పరిగ్రహః॥" (శౌనకః)
"విహితా న్యపి కర్మాణి ధర్మలోపభయా ద్బుధైః।
సమాపనే నివృత్తాని సాధ్వభావా త్కలౌ యుగే॥"

అర్థ-కామ-ప్రధాన మైన ఈ కలియుగములో భావశుద్ధి కలవారు అరు దగుటవలన ధర్మహాని కలుగకుండుటకై ఆ కార్యములు నివర్తింపజేయబడినవి.

దీనినిబట్టి మాంస ముపయోగింపవలసిన కాలము కలియుగము కాదు కనుక ఈకలిలో అది విధ్యుక్తము కానేకాదు. కనుక వీరి దోషారోపణ ఈనాటివారిపట్ల అర్థరహితము. ఇట్లు 1, 2 అంశములు ప్రత్యుక్తము లైనవి.

3. "ధర్మశాస్త్రము లన్నియు గోమాంసము శ్రేష్ఠతమ మని ఘోషించినవి" అన్నది.

అదికూడ ఈ కలియుగమునకు సంబంధించి ఆ శాస్త్రములు చెప్పలేదని తెలిసికొనవలెను.

4. "బ్రాహ్మణ్యమునకు గోవులకు ఉన్న సంబంధమును బట్టియే– "గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యమ్" అను పల్లవి పఠింపబడు చుండును" అట!

ఆ ఉభయత్ర వీరు కల్పించిన సంబంధము భక్షణ సంబంధము. వీరిబుద్ధి అంతటిదే. అపార్థకల్పనకు ఇంతటివారు లేరు.

గో–బ్రాహ్మణ–పరస్పరానుబంధ హేతు వేదో తెలుపుచున్నాము వినుడు–

"బ్రాహ్మణానాం గవాం చైవ కుల మేకం ద్విధా కృతమ్ ।
ఏకత్ర మన్త్రా స్తిష్ఠన్తి హవి రేకత్ర తిష్ఠతి ॥"

బ్రాహ్మణులది, గోవులది ఒకటే కులము. మన్త్రములు బ్రాహ్మణులయం దున్నవి. ఆజ్యాదిహవిస్సు గోవులయందున్నది. హవనక్రియలో ఉభయమునకు అనుబంధము. కనుకనే—

"హవి రావర్జితం హోత స్త్వయా విధివ దగ్నిషు ।
వృష్టి ర్భవతి సస్యానా మవగ్రహవిశోషిణామ్ ॥"

మహర్షి! నీవు అగ్నులయందు విధ్యుక్తముగా హవిస్సును సమర్పించుటవలన సస్యసంరక్షకముగా వర్షము కురియుచున్నది. అని వసిష్ఠమహర్షితో దిలీపమహారాజు చెప్పినట్లు ఆ మన్త్రములు, ఆ హవిస్సు, హవనక్రియలో కలిసి అన్యోన్యదక్షములకు కారణ మగు నని తెలిసికొనవలెను.

ఇట్లు 4వ అంశము పరాస్తమైనది.

ఇక రహస్యాలకర్త వ్రాత చూడుడు— గోవులను మేపుట, కాచుట మున్నగు పను లన్నియు ఇతరులు చూడవలెను. వానిపాలు, పెరుగు, అక్కర యైనప్పు డెల్ల వాని, మాంసము ఆరగించుట వీరి పని. అట !

బ్రాహ్మణులపట్ల వీరిది ఎంత నిష్కల్మషహృదయమో !

ఇంకొకటి—

"నేడు, గోరక్షణ, గోవధనిషేధము ఇత్యాది నినాదములు వినవచ్చుచుండును. ఆర్యజాతి ప్రాచీనచరిత్ర పరిశీలించినచో ఈ నినాదములలో అర్థము లేదు.

'ఏనాడో హైందవులే 'గోవధ' సదాచారము చేసిరి'

అనుచు వసిష్ఠమహర్షికి మధుపర్కములో గోవును వినియోగించి నట్లున్న ఉత్తర రామచరిత్రనాటక విషయము చూపి "సీతారాముల మాంసాహార" మను విషయము వ్రాసినారు.

ఇక్కడ కొంచెము చెప్పుకొందము— 'వీరు గోవధ నిషేధ' నినాదము నేటి దని, హైందవులు చేసినట్లున్న గోవధ, ఏనాటిదో అని వ్రాసినారు.

దీనినిబట్టి హైందవులు చేసినా రన్న "గోవధ" ఏనాటిదో, ఈనాటిది- ఈకలియుగములోనిది కాదని, గోవధనిషేధనినాదము" ఈనాటిదే అని స్పష్టము. ఇట్లుచూడ—గోవధ నిషేధనినాదములో అర్థమున్నది. వీరి వ్రాతలోనే అర్థము లేదు.

ఇక 'ఉత్తరరామచరిత్ర' విషయము, అది త్రేతాయుగమునకు చెందిన వసిష్ఠునికి సంబంధించినది. అది—"మధుపర్కే పశో ర్వధః" అని కలినిషిద్ధము.

ఆబ్దికే- అతిథిపూజలలో మాంసాహారము విధ్యుక్తము" అని వీరన్నది—

"మాంసదానం తథా శ్రాద్ధే" "వర- అతిథి- పితృభ్యశ్చ పశూపాకరణక్రియా" అని కలినిషిద్ధము, ఆర్షసంప్రదాయము-ఏదివిధ్యుక్తమో, ఏది శాస్త్రీయమో, అది చేయుట, నిషిద్ధమును వర్జించుట ఇదియే కనుక ఈకలియుగమునకు వీరిమాట లేవియు వర్తింపవు.

## సీతారాములు

రహస్యాలకర్త వ్రాత—

1. 'శ్రీరామచంద్రులవారు-ఏకపత్నీవ్రతులే కాదు, పితృవాక్య పరిపాలకులేకాదు; మాంసాహారమెరుగని మహారాజు లని కూడ పురాణశ్రవణములలో వినబడుచుండును'

**2.** "అడవులలో జంతువును కాల్చి ఆ ముప్పూరు, పోనీ ఆలుమగ లిద్వారే, పీకికొని తిన్నట్లే రామాయణములో గన్పించును"

అట ! (పు 63)

ఇక్కడ 1 అంశములో శ్రీరాముడు మాంసాహార మెరుగనివాడనుట ఎట్టిదో, పితృవాక్యపరిపాలకు డనుట, ఏకపత్నీవ్రతు డనుట కూడ అట్టిదే. అని వీరి బుద్ధికి తోచినది. రామాయణములో మాంసాహారి అని చెప్పినట్లు, అందులోనే పితృవాక్యపరిపాలకుడు, ఏకపత్నీవ్రతుడు అని చెప్పునపుడు దానిని కాదనుటకు వీరెవరు ? ఏకపత్నీవ్రత విషయమై ధ్రువపరచినట్టి గోవిందరాజీయమును తప్పుగా చూపి వీరు చేసిన సారస్వతద్రోహము అసహ్యము. 2. జంతువును కాల్చి సీతారాములు తాటిపండునువోలె పీకికొని తిన్నట్లు స్వయముగా చూచి నట్లే చెప్పినారు. వారి బుద్ధిజాతి అది.

మాంసాహారవిషయమై భీష్మోపదేశము—

"భక్షణే తు మహాన్ దోషో నివృత్త్యా పుణ్య ముచ్యతే ।
విధినా వేదదృష్టేన తద్భుక్త్వేహ న దుష్యతి ॥
యజ్ఞార్థేః పశవ స్సృష్టా ఇత్యపి శ్రూయతే శ్రుతిః ।
అతోఽన్యథా ప్రవృత్తానాం రాక్షసో విధి రుచ్యతే ॥

క్షత్రియాణాం తు యో దృష్టో విధి స్త మపి మే శృణు ।
వీర్యే ణోపార్జితం మాంసం యథా భుంజ న్న దుష్యతి ॥
ఆరణ్యా స్సర్వదై వత్యా స్సర్వశః ప్రోక్షితా మృగాః ।
అగస్త్యేన పురా రాజన్ మృగయా యేన పూజ్యతే ॥
అతో రాజర్షయ స్సర్వే మృగయాం యాన్తి భారత ।
న హి లిప్యన్తి పాపేన న చైత త్పాతకం విదుః ॥"

(అనుశాసన – అ 116)

మాంసభక్షణము ఐచ్ఛిక మైనచో మహాదోషము. విసర్జించుట పుణ్యము. వేదోక్త విధి ననుసరించి భుజించిన దోషము లేదు. పశువులు యజ్ఞార్థమై సృష్టింపబడినట్లు శ్రుతి చెప్పుచున్నది. విధి నతిక్రమించి ప్రవర్తించుట రాక్షసవిధానము. క్షత్రియులకు విధి ఎట్లున్నదో వినుము— తన పరాక్రమముచేత సంపాదించిన దానిని భుజించుట దోషము కాదు. సర్వదైవత్యములు, ఆరణ్యములు అయిన మృగములు మన్త్రసంస్కారప్రోక్షితము లైనవి అగస్త్యమహర్షి చేత. అందుచేతనే రాజర్షు లందరికి మృగయ (వేట) పూజ్యమైనది. వారికి పాప మంటదు. అది పాతకము గాదు. అని.

ఇక్కడ ఏది పాపమో, ఏది కాదో, ఏది విహితమో, ఏది కాదో, నిరూపింపబడి రాజర్షు లందరకు ఆదరణీయమై యొప్పినట్లు ప్రతిపాదింపబడినది మృగయావిహారము. తన్మూలకముగ ప్రాప్తించినది క్షత్రియులకు భక్ష్యమే అని ఉపదేశించినవాడు— శరశయ్యపై శయనించి శరీరత్యాగమునకై ఉత్తరాయణమునకై నిరీక్షించుచు మహర్షిగణపరివేష్టితుడై యుధిష్ఠిరప్రశ్నములకు సమాధానములు సర్వజ్ఞుల సమక్షమున చెప్పిన భీష్మపితామహుడు.

దీనినిబట్టి "సీతారాముల మాంసాహారము" అను పేరుతో అది దూష్యముగా చెప్పదలచి ఈ రహస్యాలకర్త చేసిన కోలాహలము ప్రతిహతమైనది.

"మరి శ్రీరాముడు మాంసాహారి కాకుండు టెట్లు? "గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్య" మ్మను కారికలో పుట్టి-"బ్రాహ్మణో మమ దేవతా" అని జపించుచు బ్రాహ్మణభక్తిలో నిలువెల్ల మునిగిన వాడు- శ్రుతిస్మృతుల ప్రకారము నడువవలె నని కంకణము కట్టుకొన్న వాడు మాంసాహారము నిషేధింపగలడా ?

నిషేధించినచో వసిష్ఠులవారు కోపింపరా? ఆయనకు కోపము తెప్పించిననాడు రాముడెక్కడ? రామాయణ మెక్కడ? అట!"

(పు 70)

ఇక్కడ, "రాముడు మాంసాహారి" అని అల్లరిచేయు ఈయన- "శ్రుతిస్మృతుల ప్రకారము నడువ కంకణము కట్టుకొన్నవాడు, మాంసాహారము నిషేధింపగలడా? అను మాటతో శ్రీరాముని మాంసాహారము శ్రుతిస్మృతిసిద్ధమనుచుండి, అది దాస్యమైనట్టుగోల చేసినది అల్లర అగునా, కాదా? ఏశ్రుతిస్మృతులకు శ్రీరాముడు బద్ధుడో, ఆశ్రుతిస్మృతులకే వసిష్ఠుడును బద్ధుడు. మాంసాహారనిషేధ ప్రసక్తి రామున కేమి వచ్చె? అది వచ్చినను శ్రుతిస్మృతివిరోధము కాని, వసిష్ఠునకు విరోధ మేమి? కోప మేమి?

ఇది వసిష్ఠవిద్వేషముతో కూడిన అసంబద్ధ ప్రలాపము. ఇంకొకటి—

శ్రీరాముడు— 'గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు' అనుకారికలో పుట్టుటకును, మాంసాహారి అగుటకును సంబంధ మేమి? ఇది బ్రాహ్మణ ద్వేషముతో కూడిన అసంబద్ధప్రలాపము.

ఇంకొకటి— శ్రీరాముడు— "బ్రాహ్మణో మమ దేవతా" అని జపించుటకును, మాంసాహారి యగుటకును సంబంధమా?

'శ్రుతిస్మృతుల ప్రకారము నడచుకొన కంకణము కట్టుకొన్న వాడు. కనుక మాంసాహారి' అను తనమాట చేతనే ఇది కొట్టబడి పోయినది.

# బ్రాహ్మణో మమ దేవతా

రహస్యాలకర్తకు ఈ వాక్యము ఎంత దుస్సహమో?

"దైవాధీనం జగత్సర్వం మన్త్రాధీనం తు దైవతమ్ ।
తన్మన్త్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమ దేవతా ॥"

జగత్తు దైవాధీనము - సృష్టించి అన్నోదకము లిచ్చి సంరక్షించు దైవముపై ఆధారపడియున్నది.

ఆదైవతము మన్త్రాధీనము. బాలుడైన ధ్రువునకు విష్ణుభగవానుని సాక్షాత్కారము, బాలయైన కుంతీదేవికి సూర్యదేవ సాన్నిధ్యము, బాలుడైన మార్కండేయునకు ఈశ్వరసాక్షాత్కారము ఇట్టి వన్నియు మన్త్రాధీనములే.

తన్మన్త్రం బ్రాహ్మణాధీనమ్— వారలకు అట్టి మన్త్రములను గ్రహించినవారు మహర్షులగు బ్రాహ్మణులు. "బ్రాహ్మణో మమ దేవతా" దేవతలను స్వాధీనము చేయగల మంత్రబలము గల బ్రాహ్మణుడు దేవతయే నాకు అని ఎవరో అనుకొనగా, ఈయనకు అసహిష్ణుత్వ మెందులకు?

పూర్వయుగములలోని ఆ బ్రాహ్మణమహర్షులమాట అటుండగ ఈ "కలి"లో కూడ క్రీ. పూ. 327 సం॥ వృత్తాంతము చూడుడు.

బ్రాహ్మణులు - తెమిస్టసు —

అలెగ్జాండరు— క్రీ. పూ. 327 సం॥ ఈ దేశముపై దండెత్తి వచ్చినపుడు ఆతనితో వచ్చిన చరిత్రకారుడు తెమిస్టస ఇట్లు వ్రాసెను—

"బ్రాహ్మణులు దూరమునుండి పిడుగులను, మెరుపులను మాపై వెదజల్లుచు యుద్ధము గావించిరి."

బ్రాహ్మణులు— అలెగ్జాండరు— అలెగ్జాండరు ఇండియానుండి వెడలిపోయిన పిమ్మట— "అరిస్టాటలు"కి వ్రాసిన ఉత్తరము—

'నా సైన్యము హిందూదేశములో దావాగ్నిసన్నిభంబులగు అస్త్రములలో ముంచివేయబడెను.'

బ్రాహ్మణులు- ఫిలోస్ట్రాటసు-

"విరోధు లెవ్వరైనను వారి పైకి యుద్ధమునకు వచ్చినచో ఆకసమునుండి జార్చినట్లు తుపానులను, పిడుగులను శత్రువులపై వెద జల్లి తరిమివేసెదరు.

శత్రురాజులు ముట్టడించువరకు ఈబ్రాహ్మణఋషీశ్వరులు నిశ్చింతగా చూచుచుండి, వారు ముట్టడి సాగించినవెంటనే సుడిగాడ్పు లను, పిడుగులను మింటనుండి కురిపించి వారల నాశనము గావించి పారద్రోలియున్నారు." (కలిశకవిజ్ఞానం - భా 3)

ఈపాశ్చాత్యులు స్వానుభవముతో వ్రాసిన ఈవిషయమును బట్టి ఈ "కలి" లో కూడ యుద్ధోపద్రవమునుండి ధన-జన-నాశము లేకుండ ఒకప్పుడు రక్షించినవారు బ్రాహ్మణఋషీశ్వరులే అని వారి సాక్ష్యము స్పష్టపరచినది.

ప్రసక్తమైనందున ఒక మాట అనుకొందము—

ఆంధ్రజ్యోతి - 25 జూన్ 1961

రవీంద్రకవీంద్రుని మాటలుగా ఇట్లున్నది— "సమాజములో మహోన్నత స్థానము తమకు ఆజన్మసిద్ధముగా లభించినదని బ్రాహ్మ ణుల భావము" అట.

హంటరుపండితుడు- "బ్రాహ్మణసంఘము, నియమబద్ధమై విజ్ఞానము, ఇంద్రియనిగ్రహము ముఖ్యముగా గల నిబంధనలతో కూడియున్నది" అనెనే కాని "మహోన్నత స్థానము ఆజన్మసిద్ధముగా తమకు లభించిన దని బ్రాహ్మణుల భావము" అని రవీంద్రు డన్నట్లనెనా ?

సరస్సులో పద్మము లుండును. వాని క్రిందనే కప్పల సంచా రముండును. ఎక్కడో వనములోని తుమ్మెదలే పద్మసౌరభ్యమును గ్రహించి వచ్చి వాలును. ఆవాసన భేకములకు తెలియునా ?

రహస్యాలకర్త వ్రాత—

"బ్రాహ్మణో మమ దేవతా" సూత్రములో వెన్నపై చిలికొన్ని పాయసములో పుట్టి పెరిగినవాడే రామభూజు.

1. రామరాజ్య మనగా — "అన్నమో రామచంద్రా" అని ఆకటి మంటలచే అలమటించిన రాజ్యము.

దేశములో 'ఆలన పాలన' లేక 14 ఏండ్లు పంటలు లేక తిండి చాలక 'అలో లక్ష్మణా' యని యేడ్చిన రోజులు. తాను చేసిన ఘనకార్యములవలన ఇల్లాలు సీత చేతినుండి జారిపోగా అలో లక్ష్మణా యని యేడ్చిన రోజులు."

2. "మనకు దక్కిన స్వరాజ్యమును రామరాజ్యముగా చేసి కొనవలె నని కొందరు పాట పాడెదరు. అనగా- మరల వసిష్ఠాదులు అవతరింపవలెను. ఎద్దు ఈనె ననగా గాట గట్టివేయు మనవలసినవారు పుట్టవలెను. శంబూకాదులు చావవలెను. అని వారి ఆకాంక్ష'

అట! (పు 118)

ప్రథమాంశము—రామరాజ్య మెట్టిది? 'అన్నమో రామ చంద్రా' అని ఆకటిమంటలచే అలమటించినదా? ఈస్థితి ఎప్పటిది? దశరథు డుండగానే వనవాసియై, 14 సం॥ లు అయోధ్యకు రానే లేదుకదా!

అప్పుడు 'అన్నమో రామచంద్రా' అని యెట్లందురు! 'అలో లక్ష్మణా' అని యెట్లందురు. ఆసమయము రామరాజ్య మెట్లగును? అప్పుడు రాజ్యరక్షకుడు భరతుడు. ఆభరతునిగూర్చి వారు ఆక్రోశింపనేలేదు.

దేశములో ఆలన, పాలన లేక 14 ఏండ్లు పంటలు లేక తిండి చాలక యేడ్చిన రోజులా?

ఇదికూడ రామాయణరహస్య మేనా?

భరతునకు రాజ్య మప్పగించి వెళ్ళిన రామప్రభువు 14 ఏండ్లు కైకేయీవాంఛాప్రకారము అరణ్యమున గడపి సపరివారముగా అయోధ్యకు వచ్చి దర్శన మిచ్చినపుడు భరతుడు శ్రీరామపాదుక లతో వచ్చి శ్రీరామపాదారవిందములకు తొడిగి అంజలి ఘటించి

నాచే రక్షితమైన నీరాజ్యము నీకు సమర్పించితిని. నాజన్మ కృతార్థమైనది.

"అవేక్షతాం భవాన్ కోశం కోష్ఠాగారం పురం బలమ్ ।
భవత స్తేజసా సర్వం కృతం దశగుణం మయా॥
తథా బ్రువాణం భరతం దృష్ట్వా తు భ్రాతృవత్సలమ్ ।
ముముచు ర్వానరా బాష్పం రాక్షసశ్చ విభీషణః ॥"

(యుద్ధ-130)

నాచే రక్షితమైన కోశము, ధాన్యాగారము, పురము, బలము, నీప్రభావముచేతనే దశగుణితముగా చేయబడినది. పరిశీలింప ప్రార్థించుచున్నాను. అని విన్నవించెను. భరతుని ఈ విన్నపములో- తన రాజ్యపాలనవైభవము, దశగుణితసర్వసంపత్సమృద్ధి విశదీకరింపబడినది. దీనినిబట్టి వీరి వాచాలత తోసివేయబడినది.

"నచాగ్నిజం భయం కించిత్ ...నచాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా । నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ'

ఇట్లు వైభవముతో ఒప్పినది రామరాజ్య మని తెలిసికొందురుగాక.

ఇంకొకటి—అన్నమో రామచంద్రా! అని సంబోధించుట అన్నము పెట్టువానినా? పెట్టనివానినా?

ఈమాటకు, ఆలో లక్ష్మణా అన్న మాటకు భేద మీయనకు తెలియునా? లేదా? లక్ష్మణు నాక్రోశింప నేమి పని?

ఇట్లుచూడ, 1. వనవాసకాలము రామరాజ్యము కాకుండుట, 2. అప్పుడు రాజ్యరక్షకు డగు భరతుని ఆక్రోశింపకుండుట, 3. వనవాసులైన రామలక్ష్మణుల నాక్రోశించి ప్రయోజనము లేకుండుట, 4. లక్ష్మణు నాక్రోశించి అసలే ప్రయోజనము లేకుండుట, 5. "అన్నము ఓ రామచంద్రా!" అను సంబోధనము. అన్నదాత రామచంద్రు డని స్పష్టపరచుచుండుట. ఈ కారణములచేత ఈ రహ

స్యా కర్తది అసంబద్ధప్రలాపము. "తన ఇల్లాలు చేతినుండి జారిపోగా "అలో లక్ష్మణా" అని యేడ్చిన రోజులట!"

ఆ యేడ్పు ప్రజలదైనట్లు చెప్పి, ఇప్పుడు రామునకే పట్టించినారు. నోటికి అడ్డేమున్నది.

"అలో లక్ష్మణా" అనుట యెట్టిదో వినుడు— సీతాపహారణార్థి యైన రావణుని ప్రేరణతో మాయామృగముగా వచ్చి శ్రీరామునిచే అనుగమింపబడి బాణాఘాతమున పడిపోవు మారీచుడు "కేన తు లక్ష్మణం, ......

ఇహ ప్రస్థాపయే త్సీతా శూన్యే తాం రావణో హరేత్ ।
స ప్రాప్తకాల మాజ్ఞాయ చకార చ తతః స్వరమ్ ॥
సదృశం రాఘవస్యైవ హా సీతే లక్ష్మణే తి చ !"

సీత లక్ష్మణుని, రామునియొద్దకు పంపివేయుటకును, ఆసీతను రావణుడు అపహరించుటకును ఉపాయముగా 'హా లక్ష్మణ' అని శ్రీరాము డన్నట్లే అనెను. 'అలో లక్ష్మణా, ఇదియే. ఇది రాము డన్నది కాదు. తిండిలేక ప్రజలన్నదియు కాదు.

ఇక ద్వితీయాంశము— మనకు దక్కిన స్వారాజ్యము రామరాజ్యముగా చేసికొనవలె నని కొందరు పాట పాడెదరట!

మనకు దక్కిన స్వారాజ్యమునకు మూలము గాంధీమహాత్ము డని జగద్విదితము. మన రాజ్యము రామరాజ్యము కావలె నన్న వాడే ఆయన రామభక్తు డగు ఆయన వాక్యములు చూడుడు—

'నా రామనామము, సుప్రసిద్ధచారిత్రపురుషు డైన జానకీ రాముని పవిత్రనామము.

సమస్త ఈతిబాధల పో ద్రోలు సర్వోత్కృష్ట రామనామము కేవల భగవన్నామము.

ఈభగవన్నామ మైన రామనామము నాశ్రయించియే మహా భక్తాగ్రగణ్యులు పలువురు చిత్తశాంతిని పొంది ఈశ్వర సాక్షాత్కారము గాంచిరి ...' (హరిజన్ - 2-6-1946 మహాత్మా-గాంధీ.

ఒక ప్రస్తావములో— 'గాంధిజీమాడ్కి' (పు 135) అని మహాత్ముని కీర్తించినవాడే ఈయన.

రామనామము భగవన్నామ మనుచు, రాముడు భగవంతుడని చాటిన మహాత్మునకు ఈయన మాటలు క్షంతవ్యము లగునా ?

రామరాజ్య మన్నంతమాత్రాన, మరల వసిష్ఠాదు లవతరింతురా? ఎన్దు ఈ నెననగా గాటగట్టువారు పుట్టుదురా? శంబూకాదులు చత్తురా? ఔరా! ఆగాంధీజీ భావించిన రామరాజ్య మట్టిదా? ఎంత అజ్ఞానము!

మీవంటివా రుండగా ఆ వసిష్ఠాదులు అవతరించుటేనా?

ఆగాంధిజీకి, ఈచౌదరికి, హస్తిమశకాంతర మున్నది. గాంధిజీ "రాముడు భగవంతుడు, ఈచౌదరీ సీతాన్వేషణములో వెరివెంగళప్పవోలె గంతులు వేయు "తేభ్యమునకు దైవత్వమా? (పు 36) గాంధిజీ-"సుప్రసిద్ధచారిత్రపురుషుడు జానకీరాముడు."

చౌదరి—రామలక్ష్మణులు చేసిన స్త్రీహత్యాకాండకు ఈజన్మములోనే ఫలిత మనుభవించి, భార్యల ఎడబాటుచే దగ్ధచిత్తులై తుదకు సరయూనదిలో బడి చచ్చి పోవలసిన దుర్గతి పట్టినది. అట!

వీరే ఒక చోట ఇట్లువ్రాసిరి—ఒకప్పుడు దేవతలతో యుద్ధమునకు తలపడిన రాక్షసులు భృగుమహర్షి పత్నిని శరణుపొందుట, ఆమె అభయ మిచ్చుట జరిగెను. అప్పుడు మహావిష్ణువు చక్రముచే ఆమెను వధించెను. ఆ భృగుమహర్షి అది చూచి నీవును భార్యావియోగదుఃఖము ననుభవింతువుగాక! అని విష్ణుమూర్తికి శాప మిచ్చెను. ఆ శాపఫలితమే రామావతారములో సీతావియోగ రూపముగా ఈవ్యక్తి అనుభవింపక తప్పలేదు. (పు 29)

ఈవ్రాతలో భృగువు విష్ణుమూర్తికి శాప మిచ్చెను. భార్యావియోగము కలుగునట్లు ఆశాపఫలితమే రామావతారములో సీతావియోగము అని యున్నది. (పు 131) లో—రామ లక్ష్మణులు

చేసిన స్త్రీహత్యాకాండకు యీజన్మములోనే ఫలిత మనుభవిం
భార్యల ఎడబాటు కలిగినదని యున్నది.

ఇందులో పురాణగాథ యని వ్రాసిన మొదటి విషయముచే
స్వకపోలకల్పితమైన రెండవ విషయము ప్రతిహతమై పోయినది.

మరియు, మహావిష్ణువే రామావతార మనియు, ఆ విష్ణుపత్ని
యే సీతాదేవి యనియు, ఆభృగుశాపముచేతనే సీతావియో
మనియు స్పష్టమైనది.

దీనినిబట్టి రామలక్ష్మణులు చేసిన స్త్రీహత్యాకాండవల
వారికి భార్యావియోగము సంభవించె నన్న మాట త్రోసివేం
బడినది.

మహావిష్ణువు భృగుశాపమునకు గురి యగుట, విష్ణు సన్ని
ధానవర్తు లగు జయవిజయులు సనందనాదిశాపమున కె అసు
జన్మము లెత్తి తరువాత వైకుంఠమునకు రావలసియున్నందు
ద్వితీయ మైన యీరావణకుంభకర్ణ జన్మమునుండి వారి నుద్ధరించు
కొరకే అనే తెలుపుచున్నాము.

లంకలోని స్త్రీలు, బర్తలకు బిడ్డలకు దూరమై పోవుట, సీత
మూలకము కాదు. శూర్పణఖామూలకమని ఆస్త్రీలే గోల పెట్టిరి—

"కథం శూర్పణఖా వృద్ధా కరాళా నిర్ణతోదరీ।
ఆససాద వనే రామమ్... జనస్యాఽస్యాఽల్పభాగ్యత్వాత్।
తన్నిమిత్త మిదం వైరం రావణేన కృతం మహత్॥"

ఎవడో గారడి చేసి పిల్లవారు చచ్చె ననెనా? శ్రీరాముడ
గుడ్డి ఎద్దువలె పోయి శంబూకుని చంపెనా? ఇది రామాయణరహ
స్యమా? ఔరా!

ఈవ్రాత, కన్నున్నవాని దని మతిమంతులు భావింతురా? ఇట్ల
వీరి వ్రాత నిరస్తము.

"తన మూలముగా లంకలో ఎందరో ఆడువాండ్రను బిడ్డ
లకు, భర్తలకు దూరము చేయించిన పాతకము కట్టికుడుపుటచే

సీతమ్మ సైతము అడవులకు నెట్టబడి దిక్కుమొక్కు లేనిచోట బిడ్డ
లను కని తుదకు ఆత్మహత్యయే చేసికొనవలసివచ్చినది" (పు 31)

"ఎవడో ఏదో గారడి చేసి - పిల్లవాడు చచ్చెనని ఘోష
పెట్ట శ్రీరాముడు గుడ్డియెద్దువోలె పోయి శంబుకుని చంపెను.'
(పు 144)

"ప్రేమభిక్షకై తన్ను కోరిన స్త్రీకి ముక్కు, చెవులు లక్ష్మణుడు
కోసెను. ఇదికూడ దుష్టశిక్షణ మని పళ్ళిగిలించు పరమభాగవత
శిరోమణులు రామభక్తులు". (పు 128)

పై గాంధిజీ హస్తిబృంహితమును, ఈ మశకనినాదమును
చూచి పాఠకమహాశయులు ఏది హేయమో, ఏది ఉపాదేయమో
ఆలోచింతురుగాక.

"అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ"
అన్నట్టు ఈకలిభటులకు వాల్మీకిమహర్షి కవిత్వము నివేదించుట,
'అంధేన్దూదయ' తుల్యము కాదా?

## రామాయణము — వ్యాఖ్యాతలు

రహస్యాలకర్త వ్రాత—

1. రాముడు శోకాదులు కలవాడు కాడట. అట్లు నటించి
నాడట. యీ అవతారము రాక్షససంహారార్థమే కాక మానవులకు
బోధించుటకు గూడ నట ఆత్మస్వరూపమందే రమించు యీశ్వరునకు
సీత వలన వ్యసనములు కలుగవట!

2. పరమాత్మస్వరూపమే రామావతార మన్ననాడు, ఆపాత్ర
లనుకూడ అట్లే అన్వయించిననాడు మానవుల కాపాత్రలు ఆదర్శము
లెట్లగును?

3. బుద్ధునివోలె, గాంధిజీమాదిరి మానవులలో మానవుడై
ఆదర్శముగ ప్రవర్తించిన నాడే ఆతని చరిత్ర మేలుబంతిగా చూచు
కొనవచ్చును. మానవాతీతుల కార్యక్రమములు మానవులకు దుస్సాధ
ములు". (పు 136) అట!

బుద్ధుడు మానవాదర్శముగా ప్రవర్తించెనా?

"హలభిన్న వికీర్ణ శష్పదర్భామ్ హత సూక్ష్మ క్రిమికీటజన్తు కీర్ణామ్ । సమవేక్ష్య రసాం తథావిధాం తామ్ స్వజనస్యేవ వధే భృశం శుశోచ ॥ (అశ్వఘోషుని బుద్ధచరిత్ర)

నాగలితో దున్నబడి పెకలింపబడిన తృణదర్భాదులు, నశింప జేయబడిన కృమికీటాదిసూక్ష్మజీవులు కలిగియున్న భూమిని చూచి బుద్ధుడు స్వజనవధకు శోకించినంతగా శోకించెను.

దున్నకుండ భూమినుండి భోజ్యపదార్థోత్పత్తి కాదాయె. దున్నిన జీవహింసాపాతక మాయె.

ఇది మానవాదర్శమేనా? ఇది మానవులకి దుస్సాధ్యమైన కార్యమా, కాదా?

ఇక గాంధిజీ, ఈయన రక్తపు చుక్క పడకుండ స్వారాజ్యము సాధించిన వాడని లోకముచే కీర్తింపబడుచుండెను. ఇది మానవా తీత కార్యమా? కాదా? ఇది మానవులకు సుసాధ్యమా దుస్సాధ్యమా?

దుస్సాధ్యకార్యము లటుండనిండు. గాంధీజీ అవలంబించి నదియు, మానవసామాన్యమునకు సుసాధ మైనదియు, ఆయనచే ప్రజల కుపదేశింపబడినదియును, భగవంతు డగు జానకీరాముని యందు భక్తి, సులభ మైన యీమానవాదర్శమును కలిభటు లవ లంబించిరా? ఇది చూడగా—

ఆదర్శ పురుషులు, మానవాదర్శముగా చేసినట్టి కార్యములను మానవాతీతము లనుటో, గాంధీజీ రామభక్తిని యీయన దూషించి నట్లు దూషించుటో కలిభటుల లక్షణమని స్పష్టమైనది. ఇట్లు తృతీ యాంశము నిరస్తమైనది.

2. "రామావతారము పరమాత్మ స్వరూప మన్ననాడు మాన వు కాదర్శమెట్లగును?" అట! అది మానవావతారము కనుకనే అగును. మానవు లైన బుద్ధుడు, గాంధీజీ వీరి చర్యలు మానవాదర్శము లైనవా?

రావణుడు సంపాదించుకొన్న వరములనుబట్టి పరమాత్మకాని, దేవతలుకాని స్వస్వరూపములతో అతని నేమియు చేయలేరు.

కేవలమానవులు కేవల వానరుల కూడ ఏమియు చేయలేరు. కనుక పరమాత్మ మానవుడుగా, దేవతలు వానరులుగా అవతరించి, రావణున కిచ్చిన వరమునకు విరోధము లేకుండ కార్యము సాధించినారు. ఆకారణముచేతనే శ్రీరాముడు నరాకారపరమాత్మ అని చెప్పబడుట. ఇక్కడ రావణసంహారమైన కార్యము స్పష్టమే. కారణమైన రాముడు అవతారపురుషుడా, కాడా? అని సందేహమా?

కార్య మెంతటిదో అంతకు మించిన శక్తి కలది కారణ మగుట ప్రసిద్ధము. కనుక రాము డవతారపురుషు డనవలసినదే. రావణు ఘన తను గానము చేయునట్టి రావణభక్తులు, రాముని మానవమాత్రు డందురేని రావణునకు నైచ్యము నాపాదించువా రగుదురు. కనుక రాము డవతారపురుషు డనవలసినదే.

అట్టి అవతారపురుషుడు అవతరించునపుడు తాను సాధింపవలసిన కార్యమునకు కావలసిన సాధనసామగ్రితో అవతరించును కనుక అట్లు అవతరించినదే సీతాదేవి.

ఈమె పని యేమందురా? అనితరసామాన్యతపోబలము కలిగి యున్నవాడు రావణుడు. అది క్షీణించినగాని ఆతడు జయింపబడడు. ఆతడు పరస్త్రీలోలుడు. ఆతనికి ప్రాప్తించియున్న శాపములనుబట్టి ఆత్మనాశనభయమువలన బలాత్కరింపడు.

సమ్మతింపజేసికొనుటకే ప్రయత్నించుచు ఎంత స్త్రీ వాంఛ పెట్టుకొనునో, అంత తపోబలక్షయ మాతని కగుటయే పని. ఈపనియే సీతాపహరణమూలమున రావణునకు సంభవించినది. ఆలక్ష్మీదేవియే ఈ సీత. ఆభగవంతుడే ఈ రాముడు. వారిద్దరును సంకల్పించుకొనియే ఈ కార్యసాధనమునకై అవతరించిరి. శ్రీరాముని ప్రవృత్తిలో భవి ష్యత్పరిజ్ఞానము స్పష్టమగుచున్నది. చూడుడు —

విశ్వామిత్రయాగరక్షణసందర్భమున ప్రాప్తించిన సుబాహు

మారీచులలో సుబాహువును మాత్రమే వధించి మారీచుని వధింపక బాణప్రయోగము చేత పారద్రోలెను.

మరల, ఋష్యాశ్రమసంరక్షణసమయమందును సంహరింపక బాణప్రయోగమున పారద్రోలెను.

దీనినిబట్టి ముందు ముందు ఈతని పని ఉన్న దనియే మిగిల్చె నని వివేకు లనుకొనకుందురా? ఇక మూడవ సారి ఆమారీచుడే కనక మృగముగా వచ్చెను.

సీతాపహారణోద్యుక్తుడై రావణుడు పొంచియుండెను. ఈరావణుడు వెనుక వేదవతిని బలాత్కరింపబోవ నేనే నీమరణమునకు కారణ మగుదు నని శపించి దేహమును అగ్ని కాహుతి చేసిన ఆవేదవతి ఈ సీతారూపమును ధరించి యున్నది.

అట్టి సీత ఆకనకమృగమును చూచి దానిని పట్టి తెమ్మని ఇది వరకు రెండుసార్లు ఈతని పని యున్నదని మిగిల్చి యుంచిన శ్రీరాముని కోరినది.

అప్పుడు శ్రీరాముడు — 'ఏ తేన హి నృశంసేన మారీచేన ... హింసితా మునిపుంగవాః ... ... తస్మా ద్వధ్య స్త్వయం మృగః' ఈతడు ఘాతుకస్వభావము కల మారీచుడు కనుక వధింపవలసినవాడు అని లక్ష్మణునితో చెప్పి ఆ మృగమువెంట వెళ్ళెను.

తరువాత రామబాణమునకు గురియై మరణించు సమయమున సీతాసంరక్షకుడై యున్న లక్ష్మణుని తన దగ్గరనుండి సీత పంపివేయుటకును, ఆ అవకాశము చూచుకొని రావణుడు సీతను అపహరించుటకును ఉపాయముగా 'హా సీతే లక్ష్మణేతి చ' అనుచు ఆమారీచుడు శ్రీరాముని కంఠధ్వనిగా ఆర్తనాదము చేసి మరణించెను. అది విని రామునకు ఆపద వచ్చినట్లు తొందరపడి, లక్ష్మణుని వెళ్లువెళ్లు మని వేధించెను. లక్ష్మణుడు — నీవు ఆందోళన పడవద్దు. రామునకు ప్రమాదమా? ఇది మారీచుని మాయానాటకము. అని ఎన్నివిధముల చెప్పినను ఆమె శాంతింపలేదు. ఇంతకు పూర్వ మక్కడ ఉద్దండులైన - ఖరదూషణాది

రాక్షసవీరులను, 14 వేల మందిని అసహాయుడై అవలీలగా సంహరించిన శ్రీరాముని అప్రతిహతపరాక్రమము నెరిగియుండియు వెఱ్ఱిమని వేధించెను.

లక్ష్మణుడు ఆమె రక్షణకొరకు నిశ్చలచిత్తుడై యుండ ఆతడు వినలేని మాటలాడి, అక్కడనుండి పంపివేసెను. ఆవెంటనే రావణు డప హరించెను.

ఇక రహస్యాలకర్త నడుగుచున్నాము —

వనవాసముతో సంబంధ మేమియు లేనట్టి సీత పట్టుబట్టి రాముని తో ఎందుకు వచ్చెనో తెలిసెనా? మాయలేడిని చూచి అది కావలె నని ఎందు కడిగెనో తెలిసెనా?

దానికొరకు – ఈమాయామృగము మునిపుంగవులను హింసించిన మారీచుడే వధింపవలె నని చెప్పి రాము డెందుకు వెళ్లెనో తెలిసెనా? అంతకు పూర్వము ఈమారీచుడే రెండు పర్యాయములు తటస్థించినను పారద్రోలుచు వధింపక మిగిల్చినది ఎందుకో తెలిసెనా?

ఆ సీత, ఆ అరణ్యములో తనకు రక్షకుడైయున్న లక్ష్మణుని వినరాని మాటలాడి తనదగ్గర లేకుండ ఎందుకు పంపివేసెనో తెలిసెనా? మీ కేమియు తెలియదు. మీకు తెలిసినచో —

"భార్య మాట విని బంగారులేడి ఉండు నని భ్రాంతిపడి పరుగులిడిన వ్యక్తి అవతారపురుషుడై దేశములో గుడులు గోపురములు కట్టించుకొనుట విచిత్రము." (పు 6)

అని వ్రాయుటకు తెగించగలరా? మీ వ్రాతకు వేమన పద్దె మాధారమందురా? అయితే —

"రామనామమహిమచే మహి వాల్మీకి
పాపి బోయ డయ్యె బాప డయ్యె"
"శ్రీరామ యనెడు మంత్రము తారక మని యెరిగి
మదిని ధ్యాన పరుండై సారము గ్రోలిన నరునకు
చేరువగును పరమపదవి చేకురు వేమ"

"ఉదధి లంఘించి దాటిన యుత్తముండు
మదిని రామాజ్ఞ మీరక మాయ లడచి
హృదయమందున రాముని బదిలపరచె
నౌర మారుతి తత్త్వజ్ఞు డగుట వేమ ॥"

ఈ వేమనపద్దెములే తెలియని మీకు రామాయణరహస్యాలు తెలిసిన వేమి?

ఈ సీతారాముల చర్య మీకు తెలియని మాట నిజము. మీ రావణునకు తెలిసినది—

"శప్తో ఽహం వేదవత్యా చ యదా సా ధర్షితా పురా ।
సేయం సీతా మహాభాగా జాతా జనకనందినీ ॥"

పూర్వము బలాత్కరింపబోవు నన్ను శపించియున్న ఆ వేదవతియే జనకనందిని ఈ సీతయై జన్మించెను. అన్నాడు రావణుడు.

ఆ వేదవతీ శాప మిది —

"యస్మాత్తు ధర్షితా చాహం త్వయా పాపాత్మనా వనే ।
తస్మాత్తవ వధార్థం సముత్పత్స్యే హ్యహం పునః
తస్మాత్త్వయోనిజా సాధ్వీ భవేయం ధర్మిణ స్సుతా ॥"

పాపాత్ముడ వైన నీవు నన్ను ధర్షింపదలచితివి కనుక నీ వధార్థము నేను అయోనిజనై పుట్టి ఒక ధర్మాత్మునకు పుత్రికనై యుందును అని.

రాముని విషయము కూడ అనుకొన్నాడు —
శ్రీరామునితో యుద్ధము చేసి విరథుడై లంకలో ప్రవేశించి పరివారముతో కలిసి ఇట్లు చింతించినాడు —

సర్వం తత్ఖలు మే మోఘం యత్తప్తం పరమం తపః ॥
య త్సమానో మహేంద్రేణ మానుషే ణాస్మి నిర్జితః ॥
ఇదం తద్బ్రహ్మణో వాక్యం ఘోరం మా మభ్యుపస్థితం ।
మానుషేభ్యో విజానీహి భయం త్వ మితి త త్తథా ॥
దేవదానవగంధర్వై ర్యక్షరాక్షసపన్నగైః ।

అవధ్యత్వం మయా ప్రాప్తం మానుషేభ్యో న యాచతి ॥

నా మహాతపస్సు వ్యర్థమైపోయినది. మనుష్యునకు నే నోడిపోతిని. మనుష్యమూలకముగా నీకు ప్రాణభయమని బ్రహ్మ చెప్పినట్లే సిద్ధమైనది.

దేవదానవాదులవలన ప్రాణభయము లేకుండుట కోరి మానవుల వలన లేకుండుటను కోరనైతిని. అనుచు విలపించెను. దీనిలో తన తపోబలము క్షీణించిపోయె నని చింతించెను. ఇది యుద్ధసమయ మందలి ముచ్చట. దీనికి పూర్వము సీతాపహరణము, అశోకవననిర్బంధము, సీతానురాగౌత్కట్యము. ఈ వికారచేష్టలు సంభవించినవి.

తన తపోబలము క్షీణించుట కిదియే కారణ మని స్పష్టమేకదా! ఈవిషయము కేదారఖండోక్తమై యున్న దని వ్యాఖ్యాతయే వెల్లడించెను —

"... తేషాం కార్య మత్యన్తానుచితసీతానురాగ మోహానువృత్తి సంపాదనేన రావణస్య తపోవీర్యభ్రంశం సంపాద్య కర్తవ్య మితి లక్ష్మ్యా సహ విచార్య తదర్థం విష్ణుః సీతయా బ్రహ్మవిద్యయా సహాఽవతీర్ణ ఇతి"

ఇక్కడ రహస్యాల కర్త —

"అశక్తులై దేవతల ప్రార్థన మాలకించి విష్ణువు-లక్ష్మియు-నీవు సీతగా బుట్టుము. నేను రాముడనుగా అవతరింతును. అని కూడ బలుకుకొనిరట! ఈ పన్నుగడలో సీతయందు రావణునకు అనుచితమైన అనురాగము పుట్టించి తన్మూలమున వాని తపోబలము దూలించి సీతాపహరణము ద్వారా ఆతనిని రూపుమాపి దేవతా కార్యము తీర్చెనట" (పు 149)

(ఆ విషయమును తిరస్కరించినారు. దీనిపై ముందు చెప్ప బడును అనుచు.)

"సీతయందు రావణునకు అనురాగము పుట్టించి" ఎవ రా పుట్టించినది? రాముని ప్రేమించి లక్ష్మణుని ప్రేమించి మరల రామునితో—

"వృద్ధాం భార్యా మవష్టభ్య న మాం త్వం బహుమన్యసే।
అద్యేమాం భక్షయిష్యామి పశ్యత స్తవ మానుషీమ్ ।
ఇత్యుక్త్వా... ...అభ్యగచ్ఛ త్సుసంక్రుద్ధా॥

వృద్ధభార్యనా పెట్టుకొన్న నీవు నన్నాదరింపకున్నావు. ఇప్పుడీమెను నీయెదుటనే భక్షింతును అనుచు క్రోధావేశముతో సీతపై బడునపుడు 'నార్యాః కర్ణాదికర్తనమ్' అన్నట్లు శిక్షింపబడి రావణుని యొద్దకు బోయి —

"సీతా నామ వరారోహా ...తవానురూపా భార్యా సా।
...భార్యార్థేతు తవానేతు ముద్యతాహమ్ ...
నిరూపితాస్మి... యది తస్యా మభిప్రాయః ...
శీఘ్ర ముద్ధ్రియతాం పాదః"

అనుచు, నీకు తగిన భార్య సీత. ఆమెను నీకు భార్యగా పట్టి తెచ్చుట కుద్యమించిన నాకు ఈ యవస్థ సిద్ధమైనది. ఆమెయందు నీకభిప్రాయ మున్నచో డిగ్గన లేచి వెళ్ళుము. అని ప్రోత్సహించినది శూర్పణఖ.

శూర్పణఖా వాక్యములో — 'యది తస్యా మభిప్రాయః' అనుటచే సీతయం దనురాగము స్వతః పుట్టినవాడని స్పష్టము.

ఇక్కడ రహస్యాలకర్త —

'శూర్పణఖకు జరిగిన పరాభవము తీర్చుకొనుటకే ఆమె అన్నయైన రావణుడు సీతను బట్టుకొనుట. సీతాసౌందర్యముచూచి ముగ్ధుడై వచ్చినవాడు కాడు' (పు 109) అనెను.

రావణస్వభావము తెలిసినట్టిది శూర్పణఖా? ఈయనా? తన పరాభవమునకు కారణ మొకటియై యుండ, నీకు తగిన భార్య అని ఆమెను నీయొద్దకు తీసికొనివచ్చుట కుద్యమింపగా కలిగినది ఇట్టి పరాభవము. అని చెప్పినదొకటి.

పరస్త్రీవాంఛ లేనివాడైతే సీతాప్రసక్తి ఎందుకు తెచ్చెను.? తాను సీతను భక్షింప నుద్యమింపగా ప్రాప్తించినది ఆపరాభవము. దాని నామె దాచిపెట్టినది ఆమెవలెనే ఈరహస్యాలకర్తకూడ దాచి పెట్టి రామలక్ష్మణులను నిందించెను.

రావణునకు వేదవతియందు వాంఛ ఎవరు పుట్టించినారో!

ఏలక్షణమైనను వారివారి చిత్తసంస్కారములనుబట్టి పుట్టుచుం డును. రామాయణము, విద్వద్వ్యాఖ్యానములు, త్యాగరాజ-రామదా సాది రామభక్తశిఖామణులు, గాంధీజీ ప్రభృతి రాజకీయధురంధరులు, శ్రీరామకృష్ణపరమహంసాది శ్రీరామసాక్షాత్కారభాగ్యశాలులు ఇంద రుద్ఘోషించుచున్నను ఈరహస్యాలకర్తకు సీతారాములయందు మంచి అభిప్రాయము పుట్టింపగలిగెనా? కనుకనే —

"ప్రాంచం గుణం ముంచతి కిం పలాండుః"

మొత్తము మీద వేదవతీశాప మనుభవింపవలసియున్నందున సీతాపహరణసంకల్పము దృఢముగా రావణునకు కలిగినది. ఆశాపము ఫలించుటకే సీతాదేవి కనకమృగమును కోరి శ్రీరాముని పంపి ఆతరు వాత లక్ష్మణునికూడ తనయొద్ద లేకుండ పంపివేసి, రావణున కవకా శము కలిగించి తనయం దాతడు పెట్టుకొన్న అత్యంతానుచిత నురాగ వ్యామోహముతో ఆతని తపోబలము క్షీణింపజేసినది.

"సర్వం తత్ఖలు మే మోఘం యత్తప్తం పరమం తపః"

అనుచు రావణుడు అందుచేతనే చింతించినా డని సారాంశము. రహ స్యాల కర్త వ్రాత —

## లక్ష్మణుడు – అయోముఖి

1. 'సీత పోయెనే అని ఏడ్పులతో దిరుగుచున్న అన్నను సముదా యించు తమ్మునకు దారిలో అయోముఖి ఎదురై ప్రేమభిక్షను గోరెను. రావయ్యా ఇద్దరము రమింతము' అని.

'ఏవ ముక్త స్తు కుపితః ఖడ్గ ముద్ధృత్య లక్ష్మణః ।

2. కర్ణనాసౌ స్తనౌ చాస్యా విచకర్తారిసూదనః ॥

3. ఈ యార్షమతములో ఆడువాండ్రను చంపుటలో దోషము లేదనుట్టి ఈకథలు బోధించుచున్నవి.'' అట! (పు 129)

1. సీతాన్వేషణములో పర్యటించు రామలక్ష్మణులు క్రౌంచారణ్య మతిక్రమించి వెళ్ళుచున్నారు.

'ఏడ్పులతో దిరుగుచున్న అన్న' అట! అది మానవపాత్రధారణకు యథోచితవిన్యాసము.

'యథా నటో రంగగతో నానారూపో భవ త్యసౌ ।
ఏకరూపస్స్వభావోపి లోకరంజనహేతవే ॥'

అన్నట్టి సర్వజ్ఞు డయ్యు తత్తదవస్థానుగుణముగా నటించుట పాత్రధారణ చేసినవారిలో కనబడునపుడు; ఆనటన చూచే ఆతడే యేడ్చుచున్నా డనుకొనుట ఎంత తెలివియో అంత తెలివియే శ్రీరాముని పట్ల ఈయన కున్నట్టి ఈవ్రాత తెలుపుచున్నది.

2. లక్ష్మణునకు ఎదురైన అయోముఖి—

'దదృశాతే మహారూపాం రాక్షసీం వికృతాననామ్ ।
భయదా మల్పసత్త్వానాం బీభత్సాం రౌద్రదర్శనమ్ ॥
లంబోదరీం తీక్ష్ణదంష్ట్రాం కరాళాం పరుషత్వచమ్ ।
భక్షయన్తీం మృగాన్ భీమాన్ వికటాం ముక్తమూర్ధజామ్ ॥

ఆసుందరి యిట్లున్నది. ఈమె శ్రీరామునకు ముందు నడచుచున్న లక్ష్మణుని 'ఏహి రంస్యావహే' అనుచు 'సమాలంబత లక్ష్మణమ్' చేయి పట్టుకొన్నది.

'సౌమిత్రి ముపగూహ్యా చ' ఆపై కౌగలించుకొన్నది.

ఇట్టి అయోముఖికి ప్రేమభిక్ష పెట్టక లక్ష్మణుడు అంగవైకల్యము కలిగించెనని ఈతడు తిట్టిపోసినాడు— "ముక్కు చెవుల కోతలో ఎంత దుర్మార్గము? స్తనములను గోసెనట: ఈతడు మనుష్యుడా? పశువా? ఇంతకన్న రాక్షసకృత్య మే ముండును?" అనుచు నోటికి వచ్చినట్టు కూసెను. వినుడు—

సీతాపహరణానంతరము రావణుడు తన పరివారమునకు ఇట్లాదేశించెను—

"జనస్థానే వసద్భి స్తు భవద్భి రామ మాశ్రితా ।
ప్రవృత్తి రుపనేతవ్యా కిం కరోతీతి తత్త్వతః ॥

అప్రమాదా చ్చ గన్తవ్యం సర్వై రపి నిశాచరైః।
కర్తవ్య శ్చ సదా యత్నో రాఘవస్య వధం ప్రతి॥"

మీరు జనస్థానమందు నివసించుచు రాము డేమిచేయుచున్నది యు కనిపెట్టుచు నాకు తెలుపుచుండవలెను. అని.

ఇట్టి రావణాదేశముపై వచ్చియున్న నిశాచరగణములోని అయోముఖికి, ఈరహస్యాల కర్త యైతే ప్రేమభిక్ష పెట్టునోయేమో!

"సామాన్యమానవు డైన ప్రవరాఖ్యుడు తనంత దావలచి వచ్చిన గంధర్వకాంతను మాటలతో మరల్చి తన దారిని తాను పోయెను.

ఈయవతారపురుషులు ప్రేమ కోరిన ఆడుహాండ్రను శిక్షవే యుటలో వాండ్ర యుసురు లీండ్రవెంట బడి చేయవలసినంత చేసి నది" (పు 128) అట.

ఆప్రవరాఖ్యుడు సామాన్యమానవుడు కనుకను, ఆకాంతమాట లతో మరలునట్టిది కనుకను అట్లు జరిగినది. వీరు అవతారపుషులు కనుకను, ఆ తాటక, ఆ శూర్పణఖ, ఆఅయోముఖ, "భక్షయిష్యామి మానుషీమ్" అన్నట్టు మనుష్యభక్షణము చేయు రాక్షసజాతికి చెంది నవారుకనుకను ఆవ్యక్తుల ఉద్దండతనుబట్టి ఒక వ్యక్తిని సంహరించి మిగిలినవారిని—

"నార్యాః కర్ణాదికర్తనమ్" అని శిక్షించినారు. వాండ్ర యుసురు తగిలె ననుట అవివేకము.

"నృశంస మనృశంసం వా ప్రజారక్షణాత్।
... ... ...కర్తవ్యం రక్షతా సదా॥

రాజ్యభారనియుక్తానా మేష ధర్మ స్సనాతనః।" లోకరక్ష ణకై అట్టి పనులు చేయుటే సనాతనధర్మమని చెప్పబడినది.

## స్త్రీవధవిషయము–రామప్రభు ప్రతివచనము

అశ్వరక్షణార్థమై వెళ్ళుచున్న శత్రుఘ్నునికి–"బాలం స్త్రియం ప్రమత్తం త్వం మా హన్యాః"

అనుచు రామప్రభువు బోధించునపుడు లక్ష్మీనిధి ఏమనెనో, ఈత డెవరో, రామప్రభు వేమి చెప్పెనో కొంచెము వినుడు—

"తదా లక్ష్మీనిధి ర్భ్రాతా జానక్యా జనకాత్మజః ।
ప్రహస్య కించి న్నయనే వర్తయన్ రామ మబ్రవీత్ ॥
త్వయాపి సుమహ త్కర్మ కృతం లోకే విగర్హితమ్ ।
అవధ్యాం మహిలాం యస్త్వాం హతవా న్నియతం తతః ॥
అగ్రజో౽స్య మహారాజ కృతవాన్ పరాక్రమమ్।
స న కేవ కృతః పూర్వం రాక్షస్యాః కర్ణకర్తనమ్ ॥
ఏవం కరిష్యతి నృప శత్రుఘ్న శ్శిక్షయా నృప ।
యది నాయం తథా కుర్యా త్కులస్యా౽సదృశం భవేత్ ॥"

జానకీసోదరుడగు 'లక్ష్మీనిధి' రాముడు బోధించుట విని నవ్వుచు పళ్ళు చిట్లించుకొనుచు, రామునితో ఇట్లనెను—

నీవు అవధ్యయైన తాటక యను స్త్రీని వధించి లోకగర్హితమైన ఘనకార్యము చేసినవాడవు.

ఈశత్రుఘ్నునకు అగ్రజుడు రాక్షసీకర్ణకర్తనపరాక్రమము చేసినవాడు ఇప్పుడు నీశిక్షచేత శత్రుఘ్నుడు నీవలెనే చేయును చేయకుండుట వంశమర్యాదయా? అని.

"ఇత్యుక్తవన్తం తం రామః ప్రత్యువాచ హసన్నివ।
యాయన్తు యోగిన శ్శాన్తా స్సమదుఃఖసుఖాః పునః ।
జాన న్త్యపారసంసారనిస్తారతరణాదికమ్ ।
యే శూరా స్సుమహేష్వాసా స్సర్వశస్త్రాస్త్రకోవిదాః॥
తే జానంతి నియుద్ధస్య వార్తాం నతు భవాదృశాః ।
పరోపతాపినో యే వై యే చోత్పథవిచారిణః ॥

తే హన్తవ్యా స్మృషైస్సర్వై స్సర్వలోకహితైషిభిః"

(పాద్మ-పాతాలఖండ-అ 11)

ఆజనకాత్మజుని మాటలు విని రామప్రభువు నవ్వుచు ఇట్లనెను —

మీరు నివృత్తిమార్గ మాశ్రయించియున్న యోగులు, శాన్తులు, సుఖదుఃఖములు మీకు సమానములు. అపారమైన సంసారమునుండి తరించుమార్గము తెలసినవారు మీరు.

ఇక, ఎవరు శూరులో, ఎవరు ధనుర్ధరులో, ఎవరు సర్వశస్త్రాస్త్రకోవిదులో వారే యుద్ధవిషయములు తెలిసినవారు. మీవంటివారు కాదు. సర్వలోకహితమును కోరుచుండువారు — ఎవరు పరులను పీడించువారో, ఎవరు హద్దుమీరి సంచరించువారో, వారిని వధింపవలసినదే. అని. ఈప్రసంగములో — నీవు చేసినది లోకగర్హితమని ఆత్మనిధి నవ్వుచు రామప్రభువు నన్నది ఈరహస్యాల కర్తవంటి ప్రబుద్ధుల మాటల అనువాదమే అని తెలిసికొని— "పరోపతాపినో యే వై యే చోత్పథవిచారిణః। తే హన్తవ్యా స్మృషైస్సర్వై స్సర్వలోకహితైషిభిః ॥ అన్నట్టు రామప్రభువును గమనింతురుగాక!

## శ్రీరాముడు-విరాధుడు

రహస్యాలకర్త వ్రాత—

"విరాధుడు సీతారామలక్ష్మణుల మీదికిదూకి సీత నెత్తుకొని పై కెగిరి వారితో ఇట్లన్నాడు —

మునివేషము వేసికొని విల్లునమ్ములు దాల్చి అధర్మము నాచరించుచున్న పాపులు మీరు. మిమ్ము చంపెదను. ఈమాటలకు శ్రీరాముడు బెదరిపోయి నోరెండి, కన్నీరు మున్నీరుగా తమ్ముని మోల పెట్టెనట!" (పు 99)

ఈ వ్రాతనటుంచి ఆ విరాధుని కొసమాటలు వినుడు—

"హతోఽస్మి పురుషవ్యాఘ్ర శక్రతుల్యబలేన వై.
మయా తు పూర్వం త్వం మోహాన్న జ్ఞాతః పురుషర్షభః ॥
కౌశల్యాసుప్రజా రామ తాత త్వం విదితో మయా ।
వైదేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః ॥
అపి శాపా దహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్ ।
తుంబురు ర్నామ గంధర్వ శ్శప్తో వైశ్రవణేన హ ॥
యదా దాశరథీ రామ స్త్వాం వధిష్యతి సంయుగే ।
తదా ప్రకృతి మాపన్నో భవాన్ స్వర్గం గమిష్యతి ॥
తవ ప్రసాదా న్ముక్తోఽహ మభిశాపా త్సుదారుణాత్ ।
భువనం స్వం గమిష్యామి స్వస్తి వోఽస్తు పరంతప ॥"

మహాపురుషా! హతోఽస్మి, నిన్ను మొదట మూఢత్వముచేత తెలిసికొనలేకపోతిని. ఇప్పుడు తెలిసికొంటిని. నిన్నుకన్న కౌశల్య ధన్యురాలు. ఈ సీతాదేవి జగత్పూజ్యురాలు. ఈలక్ష్మణుడు మహాయశశ్శాలి నింద్యమైన శాపముచేత ఘోరమైన రాక్షసజన్మ నాకు ప్రాప్తించినది నేను తుంబురుడనే గంధర్వుడను. కుబేరశాపదగ్ధుడనై ఆయనను ప్రసాదింపగోరితిని. ఆయన ఇట్లు అనుగ్రహించెను. దశరథ రాముడు నిన్ను వధించినపుడు నీవు స్వస్వరూపము ధరించి స్వర్గలోకమున ప్రవేశింపగలవు. అని. శ్రీరామా! నీయనుగ్రహముచేత శాపవిముక్తుడనై స్వస్థానమునకు వెళ్ళుచున్నాను. మీకు శుభమగుగాక. అని విరాధు డంతర్ధాన మయ్యెను.

ఇప్పుడు చూడుడు— పై రహస్యాలకర్త వ్రాత-విరాధుడు చెప్పినట్టి రాక్షసప్రకృతికి చెందినవ్రాత-'సీతారామలక్ష్మణులు పాపులట! ఎవరికి? రాక్షసప్రకృతికి 'విరాధుడు ఎంతో సేపు వారిని బాధపెట్టి హోరాహోరిగ యుద్ధము చేసి మరణించెను' కనుక మరణింప నున్న వానికే అట్టి ప్రకృతి.

'ముందున్నది ముసుళ్ళపండుగ యని ఈయవతారమునకు తెలియదు కాబోలు' అట!

ఆ అవతారపురుషుని ధిక్కరించి దూషించి చంపెద నన్నట్టి విరాధబడిన రాక్షసప్రకృతికి 'ముందున్న ముసుళ్లపండుగ' తెలియదు కాని, అతని నిర్వీర్యుని చేసి ఔద్ధత్యము నిర్మూలించి ఆరాక్షసత్వము వదల్చుటకు అక్కడకు వచ్చిన ఆ అవతారమూర్తికి తెలియదా!

'నేను మూఢుడనై నీస్వరూపము తెలిసికొనలేక పోతిని'అని చెప్పుకొన్న విరాధుని మాటనుబట్టి ఆ స్వరూపమును మూఢులు తెలిసికొనలేరని స్పష్టమైనది.

ఆ విరాధుడే ఆమూఢత్వము, ఆరాక్షసత్వము వదలిన తరువాత "విజ్ఞాతః పురుసర్షభః"నీవు పురుషోత్తముడవు''అనెను. "లక్ష్మణశ్చ మహాయశాః" అనెను.

ఈ రహస్యాలకర్త- 'రామలక్ష్మణులు చేసిన హత్యాకాండకు ఫల మనుభవించిరి.''అనెను.

ఆవిరాధుడు- "వైదేహీ చ మహాభాగా!" అనెను. ఈరహస్యాలకర్త--

"తన మూలముగా లంకలో ఆడువాండ్రకును బిడ్డలకు భర్తలకు దూరము చేయించిన పాతకము సీతమ్మను కట్టి కుడిపినది" అనెను. కనుక ఆవిరాధునకు ఈయనకు గల భేదమును పాఠకమహాశయులు గమనింతురుగాక.

పితృవాక్యపరిపాలనములో, రాక్షససంహారప్రసక్తికి విరాధశాపవిమోచనము-ఒకప్రయోజనమని చెప్పుచున్నాము.

అరణ్యసంచారములో రామలక్ష్మణులకు కబంధు డను రాక్షసుడు గోచరించి నాకు మీరు ఆహారముగా లభించినారనుచు నోరు

తెరచి వారిని భక్షింపవచ్చినపుడు ఆయిద్దరును ఖడ్గహస్తులై చెరి యొక బాహువును ఛేదించిన అప్పుడాతడు దీనుడై మీరెవరని ప్రశ్నింపగా లక్ష్మణుడు—ఈతడు ఇక్ష్వాకువంశమునకు చెందిన శ్రీరాముడు. ఈయన సోదరుడను నేను. ఈయన పత్ని రాక్షసునిచేత అపహరింపబడినది. ఆమెను అన్వేషించుచు ఇటు వచ్చినాము అనిచెప్పి—

'త్వం తు కో వా' అనుచు అతని వృత్తాంత మడుగగా ఆ కబంధుడు ఇట్లు ప్రసంగించెను—

"స్వాగతం వాం నరవ్యాఘ్రౌ దిష్ట్యా పశ్యామి చాప్యహమ్।
దిష్ట్యా చేమౌ నికృత్తౌ మే యువాభ్యాం బాహుబన్ధనౌ ॥

మీరు దర్శన మిచ్చి బాహువులు ఛేదించినారు. సంతోషము. నేను దానవుడనై యుండి ఒకమహర్షికి ఆగ్రహము కలిగింప అతడు నన్ను శపించెను. శాపాంతము చెప్పవలసిన దని ప్రార్థింపగా ఆయన ఇట్లు చెప్పెను.—

యదా ఛ్ఛిత్వా భుజౌ రామ స్త్వాం దహే ద్విజనే వనే।
తదా త్వం ప్రాప్స్యసే రూపం స్వ మేవ విపులం శుభమ్ ॥

నీభుజములను శ్రీరాముడు ఛేదించి నిన్ను దహించినపుడు నీ స్వస్వరూపము నీకు ప్రాప్తించును. అని. అట్లే దహింపగా తేజశ్శాలియైవిమానమందు అంతరిక్షగతుడై శ్రీరామునితో ఇట్లు చెప్పెను.

"శ్రూయతాం రామ వక్ష్యామి సుగ్రీవో నామ వానరః।
గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్ ॥
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాద్య రాఘవ।
అద్రోహాయ సమాగమ్య దీప్యమానే విభావసౌ।—

——— ——— ——— కృత్యం తవ కరిష్యతి ॥

శ్రీరామా! ఇక్కడనుండి సుగ్రీవునిదగ్గరకు వెళ్ళుము. ఆతనితో అగ్నిసన్నిధిని ఏకమత్యనిమిత్తమై మైత్రి చేసికొనుము. ఆత

దుత్తముడు, సీతాన్వేషణకార్యము నతడు నిర్వహించును. అని చెప్పుచు సుగ్రీవుని వసతి, ఆయన యోగ్యత మొదలగు విషయము లన్నియు శ్రీరామునకు నివేదించి అన్తర్ధాన మయ్యెను. "రాక్షససంహారప్రసక్తి" కి ఇది రెండవప్రయోజనము.

ఇట్లు విరాధుని, కబంధుని; శాపవిముక్తులను చేసి వారి నుద్ధరించి, వారిచే సంస్తుతింపబడినవాడు శ్రీరాము డని గ్రంథము చెప్పుచుండ దానిని ఎత్తుకొనక వారి రాక్షసత్వమునకు సంబంధించిన ప్రథమావస్థలోని దుర్మార్గమునే ఎత్తి చూపిన ఈప్రబుద్ధుని చర్య "అంధ-గజ - న్యాయము" స్ఫురింపజేయుచున్నది. ఇక ఈయన వ్రాత—

"దండకారణ్యప్రాంతము నాక్రమించి తత్రత్యులను బాధపెట్టుచు క్రొత్తగా చేరి ఎత్తులు వేయుచున్న మునీశ్వరనామధేయుల ప్రోత్సాహముతో—విరాధుని గూల్చెను. కబంధుని ఖండించెను.

ధర్మపత్ని సీత హింసాకృత్యము మనకు వద్దని మొత్తుకొన్నను శ్రీరాముడు ససేమిరా అనెను" (పు 126) అట.

ఆమునీశ్వరులు అక్కడకు క్రొత్తగావచ్చినవారుకారు. ఈయన చెప్పినరాక్షసులు హింసాకృత్యమునకు దిగినప్పుడే వధింపబడిరి. నిష్కారణముగా కాదు. కనుక ఈ వ్రాత పరాస్తము.

## లంకాధిపతి – దండకారణ్యము

రహస్యాలకర్త వ్రాత — "దక్షిణాపథములో దండకారణ్యములోని జనస్థాన మన్న భాగము లంకాధిపతి యగు రావణుని ఏలుబడిలో సుభిక్షముగా ఉండెడిదని వాల్మీకమువలననే తెలియుచున్నది" (పు 110) అట!

దండకారణ్యము లంకాధిపతి ఏలుబడిలోనిది కానేకాదని వాల్మీకమే చెప్పుచున్నది—

అది మొదట ఇక్ష్వాకుపుత్రులలోని దండభూపాలుని రాజ్యమై యుండి తరువాత ఆభూపాలుడు చేసిన అపచారమును బట్టి శుక్ర శాపమున అరణ్యమై, దండకారణ్యమైనదని చెప్పబడియున్నది. — చూడుడు —

"ఇక్ష్వాకు రమితప్రభః ... జనయామాస ధర్మాత్మా శతం దేవసుతోపమాన్, తేషా మవరజస్తాత ... నామ తస్య చ దండేతి పితా చక్రే ... విన్ధ్యశైవలయో ర్మధ్యే రాజ్యం ప్రదాతే ... స దండ స్తత్ర రాజాఽభూత్ ॥ పురోహితం తూశనసం వరయామాస సువ్రతమ్ ... అథ కాలే తు కస్మింశ్చిత్ ... భార్గవకన్యాం ... విచరన్తీం వనోద్దేశే దండోఽపశ్యత్ ...

ఇట్లు శుక్రాచార్యపుత్రికను చూచి బలాత్కరింపబోగా అది తెలిసికొని ఆయన ఇట్లు శపించెను —

"సప్తరాత్రేణ రాజాఽసౌ సపుత్రబలవాహనః ।
పాప కర్మ సమాచారో వధం ప్రాప్స్యతి దుర్మతిః ॥
దక్ష్యతే పాంసువర్షేణ మహతా పాకశాసనః ।

ఒకవారములో దండుడు సపరివారముగా నశించును. ఈరాజ్య ప్రదేశము శతయోజనపరిమితమై యున్న దంతయు ఇంద్రకృతపాంసు వర్షము చేత ఇసుకమేట వేయును. అని శపించి అక్కడ ఆశ్రమముల లోని మునులను అక్కడనుండి పంపివేసెను.

"తతః ప్రభృతి కాకుత్స్థ దండకారణ్య ముచ్యతే"

ఇట్లున్నందున లంకాధిపతికి దండకారణ్యముతో సంబంధము లేదని సిద్ధాంతము.

ఇట్టి స్థితిలో దండకారణ్యములోని జనస్థానము రావణుని సుభిక్షముగా ఎట్లుండెనో? ఆజనస్థాన మన్నది తపస్విజనస్థానముకాని రాక్షసస్థానము కాదు.

"తపస్వినః స్థితా హ్యత్ర జనస్థాన మతో౽భవత్" అని వాల్మీకమే చెప్పుచున్నది.

దీనినిబట్టి అక్కడకు క్రొత్తగా ఆ తపస్విజనులను బాధించుటకు వచ్చువారు రాక్షసులే అని స్పష్టము. దీనితో వీరి వ్రాత నిరస్తము.

"సీత సౌందర్యమునకు ముగ్ధుడై రావణుడు సీతను పట్టుకొనుట కాదు. తని అభిజనమైన దండకలో చిరకాలమునుండి కాపురమున్న తనవాండ్రను పరాయి దేశమువాడు - అందును ఒక మానవుడు, వరుసపెట్టి కోయుచుండగా బలవంతుడైన రాజు ఉపేక్షింపడు. ఈరాజకీయమే రావణుని ప్రతీకారమునకు కారణమైనది" అట (పు 109)

ఇది దురూహ. బలవంతుడైన రాజయి — తనవాండ్రను మానవుడు కోయుచున్నప్పుడు చేయవలసిన ప్రతీకారము ఆమానవుని ఎదుర్కొనుటా! సీతను ఎత్తుకొని పోవుటా? ఈనారీచౌర్యము నీచకార్య మని మోహాంధుడు కనుక రావణునకు అనిపింపకపోవచ్చు.

రాజకీయవేత్త ననుకొను ఈరహస్యాలకర్త కనిపింపవద్దా! రావణునితో లేని సంబంధము కల్పించుకొన్న వీరు అనలేదు. కాని రావణుని అర్ధాంగి మండోదరి అన్నది.

"నారీచౌర్య మిదం క్షుద్రం కృతం శౌండీర్యమానినా॥
అపనీయాశ్రమా ద్రామం యన్మృగచ్ఛద్మనా త్వయా॥"

రాముడు దగ్గర లేకుండజేసి యెత్తుకొనిపోవుటనుబట్టి అది నారీచౌర్యమే అని ధ్రువపడినది. ఆదండకారణ్యము రావణునకు నివాసస్థానము కాదని చెప్పియున్నాము.

కనుక ఈవ్రాత పరాస్తము.

"లంకాపట్టణమునకు ద్వారమువంటిది జనస్థానము" అన్న వ్రాతకూడ నిరస్తమైనది.

ఇంకొకటి— 1. 'రాక్షసులు గ్రంథాలలో వర్ణించినట్టి వికృతాకారులు, వికారచేష్టలవారు కారు.

2. తమకు సరిపడనివారికి ఎన్నో పేసులుపెట్టి నైచ్యమంట గట్టుట, వికారముగ చిత్రించుట సర్వమానవసహజమేకదా! అట!

(పు 114)

1. వికృతాకారులు రాక్షసులు కారనుటకు వీరికేమి తెలియును? వికృతాకారులు కానట్టి రాక్షసులు కూడ ఉన్నట్టి వీరి మాటలనుబట్టి ఒప్పుకొనవలసినదే.

2. సర్వమానవసహజ మేది? తమకు సరిపడని వారికి ఏదో పేరులు పెట్టి నైచ్య మంటగట్టుటా? అది మానవసహజమే కాదు. మహర్షిసహజ మగునా? వీరి మాటకు లక్ష్యము వీరే.

మహర్షులకు ఏవేవో పేరులు పెట్టినవారువీరు; నైచ్యమంట గట్టినవారు; వీరు వసిష్ఠాదిబ్రహ్మర్షులను దూషించినవారు వీరు.

రాజర్షులకు, సీతారామలక్ష్మణులకు, ఏవో పేరులు పెట్టి నైచ్య మంటగట్టినవారు వీరు.

ఇక, తమకుసరిపడిన, విరాధ-కబంధ-శూర్పణఖా - అయోముఖీ - తాటకా - రావణాదిరాక్షసులను వెనుకవేసికొని వచ్చిన వారు వీరు.

"బుద్ధి ర్యథావిధా యస్య స తథా మన్యతే జగత్" అన్నట్లు వీరి బుద్ధి ఇట్టిదని తెలిసినందున ఈ వ్రాత పరాస్తము.

ఇంకొకటి - "శ్రీరాముడు తాను జేసిన వాలివధలో తప్పు లేదని సమర్థించుచు - ఆప్రాంతమున కంతకు భరతుడు చక్రవర్తి యనియు, ఆతని యేలుబడిలోని వాలి దండ్యు డనియు, భరతునకు ప్రత్యామ్నాయముగ తానే ఆదండన విధించితి ననియు - కొంబ్బ చెట్టు - దూడమేత, సామెతగా అందులో రాజకీయము రంగ రించెను" అట!

'ఇక్ష్వాకూణా మియం భూమి స్సశైలవనకాననా ।
మృగపక్షిమనుష్యాణాం నిగ్రహాఽనుగ్రహే ష్వపి ॥'

అనుచు తాను చేసినది రాజదండన. దానికి పాత్రుడు వాలి. అని చెప్పి వాలిని ఒప్పించినవాడు శ్రీరాముడగుటచేత వీరిది అసంబద్ధప్రలాపము.

## శ్రీరాముడు—పట్టాభిషేకము

రహస్యాల కర్త వ్రాత-

1 "దేవతాసంరక్షణము, సర్వరాక్షసవినాశనము. ఇంతపనిని దేవతలు- భూదేవతలు- అవతారపురుషునిచే చేయింప వలసియుండగా—

'పట్టాభిషేకము పాడుచేసిరే పాడుముండ లని' కైకను, మంథరను నిందింపవచ్చునా?

2 రాముని వనవాస మందలి దేవరహస్య మెరుగని మందబుద్ధులు నిందించినను త్రికాలజ్ఞులు బ్రహ్మర్షులు అయిన వసిష్ఠాదులు వాపోయినా రేమి?" అట; (పు 97)

ఆ అవతారపురుషునకు కర్తవ్యము దేవశత్రుసంహారపూర్వక దేవతాసంరక్షణమే, దశరథమహారాజు శ్రీరామునకు కర్తవ్యముగా నిశ్చయించినది పట్టాభిషేకము. దానికి విఘాతము కలుగుటలో దృష్ట కారణము- మంథర, కైకేయి అయినందున వారిని నిందించుట జరిగినది. అది మందబుద్ధులకే కాదు, దేవరహస్య మెరిగిన మహా మంతులకును కర్తవ్యమే అగును. ఏకార్యమున కైనను భవితవ్య మెట్లున్నను దృష్టకారణములు అనుకూలించినపుడు స్తుతియు, ప్రతి కూలించినపుడు నిందయు సహజము. కనుకనే భవితవ్యము తెలియుని దశరథునితోబాటు లోకమర్యాద ననుసరించి వసిష్ఠాదులును బాధ పడిరి. రావణసంహారానంతరము సీతారామలక్ష్మణులు ఏకత్ర కలిసి

యున్నపుడు దేవతలతో కూడ విమానముకూడ విమానముమీద వచ్చిన దశరథుడు శ్రీరామునితో ఇట్లనెను.

"కైకేయ్యా యాని చోక్తాని వాక్యాని వదతాం వర ।
తవ ప్రవ్రజనార్థాని స్థితాని హృదయే మమ ॥
త్వాం తు దృష్ట్వా కుశలినం పరిష్వజ్య సలక్ష్మణమ్ ।
అద్య దుఃఖా ద్విముక్తోఽస్మి నీహారాదివ భాస్కరః ॥

రామభద్రా! ఆనాడు నీవనవాసమునుగూర్చి కైకేయి అన్న మాటలు నాహృదయములో ఉండిపోయినవి. ఈనాడు కుశలముగా నున్న నిన్ను లక్ష్మణుని ఆలింగనముచేసికొన్న నాకు ఆదుఃఖము తొలగిపోయినది.

"ఇదానీం చ విజానామి యథా సౌమ్య సురేశ్వరైః ।
వధార్థం రావణస్యేహ విహితం పురుషోత్తమ ॥

ఇదంతయు రావణవధార్థము దేవతలచే నడుపబడిన కార్యమని ఇప్పుడు తెలిసికొన్నాను. అని. దీనినిబట్టి—

జటావల్కలములు దాల్చి మునివృత్తిలో మెలగవలసిన శ్రీరామునకు ఈ యుద్ధాల ప్రసక్తి యేల? తపస్సు చేసికొనుచు వనవాసము పూర్తిచేయవలయునుగాని, జటలు ధరించి, ఇప్పుడీ ఋషీశ్వరుల బోధలచే వెనుకటిమాట తప్పుట కాదా!

"రామో ద్విర్నాభిభాషతే" అతనికి రెండు నాలుకలులేవట!"
(పు 97)

ఈవ్రాత పరాస్తము. ఆనాటి ఆదశరథునకే ఆకార్యక్రమము తెలియనపుడు ఈనాటి ఈయనకు తెలియునా? వనవాసచిహ్నముగా వల్కలములను ధరింపజేసినది కైకేయీమాతయే.

తరువాత ధరింపవలసిన జటలను ధరించెను. ఆమె కోరినట్టి 14 సం॥ వనవాసము చేసెను.

"నీవు యుద్ధప్రసక్తి పెట్టుకొనకూడదు. ఋషీశ్వరుల బోధనలు వినకూడదు." అని ఆమె శాసింపలేదు; నీవు చేయవలసినది తపస్సేకాని, మరొకటి పనికిరాదని చెప్పలేదు.

హింసింపవచ్చినవారిపట్ల క్షాత్రము చూపకూడదని ఆదేశింపలేదు. కనుక శ్రీరాముడు మాట తప్పలేదు. ఈ ప్రబుద్ధుని బుద్ధియే దారి తప్పినది. "రామో ద్వి ర్నాభిభాషతే" అన్నది సిద్ధాంతమే.

1 "కైకేయి పెండ్లినాటి రాజ్యశుల్కము నెత్తక రెండు వరముల నెత్తుటకు కారణము— అది ఆమె చిన్ననాటి మాటనుక మరచిపోయి తరువాత లభించిన వరద్వయమునే యాచించి యుండును.

2. అదికూడ మంధర జ్ఞప్తి చేసినదాక ఆమె మనస్సులో లేనే లేదు." (పు 74) అట!

వీరన్నట్లు పెండ్లినాటిది రాజ్యశుల్కము.

ఇప్పుడు ప్రసక్తమైనది రాజ్యాభిషేకము. ఇట్టి ప్రసక్తినిబట్టి ఆరాజ్యశుల్కమే జ్ఞప్తికి రావలయునుకాని, అప్రసక్తమైన వరద్వయము జ్ఞప్తికి వచ్చుట సంభవము గాదు.

లోకములో తెలిసిన విషయము లెన్నియున్నను, ప్రసక్తినిబట్టి స్ఫురించుటే సహజము. అట్టిది రాజ్యశుల్కమే కనుక దాని మరపు అసంభవము. ఇంకొకటి- ఆ వరద్వయము అనిర్దిష్టమేకాని, ఈ రాజ్యాభిషేకముసందర్భమున జ్ఞప్తికి రావలసినది కానేకాదు.

అందుచేతనే 2 వ అంశములో వీరన్నట్టి ఆ వరద్వయము మాట కూడ కైకేయి మనస్సులో లేనేలేదు.

ఇంకొకటి—అది రాజ్యశుల్కము. ఎవరికి భరతునకు. ఆ భరతుడు రాజ్యాపేక్షియై యున్నప్పుడే అది వర్తించును. కైకేయి దాని నెత్తుకొనకపోవుట, భరతుని రాజ్యనిరపేక్షనే స్పష్టీకరించుచున్నది.

భరతుని రాజ్య నిరపేక్ష —

"కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః ।
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేన్ద్రియః ॥"

ఇది దశరథుడు పట్టాభిషేకము సంకల్పించి శ్రీరామునితో చెప్పిన మాట. రామభద్రా! భరతుడు జ్యేష్ఠానువర్తి; ధర్మాత్ముడు; దయాళువు; జితేంద్రియుడు జ్యేష్ఠుడే అభిషేకింపదగినవాడు అను సత్పురుషుల సదాచారము ననువర్తించువాడు. అని తెలిపెను.

ఇక్కడ భరతస్వభావప్రకటన మెందుకు? భరతు నుద్దేశించి వెనుక చేసి యున్న రాజ్యశుల్కవాగ్దానమునకు భంగము లేదనియు, నీకు పట్టాభిషేకమే అతనికి వాంఛితమనియు, ఆతడు రాజ్యనిరపేక్షు డనియు శ్రీరామునకు తెలుపుటకు- శ్రీరాముడు భరతునితో—

"పురా భ్రాతః పితా నః స మాతరం తే సముద్వహన్ ।
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్ ॥"

అని చెప్పుటచేత రాజ్యశుల్కముమాట శ్రీరామునకు తెలిసిన దే. అందువలన భరతుని రాజ్యనిరపేక్షనుబట్టి దాని ప్రతిబంధకము లేదని శ్రీరాముని సమాధానపరచుటకే ఆ భరత తత్త్వమును ప్రకటించెను.

రహస్యాలకర్త కూడ—"కైకేయి కోరినట్లు భరతునకే పట్టాభిషేకము చేయింప శ్రీరాముడు సిద్ధమైనను, గుణవంతుడైన భరతుడు—దీనికి కలలోనైన అంగీకరింపడు" (పు 83) అనుచు భరతుని రాజ్యనిరపేక్షను అంగీకరించియే యుండెను.

"అవతారపురుషుడు— స్వార్థత్యాగము చేసి తాను దగ్గర నుండి భరతునకే పట్టాభిషేకము చేయింపదలంప కూడదా?" అట! (పు 83)

కైకేయి కోరిన విధి శ్రీరాముడు అదినాకు సమ్మతమేఅనుచు-

"గచ్ఛన్తు చైవానయితుం దూతా శ్శీఘ్రజవై ర్హయైః ।
భరతం మాతులకులా దద్యైవ నృపశాసనాత్ ॥

దూతలు ఇప్పుడే వెళ్ళి భరతుని వెంటనే తీసికొని రావలయు నని చెప్పగా కైకేయి శ్రీరాముడు అరణ్యమునకు వెళ్ళిపోవలెనని తలచి శ్రీరామునితో ఇట్లన్నది—

"ఏవం భవతు యాస్యంతి దూతాః ... భరతం
మాతులకులా దుపావర్తయితుమ్ ...
తవ త్వహం క్షమం మన్యే నోత్సుకస్య విలంబనమ్ ।
రామ తస్మా దిత శ్శీఘ్రం వనం త్వం గంతు మర్హసి ॥"

నీవన్నట్లు భరతుని తీసికొనివచ్చెదరుకాని, నీవు మాత్రము అరణ్యమునకు విలంబము చేయక శీఘ్రముగా వెళ్ళవలెను, అన్నది.

ఈప్రబుద్ధుడు— (అయోధ్యకాండ 19స. 1-7,శ్లో)

అని చూపి ఆతరువాతనే ఉన్న— "గచ్ఛన్తు చైవానయితుం భరతమ్... అను 9వశ్లోకము - ఇప్పుడే వెళ్ళి భరతుని తీసికొని రావలసినదని శ్రీరాముడు చెప్పినదియు ఆతరువాత అట్లేకాని, నీవు ముందుగా వెళ్ళిపోవలయునని కైకేయి చెప్పినదియు ఎత్తుకొనలేదు. కనబడకకాబోలు. దాని నట్లుంచి ప్రకృతమునకు వత్తము.

భరతు డిక్కడకు రాకపూర్వమే నీవు అరణ్యమునకు వెళ్ళిపోవలెనని తల్లి చెప్పుటలో భరతుడు రాజ్యనిరపేక్షుడని, నీవు అరణ్యమునకు వెళ్ళిపోయినతరువాతనైతే ఆత డంగీకరింపవచ్చునని ఆమె యూహ.

మొత్తముమీద భరతుడు రాజ్యనిరపేక్షు డన్న విషయము దశరథునకు తెలిసినదే. శ్రీరామునకు తెలిసినదే. ఆకైకేయికికూడ తెలిసినదే. ఇంత ఎందులకు? పూర్వోక్త ప్రకారము రహస్యాలకర్తకును తెలిసినదే.

ఇట్టి స్థితిలో దశరథుని రాజ్యశుల్కవాగ్దానము పట్టుకొని ఈ ప్రబుద్ధుడు కొట్టుకొనవలసిన పని యే మున్నది? "మంథర దూర దృష్టి కలది. చుఱుకైనది" అని ఈయన మెచ్చుకొన్న మంథర రాజ్యశుల్కము నెత్తనేలేదు. కారణము దూరదృష్టియే, అది లేకయే ఈ కుఱ్ఱ దానినే పట్టుకొని వ్రేలాడుచుండెను. రాజ్యశుల్కమునే పట్టుకొని వ్రేలాడుచో రామునకు రాజ్యప్రాప్తి లేకపోవచ్చు నేమో కాని భరతునకు రాజ్యప్రాప్తిపై ఆశ లేదు సరికదా, రామునకు అరణ్యవాససిద్ధి యెట్లు? అన్నది ఆమె దూరదృష్టి. అందుకే ఆ రెండు వరములనే యెత్తుకొన్నది. శ్రీరాముడు నిశ్చింతగా అరణ్యమునకు వెళ్ళెను.

ఇక్కడ కైకేయిది దైవావేశము. అది రాముని అరణ్యమునకు పంపి, తన్మూలమున దుష్టశిక్షణము, శిష్టరక్షణము పూర్వోక్త ప్రకారము—విరాధకబంధ—ప్రభృతుల ఉద్ధరణము కావించి ఇహపరములకు సాధనమైనది.

ఈరహస్యాల కర్తది —

దురాగ్రహావేశము. ఇది సీతారామలక్ష్మణాంజనేయ మూర్తులను, వసిష్ఠాదిమహర్షులను దూషింపజేసి తన్మూలమున ఇహపర భ్రష్టత కలిగించుటకు సాధనమైనది.

—: దశరథుని రామాభిషేకాతురత :—

"అద్య ప్రకృతయ స్సర్వా స్త్వా మిచ్ఛన్తి నరాధిపమ్ ।
అత స్త్వాం యువరాజాన మభిషేక్ష్యామి పుత్రక ॥
అపిచాద్యాఽశుభాన్ రామ! స్వప్నే పశ్యామి దారుణాన్ ।
అవష్టబ్ధం చ మే రామ! నక్షత్రం దారుణై ర్గ్రహైః ॥
ప్రాయేణ హి నిమిత్తానా మీదృశానాం సముద్భవే ।
రాజా హి మృత్యు మాప్నోతి ఘోరం వాఽఽపద మృచ్ఛతి ॥
తద్యావదేవ మే చేతో న విముహ్యతి రాఘవ ।
తావదేవాభిషించస్వ చలా హి ప్రాణినాం మతిః॥"

రామభద్రా! ప్రజలందరు ప్రజాపాలకునిగా నిన్ను కోరుచున్నారు. మరియు నాకు దారుణములైన దుస్స్వప్నములు వచ్చుచున్నవి. నా జన్మనక్షత్రము క్రూరగ్రహాక్రాంతమైనది. ఇట్టి దుర్నిమిత్తములు సంభవించినపుడు రాజు మరణించుటో, ఘోర మగు ఆపదకు పాలగుటో జరుగును. ఆ కారణమున నాబుద్ధి స్వస్థముగా నున్నపుడే నీవు అభిషిక్తుడవు కావలెను.

ఈనాడు పునర్వసువు, "శ్వః పుష్యయోగం నియతం వక్ష్యన్తే ...తతః పుష్యేఽభిషించస్వ, మనస్త్వరయతీవ మామ్".

పుష్యమి కనుక రేపే అభిషిక్తుడవు కమ్ము. అనిచెప్పి—

"విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః ।
తావ దేవాఽభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ ॥"

మన భరతుడు రావద్దా? అందువేమో, ఆతడు రాకుండగనే ఇది జరుగుట ఆవశ్యక మని నాకు తోచుచున్నది. అని తొందర చూపించెను. ఈతొందర తనకు ప్రమాదము వచ్చు ననియే తప్ప భరతుడడ్డము వచ్చు నని కాదు. భరతుడు రాజ్యనిరపేక్షుడన్న విషయము కైకేయికికూడ ధ్రువమైనపుడు ఆ శంక యెట్లు? నిజముగా భరతుడే యిక్కడ ఉన్నచో ఈవిఘ్నము సంభవించునా?

"కిం ను చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతమ్ ।
సతాం చ ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ ॥"

మనుష్యసామాన్యముగా చిత్తము స్థిరమైనది కాదు. ధర్మాత్ముల చిత్తము కర్తవ్యసిద్ధి యైనపుడు శోభించును. కనుక ఆవశ్యకమైన మంగళకార్యములో విలంబము కూడదు. అనికూడ పట్టాభిషేకావశ్యకర్తవ్యతనే ప్రతిపాదించెను.

"యావ దేవ మే చేతో న విముహ్యతి, తావ దేవ
అభిషించస్వ" "మన స్త్వరయతీవ మే" ॥
"విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః ।
తావ దేవాభిషేక స్తే యుక్తకాలః"

"కిన్ను చిత్తం మనుష్యాణా మనిత్యమ్"

ఈవాక్యములు దశరథుని ఆపదకే సూచకములని మతిమంతు లకు తెలియనిది కాదు.

"ఈరామాభిషేకముమాట మామగారైన కేకయరాజునకైన కబురు పంపవద్దా?" అట! (పు 76)

దశరథునకు రేపే పట్టాభిషేక మని తొందర కలిగినది. ఎప్పుడు కబురంపుట? అయోధ్యనుండి కేకయరాజపురమునకు ప్రయాణము వారమురోజులు పట్టును. దశరథుడు వారము రోజులకే స్వర్గస్థు డయ్యెను. అప్పుడు పంపిన కబురుతో బయలుదేరి వచ్చిన భరతుడు-

"తాం పురీం పురుషవ్యాఘ్రః సప్తరాత్రోషితః పథి ।
అరుణోదయే... అయోధ్యాం దదర్శహ"

సప్తరాత్రములు ప్రయాణము చేసి అయోధ్యకు చేరెనని చెప్పబడినది.

ఇక రహస్యాల కర్త వ్రాత చూడుడు.—

1. "దశరథుడు - తాను చేసిన రాజ్యశుల్క వాగ్దానము తప్పింపవలె నని సంకల్పించుకొన్న మహాద్రోహి" (పు 77)

2. "శ్రీరాముడు—పదవీకాంక్ష చే తండ్రిమాటకు, గంగిరెద్దు వలె తల యూచి పట్టాభిషేకమునకు సిద్ధమయ్యెను"

"సర్వాః స్వార్థం సమీహంతే" అన్న ముక్క ఈ యవతారపురు షునకుగూడ అన్వయింపవలసివచ్చెను" (పు 79)

3. 'వసిష్ఠాదులుకూడ దశరథుని దుష్టసంకల్పము మెచ్చు కొనుటలో మోసము లేకపోలేదు'

4. "కౌసల్య- అభిషేకవార్త విని పట్టుబట్టలు కట్టి దేవతా గృహములో తిష్ఠ వైచెను."

5. "శ్రీరాముడు"సామిత్రే భుంక్ష్వ భోగాం స్త్వ మిష్టాన్ రాజ్య ఫలాని చ"

అని చెప్పిన రాజ్యసుఖములకు భరతు డుండ లక్ష్మణు డెవడు? ఆతనికి ఆమాట యిచ్చుటకు రామునకు హక్కు ఎక్కడిది?

అత్తగారి ఆస్తి అల్లుడు దానము చేసినట్లు దొంగలు దొంగలు కలిసి ఊళ్ళు పంచుకొన్నట్లు, ఇంత కుంభకోణము జరుపుచు, ఏమియు నెరుగని నంగనాచివలె మెలగుచు, "రాముడు పితృవాక్యపరిపాలనా దక్షు" డని కితాబు పొంద నేర్చెను.

రాముడు భీష్ముని బోలు స్వార్థత్యాగి అగునా? కాదు. ధర్మ జునివంటి మెత్తని పులి" (పు 34)

ఈ అసంబద్ధ ప్రలాపములకు ఏమనవలెనో పాఠకమహాశయు లాలోచింతురుగాక.

రామునికంటె ఉత్తముడు భీష్ము డని చెప్పిన నోటితో ఆ భీష్మునిగూర్చి అన్నవి చూడుడు—

"అంబను నీతమ్మునికిచ్చి పెండ్లి చేయవయ్యా!" అని గురు వర్యుడైన పరశురాముడు శిష్యశిఖామణి యైన భీష్మునకు చెప్పగా "ససేమిరా" అని యాతడు మొరాయించి గురువులతో యుద్ధము నకు సిద్ధమయ్యెను. గురువర్యులు నెత్తిని గుడ్డ వేసికొని ఇంటికి పరారి యయ్యిరి" (పు 71) అట

నిరంకుశుల నోటికి అడ్డేమున్నది.

"యస్య నాస్తి వివేక స్తు కేవలం యో బహుశ్రుతః।
న స జానాతి శాస్త్రార్థాన్ దర్వీ సూపరసా నివ॥"

భారతములో అట్లున్నది, రామాయణములో ఇట్లున్నది, అని పుస్తకములు, అసంబద్ధముగా కథలు తెలిసినను వివేకము లేనప్పుడు ఆశాస్త్రార్థవిషయములు తెలియునా? పాయసపాత్రలో సంచరించు గరిటెకు రసగ్రహణ ముండునా?

## వాక్స్వాతంత్ర్యము - తత్ఫలము

వాక్స్వాతంత్ర్యము, భావప్రకటనస్వాతంత్ర్యము మన కున్న దనుకొని యథేచ్ఛగా వ్యవహరించువారు — ఆపై సంభవించు క్లిష్ట

ములను తొలగించుకొనుటకు స్వాతంత్ర్యము కూడ తమ కున్నదేమో ఆలోచించుకొనవలసియున్నది దీనికి నిదర్శనము —

మహాభారతచరిత్రి - రాజసూయరహస్య - గ్రంథకర్తయు, ఏతాదృశులకు మార్గదర్శియు అగు పెండ్యాలపండితుడు:—శ్రీకృష్ణుని ఒక వెండుశ్రీక అనియు, పూతన అను రోగము సోకి తొలగినవా డనియూ, ఆతనిది భగవదవతారము, మరొకనిది కాకపోవుటయునా? అనియు, అధర్మము, అసత్యము సర్వాంగోపేతమై యున్న వాడనియు, ఆతని విశ్వరూప మింద్రజాలమనియు, పాపాలభైరవు డనియు, ఏమేమో మహాభారత చరిత్రిలో వ్రాసి పెట్టెను.

అది 1928 సం॥రములోని ముచ్చట.మరి 10సం॥రములకు 1938లో వీ రేబకరిచ్చిన అభిప్రాయముపై ఆధారపడి-"రాజసూయరహస్యము" ను వ్రాసినారు. అందులో అప్పటి తమ అవస్థను చెప్పుకొనుచు కుచేలవరదుని రక్షింప వేడుకొన్నారు-

'పంధిల్లె వృద్ధత సంధిల్లె లేమి
సంధిల్లె నంధత సంధిల్లె నప్పు
సంధిల్లె నేకత సంధిల్లె జింత
సంధిల్లె దీనత సంధిల్లె భీతి

ఇవన్నియు సంధిల్లె నని చెప్పుకొన్న వీరికి వానిని తొలగించు కొను స్వాతంత్ర్యము సంధిల్ల లేదనియు,

సిద్ధింపకున్నది శ్రీశ సేవ
సిద్ధింప కున్నది చిత్తసంశుద్ధి

ఈ యవస్థలో చిత్తశుద్ధి, శ్రీశసేవ, ఇవియే శరణ్య మనియు ఘోషించి—

అట్టుకులనే యీయు నర్థి కర్థంబు

దటుకున నిచ్చిన దాత వీవనుచు
సార్థకంబుగ జేయ సమకట్టి దాని
కానక కని చేయు కలుషముల్ బాపి
జ్ఞాను లొందెడు నట్టి సద్గతి నిమ్ము'

అనుచు కుచేలవరదుని వేడుకొన్నారు ఈయన. వెనుక వీరు ధిక్కరించి తృణీకరించి దూషించియున్న శ్రీకృష్ణుడే కద! అప్పటి దశ అట్టిది. ఇప్పటి దశ యిట్టిది.

ఆనాడు శ్రీకృష్ణుని దూషించి తత్ఫలము ననుభవించినవాడు పెండ్యాలపండితుడు. ఈనాడు రామప్రభువును దూషించినవారు-పండితుడు చౌదరి. అని గ్రహింతురుగాక!

## దశరథుడు—లక్ష్మణుడు

రహస్యాల కర్త వ్రాత—"రామానుజాయ నమః" అన్న
కారికలో జ్ఞప్తికి వచ్చు లక్ష్మణుడు అన్నగారి సన్నిధిలో వంగివంగి దణ్ణాలు పెట్టుచు తల్లిని తండ్రిని నరకవత్తునని కత్తిదూసి, అడ్డమైన కూతలు కూసి, అన్నగారి మందలింపులు తిని రామభక్తుడై లక్ష్మణస్వామి యై వెలసెను" అట! (పు 72)

ఇక్కడ విషయ మిది— తొలిరోజు నిశ్చయించిన పట్టాభిషేక విషయము దశరథుడు శ్రీరామునకు చెప్పియుండెను. ఆసన్నాహము లోనే అప్పటినుండియు సీతారాములు, కౌసల్యాదేవియు ఉన్నారు. తెల్లవారునప్పటికి వచ్చిన ఆహ్వానముమీద శ్రీరాముడు దశరథదర్శనార్థము వెళ్ళునప్పటికి ఆయన ఖిన్నుడై నిశ్చేష్టుడై కనబడుట, ఆకైకేయియే, తనకు వెనుక వాగ్దానము చేసియున్న వరము లిమ్మని ఈయీవిధముగా కోరితిని. అది నీకు చెప్పలేక బాధపడుచున్నాడు అని చెప్పుట. శ్రీరాముడు అట్లే అరణ్యమునకు వెళ్ళెదనని ఆమెతో చెప్పి, కౌసల్యదగ్గరకువచ్చి ఆమెకు, అరణ్యవాసము ప్రాప్తించినదని తెలుపుట, ఇట్లు జరుగుటతో, అసంభావితమైన ఈవార్త ఆమె విని విలపించి "త దక్షయం మహద్దుఃఖం నోత్సహే సహితుం చిరమ్"

14సం॥ పాటు నీయెడబాటుతో కలుగు దుఃఖమును నేను సహింపలేన నాకు మరణమైనను రాకపోయెను అనుచు అతిదీనముగా దుఃఖిం చుండెను.

"తథా తు విలపన్తీం తాం కౌసల్యాం రామమాతరమ్ ।
ఉవాచ లక్ష్మణో దీన స్తత్కాలసదృశం వచః ॥
న రోచతే మమాప్యేత దార్యే య ద్రాఘవో వనమ్ ।
త్యక్త్వా రాజ్యశ్రియం గచ్ఛేత్ స్త్రియా వాక్యవశంగతః ॥
... నృపః కి మివ న బ్రూయా చ్చోద్యమానః ...
నాఽస్యాపరాధం పశ్యామి నాపి దోషం తథావిధమ్ ।
యేన నిర్వాస్యతే రాష్ట్రా ద్వనవాసాయ రాఘవః ॥
న తం పశ్యా మ్యహం లోకే పరోక్ష మపి యో నరః ।
స్వమిత్రోఽపి నిరస్తోఽపి యోఽస్య దోష ముదాహరేత్ ॥
నిర్మనుష్యామి మాం కృత్స్నా మయోధ్యాం మనుజర్షభ ।
కరిష్యామి శరై స్తీక్ష్ణై ర్యది స్థాస్యతి విప్రియే ॥
ప్రోత్సాహితోఽయం కైకేయ్యా స దుష్టో యది నః పితా ।
అమిత్రభూతో నిస్సంగం వధ్యతాం బధ్యతా మపి ॥"

ఆ కౌసల్యావిలాపము విని దీనుడై లక్ష్మణుడు ఆమెతో తత్కాలో చితముగా ఇట్లనెను—

ఈ శ్రీరామవనవాసము నాకును సమ్మతము కాదు. రాజ్య త్యాగము చేసి స్త్రీ వాక్యము బట్టుకొని వెళ్ళుటా? అడిగినను మహ రాజు చెప్పకపోవు టేమి? శ్రీరాము డేమి రాజద్రోహము చేసె నః ఈ వనవాసము? ఏమి మహాపాతకము చేసె నని ఈ వనవాసము

లోకములో—"సు - అమిత్రః" అతిశత్రువుకూడ చాటుగ నైనను ఈతనియందు ఈదోష మున్న దని చెప్పువాడు లేడే శ్రీరామా! సంకల్పించిన కార్యమునకు విఘాతము కలిగించువారి నందరను వధింతును.

కై కేయీపో్రత్సాహముచేత ఈ దుస్సంకల్పము తండి్రికి కలిగినను – "వధ్యతాం బధ్యతా మపి" నిగ్రహింపవలసినదే. ఏమనగా —

"గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః।
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్॥"

గర్వితుడును, కార్యాకార్యములు తెలియకుండువాడును, అమర్యాదగా ప్రవర్తించువాడును, గురువైనను శాసింపవలసినదే. అని చెప్పుచున్నది ధర్మశాస్త్రము. అన్నది లక్ష్మణుని ప్రసంగము. ఇది- "తత్కాలసదృశం వచః" అని చెప్పబడినది. అనగా-కౌసల్యా శోకశాంతికొరకే అని తెలియుచున్నది కనుకనే—

ఏతత్తు వచనం శ్రుత్వా లక్ష్మణస్య ... ।
ఉవాచ రామం కౌసల్యా రుదన్తీ ... ॥
భ్రాతు స్తే వదతః పుత్ర లక్ష్మణస్య శ్రుతం త్వయా।
యదత్రానంతరం కార్యం కురుష్వ యది రోచతే॥"

ఆకౌసల్య లక్ష్మణు డన్నది విని రామభద్రా! లక్ష్మణుని మాటలు వింటివికదా! ఈపైన నీకేమి తోచునో అదిచేయుము అన్నది. దుస్సహావనవాసదుఃఖనిమగ్నయై యేమియు ఆలోచన తోచక మరణము కోరుకొనుచున్న కౌసల్యకు ఆ దుఃఖమునుండి మనస్సు కొంచెము మరలించుటకై లక్ష్మణుని ఆమాట అయినందున అది తత్కాలసదృశమని చెప్పబడినది. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణునితో ఇట్లనెను—

"తవ లక్ష్మణ జానామి మయి స్నేహ మనుత్తమమ్।
మమ మాతు ర్మహ ద్దుఃఖ మతులమ్...॥"

లక్ష్మణా! నీదుఃఖమును, నామాతృదుఃఖమును తెలిసికొన్నాను. ధర్మరహస్యము తెలియక సంభవించినది ఈ దుఃఖము. తండ్రిచేసిన

వాగ్దానమును బట్టి కైకేయీ మాతచేత కోరబడితిని. పితృవాక్యము పరిపాలింపక తప్పదు. అందుచేత—

"ధర్మ మాశ్రియ మా తైక్ష్ణ్యం మద్బుద్ధి రనుగమ్యతామ్"

ధర్మ మాశ్రయింపుము, తీక్ష్ణతను విడిచి నాబుద్ధి ననుసరింపుము. అని చెప్పెను.

గ్రస్థమైన ఈవిషయమునకు పై రహస్యాలకర్త వ్రాత యెట్లున్నదో పాఠకమహాశయులు గమనింతురుగాక!

## శ్రీరాము వనవాసము- రాక్షస సంహారము

1. రహస్యాలకర్త వ్రాత- "వసిష్ఠాదులు పెట్టిన ముహూర్తము, దేవతల సంకల్పప్రయత్నములు, రాముని వనవాసమునకు ప్రధానకారణము. ఇది గుర్తింపక ఆ దాసిముండ (మంధరను) ఆడిపోసుకొందుకు." ఇట్టిదే భారతములో సైంధవవధఘట్టము.

2. పద్మవ్యూహములో ప్రవేశించిన అభిమన్యునకు వెనుక వచ్చుచున్న పాండవులను సైంధవుడు ఆపివేయగా ద్రోణాదులు ఆతనిమీద బడి కూల్చిరి.

అర్జునుని శపథము సైంధవుని మీదికి బోయి బావగారి గారడివలన సైంధవుని చంపివేసెను.

అనాడు నీవే మమ్ముల నుద్ధరింపు మని పద్మవ్యూహములో ప్రవేశపెట్టిన ధర్మజుడు అభిమన్యుని వధకు సైంధవునికన్న ముఖ్యకారణము కాదా?' అట! (పు 90)

1. దేవతల సంకల్పప్రయత్నాదిరూపమగు దైవముకూడ దేశకాలాదిదృష్ట కారణముల నాధారము చేసుకొనియే శుభాశుభఫల

మిచ్చుచుండును. కనుకనే లోకులు కార్యసిద్ధికి విఘాతము కలిగించు దృష్టకారణములను తొలగించుటకు ప్రయత్నించుచుందురు. అది అని వార్యమైనపుడు నిందించుచుందురు. కనుకనే ఆకార్యమునకు విఘాతము కలిగించినవారి ననుట.

శ్రీరామపట్టాభిషేకవార్తను సంతోషింపనివా రెవరును లేరు. ఆ శుభవార్తను మంథర కైకేయిచెవిని వేయగా ఆనందముతో ఆమెకు పారితోషిక మిచ్చి కైకేయికూడ సంతోషించినది. సంతోషింపక కొట్టుకొన్నది ఆనాడు మంథర. ఈనాడు మన రహస్యాలకర్త. కనుక ఆమెను ఆడిపోసుకొని రని నెపమా? ఆమెను వెనుక వేసికొని వచ్చు వానినికూడ ఆడిపోసుకొందురు. శ్రీరామ వనవాసమునకు కారణము వసిష్ఠాదుల ముహూర్తమా? ముహూర్తము ముందు పెట్టించి, తదనుగుణముగా దశరథుడు ప్రయత్నించెనా? తనకు మరణసూచకముగా గోచరించు ఉత్పాతములకు భయపడిన దశరథుని తొందరను బట్టి అప్పటి కది పెట్టెనా? కనుక ముహూర్తము పెట్టి వనవాసము ప్రాప్తించె ననుట అజ్ఞానము.

అయితే "వసిష్ఠునకు భవితవ్యము తెలియ" దందురా? తెలిసియే యున్నది. జ్ఞానులు విషయము తెలిసియు తెలియనట్లు లోకమర్యాద ననుసరించి వ్యవహరించుచుందురు.

దీనికి ఉదాహరణము - దుర్యోధనుడు — పాండవులను కుంతీదేవితో కూడ లక్కయింట ప్రవేశపెట్టినట్లు, అందులో వారు దగ్ధులైనట్లు లోకులు గోలపెట్టుచుండ - బిలద్వారమునుండి పదిలముగా వారందరు నిర్గమించి వెళ్ళినారు, సురక్షితులై యున్నారు. అని తెలిసియున్న శ్రీకృష్ణభగవానుడు బలరామసహితముగా హస్తినాపురమునకు వెళ్ళెనని చెప్పబడినది—

"విజ్ఞాతార్థోఽపి భగవాన్ దగ్ధా నాకర్ణ్య పాండవాన్ ।
కున్తీం చ కుల్యకరణే సహ రామో యయౌ కురూన్ ॥

భీష్మంనృపం సవిదురం గాంధారీం ద్రోణమేవ చ ।
తుల్యదుఃఖౌ సమాగమ్య హా కష్ట మితి శోచతుః ॥"

ఇట్లు వెళ్ళి పాండవులనుగూర్చి శోకించువారితో కలిసి వారితో సమానదుఃఖము కలిగి శోకించిరి.

ఇట్లే మహాజ్ఞానులగు వసిష్ఠాదులును వ్యవహరింతురని తెలిసికొనవలెను.

ఇట్లు ప్రథమాంశము నిరస్తము.

2. పద్మవ్యూహములో ప్రవేశింపదలచిన అభిమన్యువునకు రక్షకముగా పాండవసేనకూడ ప్రవేశించునపుడు అర్జునుని తప్ప మిగిలినవారి నందరిని ఒకనాడు జయింపగల వరబలముతో విజృంభించినట్టి సైంధవుడు – అభిమన్యునితో డీకొని పద్మవ్యూహప్రవేశము లేకుండ జయింపవలసియున్నపుడు ఆతని నొక్కనిని ఎదుర్కొనక ప్రవేశింపనిచ్చి, మిగిలిన సర్వయోధులను ఎదుర్కొని జయించి అభిమన్యుని నిస్సహాయుని చేసినవాడు సైంధవుడే కనుక పార్థుడాతని వధింప శపథము చేసి కృతకృత్యుడైనాడు. పార్థునకు సైంధవుడు బావమరదియని— "బావమరదిని చంపివేసెను." అని ఈయన వ్రాసెను. ఇక్కడ మీ రావణుడు – "శూర్పణఖకు భర్తయగు బావమరిదిని చంపివేసెను." అని మేము ఈయనకు తెలుపుచున్నాము—

శూర్పణఖాయాశ్చ భర్తార మసినా ప్రాచ్ఛినత్తదా ।
శ్యాలం చ బలవన్తం చ విద్యుజ్జిహ్వం బలోత్కటమ్ ॥
జిహ్వయా సంలిహానం చ రాక్షసం సమరే తదా ॥"

శూర్పణఖాపతి యగు విద్యుజ్జిహ్వుడను రాక్షసుని ఛేదించినాడు రావణుడు. ఈతడు సైంధవుని వంటి అపరాధి కాడు.

పద్మవ్యూహములో ఒక్కనిమాత్రము ప్రవేశింప నిచ్చిన సైంధవునిలో తప్పు లేదట!

"పద్మవ్యూహములో ప్రవేశపెట్టిన ధర్మజుడు అభిమన్యు వధకు సైంధవునకన్న ముఖ్యకారణము" అని వ్రాసిన ఈప్రబుద్ధునిది ఎంత వివేకమో గమనింతురుగాక.

ధర్మజుడు పద్మవ్యూహములో ఒక్క అభిమన్యునే కాదు, తనితో సేన నంతను ప్రవేశపెట్టినవాడే ఒక్క అభిమన్యుని ప్రవేశింపచ్చి మఱెవ్వరిని ప్రవేశింపకుండ చేసినవాడు సైంధవు డని గ్రహింవలెను. ఇట్లు ద్వితీయాంశముకూడ నిరస్తమైనది.

ఇప్పుడు రహస్యాలకర్త వ్రాత చూడుడు—

"రామాయణగాథకు, రావణసంహారమునకు, ఎందరో మునిపుంగవులు- పురోహితులు- దేవయ్యలు- గూడుపుఠాని చేసి, వేసిన త్రుగడను గుర్తింపలేక, కూతురు బిడ్డను గనలేకపోగా అత్తగారు అల్లుని మీదబడి యేడ్చినట్లు- ఈరామభక్తులు—గోముఖవ్యాఘ్రములు—తేనెపూసినకత్తులు జాతిమాత్రోపజీవులు- కుక్షింభరులు- కంధరమీద బడెదరు." (పు 91) అట!

రామభక్తులారా! ఈవాచాటత, ఈవసిష్ఠాదిబ్రహ్మర్షి విద్వేషము, ఈవాల్మీకిమహర్షిధిక్కారము, ఈ దేవశత్రుపక్షపాతబుద్ధి, రామభక్తులయందు ఈ ఆక్రోశము ఇదంతయు పురోగతి యగునో అధోగతి యగునో ఆలోచింతురుగాక,

ఈప్రస్తావములో మరియొక విచిత్రాంశము తెలుపుచున్నాము- రామస్వామిచౌదరి మహోదయులు వ్రాసియున్న 'యథార్థ రామాయణము'లోని వ్రాత—

'ద్రావిడమన్నీల ప్రాణములు హరింప శ్రీరాముడు చింత జేసి... రాజ్యపట్టాభిషేకము చేయ నెంచి' కైకేయితో, 'తల్లిరో వకరణి నేని దండకాటవిం దిరుగుభాగ్యము నాకొడగూర్చి పంపవే' అని శ్రీరాముడు పలుక... కైకేయి...

'సరిలెమ్ము కన్నతండ్రీ! ఋణము కనిపెట్టి యుండి తప్పక నేనెరవున నైనను నీపని సరిజేసెద నమ్ము మెట్టిసడి పైబడినన్' అన్నదట.

రాముడు, కైకేయి కూడ బలుకుకొని రాక్షససంహారమునకొరకు చేసినది దండకారణ్యప్రవేశమట! ఇందులో నాకు పట్టాభిషే

కము కాండ జేయు మని శ్రీరాముడు కైకేయుని కోరి అరణ్యము నకు వెళ్ళినట్లున్నది.

రహస్యాలకర్త వ్రాతలో — శ్రీరాముడు పదవీకాంక్షచే పట్టాభిషేకమునకు సిద్ధమయ్యెను.' (పు 7)

అని యున్నది. ఇది ఆరామాయణమునకేకాదు, ఈయథార్థ రామాయణమునకును విరుద్ధమే.

ఈతడు- ఆ 'యథార్థరామాయణ'కర్త వేసిన బాటలో నడచిన ప్రబుద్ధుడే. చూడుడు—

"అన్నమో రామచంద్రా! యటంచు నేడు వారయోధ్యలో పెక్కురున్నారు కాని, అన్నమో రావణప్రభూ, యంచు నేడు వారు లంకలో నెవరు గన్పట్టరారు" అని ఆయన,

"రామరాజ్యమనగా- "అన్నమో రామచంద్రా" అని ఆకటంటలచే అలమటించిన రాజ్యము" (పు 118)

అని ఈయన. ఇద్దరికి సరిపోయినదా? ఇట్లు రహస్యాలకర్త వ్రాత పరాస్తము.

## శ్రీరాముడు-రావణుడు

ఆనాటి రావణుడు ఆ శ్రీరాముని ఎట్లు భావించెనో తెలిసికొందము— శ్రీరాముని కామించి కృతార్థురాలుకానట్టి శూర్పణఖ

"వృద్ధాం భార్యా మవష్టభ్య న మాం త్వం బహుమన్యసే ।
అద్యేమాం భక్షయిష్యామి పశ్యత స్తవ మానుషీమ్ ॥
ఇత్యుక్త్వా... అభ్యగచ్ఛ త్సుసంక్రుద్ధా..."

ఈవృద్ధభార్యను బట్టి నన్నాదరింపకున్నావు. కనుక నీ యెదుట ఈమనుష్యస్త్రీని భక్షింతు ననుచు క్రోధముతో సీతాదేవిమీద వెళ్ళినప్పుడు స్త్రీకి చెప్పబడినట్లు శిక్షింపబడి ఖరదూషణాదుల శ్రీరాముని మీదికి పురికొల్పి అది వ్యర్థముకాగా రావణునియొద్దకు పోయి సీతాసౌందర్యవర్ణనముతో ఆతని నుద్రేకింపజేసిన

అప్పు డారావణుడు సీతాపహరణమున కుద్యమించి మారీచ సహాయాపేక్షతో ఆతనియొద్ద శ్రీరామునిగూర్చి ఆడిన ఆమాటలు—

14 వేల ఉద్దండులైన రాక్షసులను పాదచారియైన మనుష్యుడు వధించెను.

"పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః ।
స హన్తా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః ॥
అశీలః కర్కశః తీక్ష్ణో మూర్ఖో లుబ్ధోఽజితేన్ద్రియః ।
త్యక్తధర్మా త్వధర్మాత్మా...॥
యేన వైరం వినాఽరణ్యే భగినీ మే విరూపితా ।
అస్య భార్యాం జనస్థానాత్ సీతాం సురసుతోపమామ్ ॥
ఆనయిష్యామి విక్రమ్య సహాయ స్తత్ర మే భవ ॥"

ఆరాముడు తండ్రిచేత వెళ్ళగొట్టబడినవాడు, మూర్ఖుడు, అధర్మాత్ముడు, నిష్కారణముగా శూర్పణఖకు శిక్షచేసిన వాడు. ఆయన భార్య సీతాసుందరిని తీసికొనివచ్చెదను. నీవు సహాయుపడుము. అని కోరెను.

ఇక్కడ— "రావణుడు సీతను బట్టుకొనుట, సీతాసౌందర్య ముగ్ధుడై కాదు" (పు 109)

అని చెప్పిన రహస్యాలకర్తను— "సీతాం సురసుతోపమామ్ ఆనయిష్యామి" అను మాటకు అర్థమేమి? అని అడుగుచున్నాము.

ఆ రావణుని మారీచు డిట్లు మందలించెను—

"న నూనం బుధ్యసే రామం మహావీర్యగుణోన్నతమ్ ।
త్వద్విధః కామవృత్తో హి దుశ్శీలః పాపమన్త్రితః ।
ఆత్మానం స్వజనం రాష్ట్రం స రాజా హన్తి దుర్మతిః॥

ఆరాముని నీవేమియు తెలిసికొనకున్నావు. దుశ్శీలుడైన నీవంటి కాముకుడగు రాజు సర్వనాశకుడగును.

"న చ పిత్రా పరిత్యక్తః నాఽమర్యాదః... ।
న లుబ్ధో న చ దుశ్శీలో న చ క్షత్రియపాంసనః ॥

న చ తీక్ష్ణోహి ... సర్వభూతహితే రతః ॥
కైకేయ్యాః ప్రియకామార్థం పితు ర్దశరథస్య చ ॥
హిత్వా రాజ్యం చ భోగాంశ్చ ప్రవిష్టో దండకావనం ।
రామో విగ్రహవాన్ ధర్మ స్సాధు స్సత్యపరాక్రమః ॥
రాజా సర్వస్య లోకస్య దేవానా మివ వాసవః ।

నీవు రాముని గూర్చి చెప్పిన దంతయు అబద్ధమే. మూర్తీభవించిన ధర్మమే రాముడు.

"యది శూర్పణఖా హేతో ర్జనస్థానగతః ఖరః ।
అతివృత్తో హతః ...
అత్ర బ్రూహి యథా తత్త్వం కో రామస్య వ్యతిక్రమః"

శూర్పణఖా నిమత్తము అక్రమముగా తనమీదికి వెళ్ళిపడిన ఖరాదులను వధించుటలో ఆ రాముని తప్పేమున్నదో నిజము చెప్పుము. అనుచు ఆ రావణుని మందలించినవాడు రాక్షసుడైన మారీచుడే.

ఇట్లు శూర్పణఖా- ఖర- దూషణాదిరాక్షసగణమును వెనుక వేసికొని వచ్చిన రావణునకు ఆనాడు బుద్ధిచెప్పిన ఆ మారీచుడే ఈనాడు ఆరాక్షసగణమును, ఆరావణుని వెనుకవేసుకొనివచ్చు రామశత్రువులకుగూడ బుద్ధిచెప్పెనని తెలిసికొందురుగాక. 'రామో విగ్రహవాన్ ధర్మః' అను మారీచుని ఉద్ఘోషమును రహస్యాలకర్త జ్ఞప్తియందుంచుకొనుగాక.

ఈ మారీచునకు ఈబుద్ధిపరివర్తనము, ఇట్టి సద్భావము రాముని యెడల కలుగుటకు హింసాకృత్యములకు దిగి రాముని దెబ్బలకు రెండుసార్లు గురియగుటే కారణము. దాని కైనను అదృష్ట ముండవలెను.

రామప్రభావమును గూర్చి తన అనుభవమును రావణునితో మారీచు డిట్లు చెప్పెను.

"శరేణ ముక్తో రామస్య కథంచి త్ప్రాప్య జీవితమ్ ।
ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః ॥

వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్ ।
గృహీతధనుషం రామం పాశహస్త మివాన్తకమ్ ॥
అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ ।
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే ॥
అహం తస్య ప్రభావజ్ఞో న యుద్ధం తేన తే క్షమమ్ ॥

రామబాణమునుండి విముక్తుడనై ఎట్లో జీవించిన నేను దుర్వృత్తిని పరిత్యజించి తపశ్చర్య నాశ్రయించితిని.

ఏ వృక్షమందు చూచినను వల్కల - అజిన - ధారియై కోదండపాణియై యున్న రాముడే కనబడుచున్నాడు. అరణ్యమంతయు రామమయమై కనబడుచున్నది. రామప్రభావమును అనుభవపూర్వకముగా తెలిసికొన్నవాడను నేను. ఆయనతో యుద్ధము నీకెంత మాత్రము తగదు. అని హితోపదేశము చేసిన మారీచునితో నే చెప్పినట్లు నీవు చేయవలసినదే.

"న చే త్కరోషి మారీచ హన్మి త్వా మహ మద్య వై ।"

నీవు చేయనియెడల నిన్నిప్పుడే వధింతును. అన్నప్పుడు మారీచు డిట్లనుకొనెను—

"రామా దపి చ మర్తవ్యం మర్తవ్యం రావణాదపి ।
ఉభాభ్యా మపి మర్తవ్యే వరం రామా న్న రావణాత్ ॥"

నాకు మరణము రామునివలన తప్పకున్నది. రావణునివలనను తప్పకున్నది. ఉభయులు వధించువారే అయినప్రుడు రావణునివలన కాక, రామునివలన మరణించుట సముచితమని నిర్ణయించుకొని మాయలేడిగా వెళ్ళి కృతార్థు డయ్యెను.

ఇప్పుడు — రాక్షసులను - వారిని చంపెను. వీరిని చంపెను. అని రామునిపై బడి ఆక్రోశించు రహస్యాలకర్త ఈ మారీచసిద్ధాంతమును మరువకుండుగాక.

రామప్రభావము అనుభవముతో తెలిసికొన్న మారీచుడు రావణునితో ఇట్లు కూడ అనెను.—

"యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేంద్రియః।
అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః ॥

క్రూరబుద్ధి, కాముకత్వము, దుర్బుద్ధి కల నీవు ఎవరికి పరి
కుడవో అట్టి రాక్షసు లందరును నీమూలమున తప్పక నశింతురు.

ఇప్పుడు - రావణప్రభువు రాజ్యమును మెచ్చుకొను ర
క్షకులు ఈమారీచుని సూక్తిని గూడ గమనింతురుగాక.

ఇంకొకటి - యుద్ధములో నశించిన రాక్షసవీరులను త
లచి ప్రతిగృహమందును శోకించు రాక్షసస్త్రీలు ఏమనుకొ
వినుడు —

"కథం శూర్పణఖా వృద్ధా కరాళా నిర్ణతోదరీ!
ఆససాద వనే రామమ్ ... ।
కథం సర్వగుణైర్హీనా ... సుముఖం దుర్ముఖీ ।
రామం కామయమానా రాక్షసీ ।
జనస్యాఽస్యాల్పభాగ్యత్వా త్పలినీ శ్వేతమూర్ధజా ॥
అకార్య మపహాస్యం చ సర్వలోకవిగర్హితమ్ ।
చకారాఽప్రతిరూపా సా రాఘవాయ ప్రధర్షణమ్ ॥
తన్నిమిత్త మిదం వైరం రావణేన కృతం మహత్ ॥"

శూర్పణఖ వృద్ధురాలై దుర్ముఖియై యుండి వ మంద
శ్రీరాముని ఏమని కామించెను? జుట్టు నెరసిపోయినదయి ఈ ల
వాసుల దురదృష్టమునుబట్టి హాస్యాస్పదము, లోకగర్హితము అ
అకార్యమునకు సిద్ధపడినది. ఆకారణమునుబట్టియే రావణుడు
వైరము పెట్టుకొనెను. శ్రీరామునితో అని దుఃఖించిరి.
ఈరహస్యాలకర్త అన్నట్లు ప్రేమభిక్ష కోరి వెళ్ళినపుడు ఆ
శిక్షించుట, ఆరామలక్ష్మణుల తప్పు అని ఆరాక్షసస్త్రీలు
అనుకొనలేదు.

దీనినిబట్టి ప్రేమభిక్ష, ప్రేమభిక్ష అనునట్టి వీరిపాట
మైనది. మరియు ఆరాక్షసస్త్రీలకు భర్తలను బిడ్డలను దూర

చేసినది శూర్పణఖయే-కాని, సీతాదేవి కాదనికూడ ఆరాక్షసస్త్రీలు శోకించినందున ఆపని చేసినది సీతాదేవి అని వ్రాసిన ఈయన వ్రాత అసంబద్ధప్రలాప మని ధ్రువపడినది.

## హనుమత్సందేశము

లంకలో అశోకవనమునందు నిర్బంధములో నున్న సీతామహాదేవిని సందర్శించి ఆమె యున్న చెట్టుపై అలక్షితుడై యుండి సీతాదేవికి ఆప్యాయముగా రామకథను కీర్తించి తన్మూలమున ఆమె సన్నిధికి దిగి వచ్చినపుడు ఆమె ఇట్లు ప్రశ్నించెను.

"క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణమ్ ।
వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః ॥
యాని రామస్య లింగాని లక్ష్మణస్య చ వానర ।
తాని భూయ స్సమాచక్ష్వ ...
కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశమ్ ।
కథ మూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే ॥

రామునితో సంబంధము నీ కెక్కడ గలిగినది? లక్ష్మణుని నీవు ఎట్లు ఎరుగుదువు? నరులకును వానరులకును సమాగమ మెట్లు కలిగినది? రాముని చిహ్నములు లేవియో? లక్ష్మణుని చిహ్నములేవియో చెప్పుము. రాముని రూపము, అవయవసన్నివేశము, ఊరువులు, బాహువులు ఎట్టివో చెప్పుము. లక్ష్మణుని రూపాదులెట్టివోకూడ చెప్పుము. అని.

ఇక్కడ- "రూపం రామస్య కీదృశం। కథ మూరూకథం బాహూ..." అన్నప్పుడు, రాముని రూపము, రామునివే ఊరుబాహువులు ప్రశ్నింపబడినవి. ఆపై -"లక్ష్మణస్య చ శంస మే" అన్నపుడు చకారమునుబట్టి ఆ ఊరుబాహువులతో లక్ష్మణునికి అన్వయము కాదు. రామునికే రూపాదు లన్నియు లక్ష్మణుని విషయమై ప్రశ్నింపబడినవి.

ప్రత్యేకించి లక్ష్మణుని ఊరువులు (తొడలే) ప్రశ్నింపబడిన యెడల ప్రశ్నానుగుణముగా హనుమంతుని సమాధానముండవలెను గనుక అది యెట్లున్నదో చూతము—

'రామః కమలపత్రాక్షః సర్వసత్త్వమనోహరః ।
రూపదాక్షిణ్యసంపన్నః ...
తేజసాఽఽదిత్యసంకాశః క్షమయా పృథివీసమః ॥'

ఇట్లు శ్రీరాముని స్వరూపస్వభావములు, అవయవసన్నివేశము కీర్తించి ఆలక్ష్మణుని గూర్చి యిట్లు చెప్పెను—

'భ్రాతా చ తస్య ద్వైమాత్రః సౌమిత్రి రపరాజితః ।
అనురాగేణ రూపేణ గుణైశ్చైవ తథావిధః '

లక్ష్మణుడు అనురాగముచేత, రూపముచేత, గుణములచేత రామునివంటివాడు అని మాత్రమె చెప్పెను. ఆమన తొడలను ఎత్తుకొనలేదు. దీనినిబట్టి లక్ష్మణునితొడ లెట్టివని ఆమె ప్రశ్నించనే లేదని తేలినది. అందుచే – 'కథ మూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే' అన్నదానికి రహస్యాల కర్త చెప్పినది దురర్థమని స్పష్టమైనది. అందుచేత— 'లక్ష్మణుని తొడ లెట్టివో సీత కెట్లు తెలియును?' అను వ్రాత నిరస్తమైనది. ఈయన పాండిత్యము కూడ బయటపడినది.

శ్రీరాముని అవయవసన్నివేశము ఇట్లు చెప్పబడెను—

త్రిస్థిరః త్రిప్రలంబశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః ।
త్రితామ్రః త్రిషు చ స్నిగ్ధః గంభీర స్త్రిషు నిత్యశః ॥

అనుచు 4 శ్లోకములు గూఢార్థము కలవి కీర్తింపబడియున్నవి. అవి మహాపురుషలక్షణములుగా సాముద్రికాది శాస్త్రములలో ప్రతిపాదింపబడినవి'

"శ్రీరాముని అవయవము లన్నిటికి సాముద్రికాదులు చెప్పిన లక్షణము లన్నియు అన్వయింపజేసి తనమూలమున రామభక్తి చూపి, బృహద్వ్యాఖ్య వ్రాసి ఈఘట్టమును వ్యాఖ్యాతలు గజిబిజి చేసిరి" (పు 206) అట!

వ్యాఖ్యాతలు చేసినది రామభక్తి చూపుట కాదు. అర్థము కాని చోట, విరుద్ధార్థము తోచుచోట సరియైన అర్థము చెప్పుటే. "అప్రతిపత్తి రన్యథా ప్రతిపత్తి ర్వా వ్యాఖ్యాబీజమ్" అనునది వీరికి తెలియక ఏదో వ్రాసినారు.

'శ్రీరాముని ... గోప్యావయవములు నిజముగా అట్లున్నను వానిని ఈకోతి సావకాశముగా చూచి భావనచేసికొని ఈయాడుకూతురు మ్రోల అప్పగించుటలో ఔచిత్య మున్నదా?" అట!

ఔచిత్యము లేకపోవుట వాల్మీకి రచనలోనా? హనుమంతుని మాటలలోనా? "...ఔచిత్యము పాటించుటలోను, వాల్మీకిదే పెద్ద చేయి" (పు 1°8) అనుటచేత వాల్మీకి రచనలో ఔచిత్యము నంగీక రించినవారే వీరు.

ఇట్టివీరు— సీతాదేవి— మూర్ఛలో మునిగిన రామలక్ష్మణు లను చూచి విలపించిన ఘట్టములో తన సాముద్రికలక్షణములను కీర్తించుకొన్నట్టున్న వాల్మీకము నెత్తి— "ఇక్కడ సాముద్రికాది శాస్త్రములు తప్పుపట్టవలసిన పనిలేదు, ఆడుకూతుచే కన్నులయు చన్నులయు, తొడలయు సాముద్రికలక్షణములు చెప్పించుటలో— ఆర్ష కవిత కావున ఆక్షేపము లేదేమో॥" (23°) అని వ్రాసిరి.

ఇది— "ఔచిత్యము పాటించుటలో వాల్మీకిదే పెద్ద చేయి" అను తమ వ్రాతచేతనే ఖండింపబడిపోయినది.

సాముద్రికాదిశాస్త్రము తప్పుపట్టవలసినది కానపుడు ఆశాస్త్ర విషయములు తప్పుపట్టవలసిన వగునా?

వాల్మీకి రచనలో ఔచిత్య మొప్పుకొన్నపుడు ఆరచన లోనివే హనుమంతుని మాటలు గనుక ఆమాటలలో ఔచిత్యము నొప్పుకొని తీరవలసినదే.

"శ్రీరాముని గోప్యావయవములను ఈ కోతి సావకాశముగా చూచి అప్పగించుటలోను, ఈయాడుకూతురు మ్రోల అప్ప గించుటలోను జౌచిత్యమా?" అట!

అది, గోప్యావయవము లనుచు వానిని చూచినట్లు చెప్పుట అసంగతము. ఎట్లు చెప్పగలిగె ననగా? సాముద్రికాదిశాస్త్రదృష్టిచేత "చక్షుష్మత్తా తు శాస్త్రేణసూక్ష్మకార్యార్థదర్శినా" అని చెప్పలేదా?

"అఱుకూతురు మోళ్ల అప్పగించుటా?" అట!

'యాని రామస్య లింగాని, కీదృశం తస్య సంస్థానమ్'

అనుచు ఆమెయే విశ్వాసార్థ మడిగియున్నపుడు శ్రీ రాముని యందు గోచరించు స్వరూపస్వభావములనుబట్టి సాముద్రికాది శాస్త్రము స్ఫూర్తికి రాగా ఆశాస్త్రవిషయములను ఆమెయొద్ద వాల్మీకోక్తప్రకారము అప్పగించుటలో ఔచిత్యము కాదా?

"కామరూపి యైన గాక్షసుడుకూడ ఈభాగ మిట్లే ఈమె యొద్ద అప్పగించినంత మాత్రాన నమ్మవచ్చునా?" అట! (పు207)

ఇక్కడ చెప్పుచున్నాము—చెట్టుపైనుండి రామకథను కీర్తించి దిగివచ్చి సంభాషించుటకు ఆమెను సమీపించు హనుమంతుని రావణుడని భావించి శంకించు సీతకు- "అవన్దత మహాబాహుః" వందనము చేసెను. అంతట రామకథాకీర్తన పూర్వకముగా సమీపించు హనుమంతుని చూచి సీతాదేవి ఇట్లనెను.-

"అథ వా నైత దేవం హి య న్మయా పరిశంకితమ్ ।
మనసో హి మమ ప్రీతి రుత్పన్నా తవ దర్శనాత్ ॥"

నేను శంకించినట్టు ఏదియు కాదు. నీ దర్శనమువలన నా మనస్సునకు ప్రీతి కలిగినది. అని. అనగా —

నీదర్శనముచేత నా మనసునకు ప్రీతి కలుగుటచేత నీవు రామదూతవే అన్నది. కనుకనే—

"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మన్తఃకరణ ప్రవృత్తయః" అని చెప్పబడినది.

కనుక ఏకామరూపియో అప్పగించినను ఆ సతీమతల్లి అన్తఃకరణప్రవృత్తి అన్యథా ఉన్నపుడు నమ్మక ముండ దని తెలుపుచున్నాము.

## వాల్మీకము - సీతారాముల సాముద్రికలక్షణములు

అపరిచితుడై యుండి రామదూతగా వచ్చి రామకథాగానముతో సమీపమునకు వచ్చిన హనుమంతుని సీతాదేవి- 'క్వ తే రామేణ సంసర్గః', 'కీదృశం తస్య సంస్థానమ్' ఈ విధముగా అడిగినది. అప్పుడు శ్రీరాముని మహాపురుషలక్షణములు హనుమంతుడు చెప్పెను.

రామలక్ష్మణులు మూర్ఛలో నిశ్చేష్టులై యున్నపుడు చూచిన సీతాదేవి- తన దివ్యలక్షణములు చూచి అభిజ్ఞులు వెనుక చెప్పియున్న విషయములకు వీరి ఈ స్థితి విరుద్ధమై యుండెనని విచారించు సందర్భములో తన లక్షణములను, అభిజ్ఞుల మాటలను తలపోసికొనెను. ఆ విషయములే వాల్మీకములో చెప్పబడినవి.

ఇంకొకటి— "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే..." అని యున్నందున— క్రియవిక్రియాదిరూపవ్యవహారజ్ఞానమును కావ్యము కలిగించును. రామాయణ మాదికావ్యము.

హరిశ్చంద్రుడు తన భార్యను విక్రయింపబూనినపుడు ఆమెకు మూల్యము నిర్ణయించుచు బ్రాహ్మణు డిట్లు చెప్పెను.

"కర్మణశ్చ వయోరూపశీలానాం తవ యోషితః ।
అనురూప మిదం విత్తం గృహాణాఽర్పయ మేఽబలామ్ ॥
ధర్మశాస్త్రేషు య ద్దృష్టం స్త్రియో మూల్యం నరస్య చ ।
ద్వాత్రింశల్లక్షణోపేతా దక్షా శీలగుణాన్వితా ॥
కోటిమూల్యం సువర్ణస్య త్రయః పుంస స్తు చాఽర్బుదమ్ ॥"

వ్యా- స్త్రియో మూల్యం సువర్ణస్య కోటిః, పుంసస్తు సువర్ణస్యాఽర్బుదమ్, దశకోట్యో మూల్య మిత్యర్థః, 32దివ్యలక్షణములు కల స్త్రీపురుషుల విలువను తెలుపుటకుగూడ వాల్మీకి ప్రకటించెను. సీతాదేవిదగ్గర ప్రసంగములో హనుమంతుడు తన విషయము నిట్లు చెప్పియుండెను—

"పితా మమ మహా పిః... కేసరీ... స చ దేవర్షిభి ర్దిష్టః—
శంబసాదన ముద్ధరత్ । తస్యాఽహం హరిణః క్షేత్రే జాతో
వాతేన మైథిలి । హనుమా నితి విఖ్యాతః..." (సుందర-స 35)

నా తండ్రి కపీశ్వరుడగు కేసరి. ఆయన దేవర్షుల ఆజ్ఞ ననుస
రించి శంబసాదను డను రాక్షసుని వధించి ఆతని బాధ లేకుండ
జేసెను. అట్టి కేసరియొక్క క్షేత్రము (భార్య) అంజన - వానర
స్త్రీ. ఆమెయందు వాయుదేవునివలన జన్మించినట్టి హనుమంతుడను
నేను. అని.

అంజన=వానరస్త్రీ, కుంజరు డను వాని కూతురు.

కేసరియొక్క భార్య; రామాయణము (పూ॥ గా॥ లహరి)

ఇక ఈయన వ్రాత చూతము—

1. "ఈశతివ్రతామతల్లి కడ - ఈరంకుల హనుమయ్య స్వీయ
చరిత్ర, రామచరిత్ర ఈతీరుగ విన్నవించుకొనెను."

(పు 208)

2. "వాలితల్లి, అహల్యయనియు,- అహల్యకు, దేవేంద్రునకు
రంకుతనమువలన పుట్టిన సంతానములో వాలి యొకడనియు విని
యుంటిమి." (పు 164)

3. "హనుమంతుడు- వాలిసుగ్రీవులకు మేనల్లుడని గుర్తించి
తిమి" (పు 175)

4. "అహల్యకు గౌతముడు కట్టుకొన్న పెనిమిటి. ఆపై
ఇంద్రుడు, సూర్యుడు ఉంచుకున్న ఉపపతులు. అహల్యాగౌతము
లకు అంజన యను కూతురు పుట్టెను.

5. అహల్యకు ఇంద్రునివలన వాలి, శతానందుడు కలిగిరి.
సూర్యునివలన సుగ్రీవుడు పుట్టెను" (పు 19) అట!

ఈ 5 విషయములు విచిత్రరామాయణములోని వని, ఆవిచిత్ర
రామాయణకర్త - వీరేశలింగముగారి ముఖ్యశిష్యుడని, రావణ
సంహారానంతరము మండోదరికి విభీషణునితో వితంతువివాహముజరిగి

నట్లు వ్రాసినాడని, అట్టి విచిత్రరామాయణము తీసికొని వ్రాత సాగించిన ఈయన యోగ్యత బయటబడినదని లోగడ వివరించియే యున్నాను. ఈ రంకేల హనుమయ్య స్వీయచరిత్ర విన్నవించు కొనెను కద!

అందులో వానరోత్తము డగు కేసరి యొక్క భార్య వానర స్త్రీ యగు అంజనయని, ఆమెయందు వాయుదేవుని వలన జన్మిం చినా నని చెప్పినపుడు 'అహల్యాగౌతములకు అంజన యను కూతురు పుట్టెను.' అనుమాట ఆయన చరిత్రకు సంబంధించినది కాదు. "ఆంజనేయునకు గౌతముడు మాతామహుడు" అను మాటయు ఆయన చరిత్రకు సంబంధింపనిదే.

ఇట్టి స్థితిలో—"ఆంజనేయుని కోవ వెనుకవలె నన్న అహల్య గాథ కావలసియుండును" అని వ్రాసిన వీరు- 'ఒ చోట పౌరాణికు లవి కూతలు, బజారుమాటలు' అని పలికిన వీరు తాము అట్టి మాటలే ఆడినా రని తెలుపుచున్నాము.

2 అహల్యకు-దేవేంద్రునకు రంకుతనమువలన పుట్టిన సంతాన ములో- అహల్యకు ఇంద్రునివలన వాలి, సూర్యునివలన సుగ్రీవుడు పుట్టెను' అట!

కుంభకర్ణయుద్ధములో సుగ్రీవుని కుంభకర్ణు డిట్లనెను—

"ప్రజాపతే స్తు పౌత్ర స్త్వం తథైవర్క్ష రజస్సుతః ।
ధృతిపౌరుషసంపన్న స్తస్మా ద్గర్జసి వానర ॥"

"చతుర్ముఖబ్రహ్మజృంభణజనితఋక్షరజఃపుత్రత్వా త్సుగ్రీవస్య బ్రహ్మపౌత్రత్వమ్"

చతుర్ముఖబ్రహ్మ ఆవులించినపుడు ఋక్షరజస్సు అనువాన రుడు జన్మించెను. అతని కుమారుడ వగుటచేత సుగ్రీవా! నీవు ప్రజా

పతికి పౌతు్రిడవు. అని. ఇందులో- ఋక్షరజస్సు అను వానరుడ సుగ్రీవుని తండ్రి యని చెప్పబడినది కాని, తల్లిమాట చెప్పబడలేదు అందుచేత- 'అనుక్త మన్యతో గ్రాహ్యమ్' అను న్యాయము ననుసరించి వ్యాఖ్యాత— "ఇక్కడ ఈ విషయము అనుసంధింపతగినది' అనుచు ఒక గాధ నుదాహరించెను—

బ్రహ్మపుతు్రిడగు ఆఋక్షరజస్సు బ్రహ్మలోకములో సంచరించుచు ఒకప్పుడు అప్సరస్స్వరూపమును కలిగించు ఒకసరస్సులో మునుగుటతో అప్సరస్స్వరూపము ప్రాప్తించెను. అప్పుడాస్వరూపము చూచి మోహితులైన ఇంద్రాదిత్యులు ఇద్దరును ఆమెను హస్తముచే గ్రహించిరి. అంతట హృదయము ద్రవింప ఆయిరువుర రేతస్సులు ఆమెశరీరముమీద పడగా కుమారులిద్దరు జన్మించిరి ఆస్థితిలో నవలోకించి బ్రహ్మ వానరరూపము కలిగించు సరస్సులో ఆమెను ఆకుమారులతోకూడ స్నానము చేయ నియోగింప ఆస్నానముతో అప్సరసగా నున్న ఆఋక్షరజస్సు యథాపూర్వ వానరరూపముతోను, ఆకుమారులు వానరూపములతోను ఒప్పిరి.

వాలస్థానమునందు పడిన ఇంద్రరేతస్సువలన జన్మించినవాడు వాలి, గ్రీవస్థానమందు పడిన సూర్యరేతస్సువలన జన్మించినవాడు సుగ్రీవుడు. అయిరి. అని.

దీనినిబట్టి వాలి-సుగ్రీవుల తండ్రి యగు ఋక్షరజస్సే అవస్థాంతరమున తల్లికూడ నైన దని స్పష్టమైనది.

ఇట్టి స్థితిలో— "అహల్యకు రంకుతనములో పుట్టిన సంతానము వాలి సుగ్రీవులు, రంకుల హనుమయ్య ఆంజనేయులు." అని వ్రాయుటకు నోరెట్లు వచ్చెనో?

రామాయణము ఈనాటిది కాదు. ఏనాటినుండియో ఎందరో దీని అధ్యయనముతో అర్థజ్ఞానముతో సేవించుచున్నారు. ఈరంగ తనపుదురభిప్రాయము వీరికే కలిగినది. "బుద్ధి ర్యథావిధా యస్య

తథా మన్యతే జగత్" అన్నట్టు బుద్ధి యెట్టిదై యుండునో ఊహలును అట్టివే యగును.

వానరోత్పత్తిప్రకార మిట్లు చెప్పబడినది—

"పుత్రత్వం తు గతే విష్ణౌ రాజ్ఞ స్తస్య మహాత్మనః।
ఉవాచ దేవతా స్సర్వాః స్వయం భూ ర్భగవా నిదమ్॥
విష్ణో స్సహాయాన్ బలినః స్సృజధ్వం కామరూపిణః।
అప్సరస్సు చ ముఖ్యాసు గన్ధర్వీణాం తనూషు చ॥
కిన్నరీణాం చ గాత్రేషు వానరీణాం తనూషు చ।
యక్షపన్నగకన్యాసు ఋషివిద్యాధరేషు చ॥
సృజధ్వం హరిరూపేణ పుత్రాన్ తుల్యపరాక్రమాన్।
తే తథోక్తా భగవతా తత్ప్రతిశ్రుత్య శాసనమ్॥
జనయామాసు రేవం తే పుత్రాన్ వానరరూపిణః।

దశరథమహారాజునకు మహావిష్ణువు పుత్రుడై యుండగా, బ్రహ్మ దేవతల కందరకు ఇట్లు చెప్పెను—

మీరు మహావిష్ణువునకు సహాయభూతులనుగా బలాఢ్యులను, కామరూపులను, అప్సరసలయందు, గంధర్వాంగనలయందు, కిన్నరస్త్రీలయందు, వానరస్త్రీలయందు, యక్షకన్యలయందు, నాగకన్యలయందు, ఋషిజాతిస్త్రీలయందు, విద్యాధరస్త్రీలయందు మీతో తుల్యపరాక్రమములుగల పుత్రులను వానరాకారులను పుట్టింపవలెను. అని.

అది విని ఆశాసనము ననుసరించి అదే విధముగా వానరాకృతిగల పుత్రులను జన్మింపజేసిరి.

"వానరేంద్రం మహేంద్రాభ మిందో ర్వాలిన మాత్మజమ్।
సుగ్రీవం జనయామాస తపన స్తపతాంవరః॥
మారుత స్యాత్మజ శ్శ్రీమాన్ హనుమా న్నామ వానరః।
వజ్రసంహననోపేతో వైనతేయసమో జవే॥
సర్వవానర ముఖ్యేషు బుద్ధిమాన్ బలవానపి।

తే సృష్టా బహుసాహస్రా దశగ్రీవవధే రతాః ॥"

అందులో ఇంద్రుడు వాలిని, సూర్యుడు సుగ్రీవుని, జనింపజేసిరి. వాయుదేవున కాత్మజుడుగా హనుమంతుడు పుట్టెను.

ఇట్లు ఇంద్రాదిదేవతలు బ్రహ్మ శాసించిన విధముగా వానర సృష్టికి పూనుకొన్నట్లుండగా, ఆబ్రహ్మశాసనము అప్సరసలు, గంధర్వాంగనలు, కిన్నర-వానర-స్త్రీలు, యక్ష-నాగ-కన్యలు, విద్యాధర స్త్రీలు వీరియందే సృష్టింపబడని యుండగా గౌతమధర్మపత్నియగు అహల్యయందు ఇంద్రాదిత్యులు వాలి-సుగ్రీవులను వానరులను పుట్టించినట్లు చెప్పుటకంటె అసంబద్ధ ప్రలాప మున్నదా?

ఇంకొకటి— వాలిసుగ్రీవులు సోదరులేకద! యుద్ధఘట్టములో కుంభకర్ణుడు సుగ్రీవుని—

"ప్రజాపతే స్తు పౌత్ర స్త్వం తథైవర్క్షరజస్సుతః"

"బ్రహ్మకు పుత్రుడైన ఋక్షరజస్సునకు నీవు పుత్రుడవు అనుటలో వాలిసుగ్రీవులు ఋక్షరజస్సు పుత్రులు అని తేలినది.

ఇప్పుడు— అహల్యకు, ఇంద్రునివలన వాలి, సూర్యునివలన సుగ్రీవుడు పుట్టినట్లు చెప్పిన రహస్యాలకర్తకు పై కుంభకర్ణవచన విరోధముకూడ వచ్చినది.

సీతాన్వేషణనిమిత్తము సుగ్రీవునితో నీవు సఖ్యము చేసికొమ్మని శ్రీరామునితో చెప్పు కబంధుడు ఆ సుగ్రీవుని ఉత్పత్తి నిట్లు చెప్పెను— (అరణ్య స 72)

'స ఋక్షరజసః పుత్రః పంపా మటతి శంకితః ।
భాస్కరస్యౌరసః పుత్రః వాలినా కృతకిల్బిషః ॥"

సుగ్రీవుడు— భాస్కరుని ఔరసపుత్రుడు, ఋక్షరజస్సు పుత్రుడు. అని. ఈఋక్షరజస్సు స్త్రీ రూపముతో నున్నపుడు భాస్కరుని వలన కలుగుటచేత ఆయిద్దరకు పుత్రుడగుట సంభవించినది.

కనుక- రహస్యాలకర్త వ్రాత కబంధోక్తికి విరుద్ధము.

వాస్తవములో ఋక్షరజస్సునకు వాలిసుగ్రీవులు సుతులును, ఇంద్రాదిత్యులకు ఆత్మజులును అన్నదే నిర్ణయము.

దీనినుపపాదించుటకే వ్యాఖ్యాత ఒకగాథ నుదాహరించెను. ఆ గాథనుబట్టి పురుషుడై యున్న ఋక్షరజస్సునకే ఒక నిమిత్తమున స్త్రీత్వము ప్రాప్తించుట, అందులో అప్సరసయగుట, అప్పుడు వానర సృష్టికై ఆదేశింపబడిన ఇంద్రాదిత్యులు ఆ అప్సరస శరీరమునుండీ పూర్వోక్తప్రకారము వాలి, సుగ్రీవులను జన్మింపజేయుట జరిగెనని గ్రంథసమన్వయము చేయబడెను.

ఉత్తరరామాయణ మందిట్లున్నది—

"అథర్క్ష రజసోనామ వాలిసుగ్రీవయోః పితా ।
సర్వవానరరాజాసీ త్తేజసా ఇవ భాస్కరః ॥
సతు రాజ్యం చిరం కృత్వా వానరాణాం మహేశ్వరః ।
తత స్త్వర్క్ష రజానామ కాలధర్మేణ యోజితః ॥
తస్మి న్నస్తమితే చాథ మన్త్రిభిర్మన్త్రకోవిదైః ।
పిత్ర్యే పదే కృతో వాలీ సుగ్రీవో వాలినః పదే ॥"

వాల్మీకములో ఇన్నిచోట్ల—ప్రజాపతేస్తు' పౌత్రః స తే'

ఋక్షరజస్సుతః, "భాస్కర సౌర్యసః పుత్రః ఋక్షరజసఃపుత్రః, ఋక్షరజసోనామ వాలిసుగ్రీవయోః పితా, అని ఈ విధముగా, వాలిసుగ్రీవుల జన్మము ఋక్షరజస్సునుండి అయినట్లే ఘోషింపబడి యుండ— "ఇది వాల్మీకములో మరొక పాఠమని, వాలిసుగ్రీవులు అహల్యనుండి జన్మించినా" రని వ్రాయుట దుర్న్యయము.

ఇక్కడ రహస్యాల కర్త వ్రాత :—

"వాలిసుగ్రీవుల పుట్టుకనుగూర్చి వాల్మీకములో మరొక పాఠ మున్నది, వినోదార్థము అది కూడ వినదము— కుంభకర్ణుడు సుగ్రీవునితో అన్నమాట— సుగ్రీవా! నీవు ప్రజాపతికి పౌత్రుడవు—

"ప్రజాపతే స్తు పౌత్రస్త్వం తథైవర్క్ష రజస్సుతః" ఇదియొక వింతయైన గాథ. ఆర్షసంప్రదాయమున కిట్టివే 'బల్పం(?)కొపథములు"

అని వ్రాసి వ్యాఖ్యాత చెప్పిన పూర్వోక్త గాథను ప్రదర్శించెను. (పు. 19)

ఇక్కడ అడుగుచున్నాము—"ప్రజాపతే స్తు పౌత్రి స్త్వమ్" అని కుంభకర్ణోక్తిగా చూపబడినది వాల్మీకములోనిదే అయియుండగా, అదియే వాలిసుగ్రీవుల పుట్టుకను చెప్పునదై యుండగా "వారి పుట్టుకను గూర్చి వాల్మీకములో మరొక పాఠ మున్నది" అనుమాట కర్థమేమి?"అదికూడ వినోదార్థము విందము అనుటకర్థమేమి? వినోదార్థము కాకుండ వాలిసుగ్రీవుల పుట్టుకను చెప్పెడి మరొక పాఠము వాల్మీకములో ఏది ?

వాల్మీకోక్తిచే నిరసింపబడినది, అసభ్యముగా తమచే చిత్రింపబడినది అగు వాలిసుగ్రీవోత్పత్తిని వాల్మీకిరామాయణ రహస్యమని ఎట్లు వ్రాయకలిగెనో ?

రహస్యాలకర్త వ్రాత —

1. "అహల్యకు - దేవేంద్రునకు రంకుతనమువలన పుట్టిన సంతానములో వాలి ఒకడని వింటిమి.

2. వెనుక విశ్వామిత్రుని వెంట వచ్చిననాడు అహల్యావృత్తాంతము శ్రీరాముడు విని రాతిగా బడియున్న అహల్యను నాతిగా చేసి ఖ్యాతి పొందెను.

ఈసారి వనవాసమునకు వచ్చినపుడు ఏవేవో గృహచ్ఛిద్రములవలన మోసము చేసిన తమ్ముని శిక్షించి సాంఘికధర్మములను బట్టి తమ్ముని భార్యను ఇంటబెట్టుకొన్న వాలిని ఇందులకే చంపితినని రాముడు "ధర్మసన్నములు" పలుకుటలో అర్థము లేదు.

ఒకే యింట చెప్పరాని గొప్ప తప్పు చేసిన తల్లికి పూజా పురస్కారములు తానుగా చేయుట, ఆ యింటనే అన్నదమ్ముల కీచులాటలలో చేయిచేసికొని ఆమె కొడుకును శిక్షించుట విచిత్రము.

తల్లియైన అహల్యచేసిన తప్పులలో కొడుకైన వాలి చేసిన తప్పు ఏపాటిది?" అట!

1 వాల్మీకి విరుద్ధ మగుటచే నిర్మూలము, అసభ్యము అగు ఆధోరణి వదలవలసినదని చెప్పియున్నాము.

2 అహల్యను శ్రీరాముడు నాతిగా చేయకపూర్వము ఆమె ఏస్థితిలో నున్నది? రాతిగా పడి యున్నది. ఎందుచేత? గౌతమశాపము చేత? దానికి కారణము? "ఇంద్రుడు గౌతమ రూపముతో అహల్య వద్దకు వచ్చి ఇది ఋతుకాలమా కాదా? అన్న చర్చతో పని లేదని కలిసెను" (పు21) అది కారణము అయితే, ఋతుకాలము కానప్పుడు కలిసెను గనుక సంతాన మప్పు డసంభవము.

ఇంకొకటి. వానరసృష్టికొరకు ఇంద్రాదిదేవతలకు చేసియున్న పూర్వోక్త బ్రహ్మశాసనమునకును విరుద్ధము,

తన్ను పడగొట్టిన శ్రీరాముని ఎన్నోవిధముల ఆక్షేపించిన వాలి- "నాతల్లి అహల్య చేసిన తప్పులలో నే చేసిన తప్పు ఏపాటిది? ఆమెను పూజించి నన్ను వధించిన నీవు ధర్మపన్నములు పలుకుటలో అర్థములేదు"అనుచు ఈరహస్యాలకర్తవలె ఆక్షేపింపకుండుటచే కూడ వాలికి అహల్య తల్లికాదని, అది దుర్వాదమని ధ్రువపడినది.

"రాక్షసవధతో మనకు పనిలేదు. వ్యర్థముగా హింసాధోరణిలో ప్రవర్తింపరాదు. అని ఎన్నో రీతుల సీత మొత్తుకొన్నను ఆమె మాట పెడచెవిని బెట్టి ఘోరమైన మారణకాండ కావించి శ్రీరాముడు తత్ఫలితము అనుభవించెను." (154)

అట! వీరికి సీతాదేవి శ్రీరామునితో అన్నమాటలు తెలుపుచున్నాము:- "అపరాధం వినా హన్తుం లోకాన్ వీర న కామయే" అపరాధము లేనప్పుడు హింసించుట కిష్టపడను.

"క్షత్రియాణాం తు వీరాణాం వనేషు నిరతాత్మనామ్ ।
ధనుషా కార్య మేతావ దార్తానా మభిరక్షణమ్ ॥"

వనచారులగు క్షత్రియవీరులకు ఆయుధగ్రహణము ఆర్తులను రక్షించుటకు మాత్రమే.

అనుచు ఆర్తరక్షణము కర్తవ్యమే అని ఆమె తెలిపినది.

"స్త్రీచాపలా దేత దుదాహృతంమే, ధర్మం చ వక్తుం తవ క స్సమర్థః । విచార్య బుద్ధ్యా తు సహానుజేన, యద్రోచ తే తత్కురు మా చిరేణ ॥"

స్త్రీస్వభావమును బట్టి ఇట్లన్నాను. నీకు ధర్మము బోధింపగల వారెవరు? అనుజునితో విచారించి ఏది యుక్తమో అది చేయగోరె దను. అనగా శ్రీరాముడనెను—

"హిత ముక్తం త్వయా దేవి స్నిగ్ధయా సదృశం వచః ।
కిన్తు వక్ష్యా మ్యహం దేవి త్వమైవోక్త మిదం వచః ॥
ధార్య తే క్షత్రియై శ్చాపో నార్తశబ్దో భ వే దితి ।
తే చార్తా దండకారణ్యే మునయ శ్సంసితవ్రతాః ॥
మాం సీతే స్వయ మాగమ్య శరణ్యం శరణం గతాః ॥"

దేవీ! నీవు హితము చెప్పినావు. నేను చెప్పనదేమనగా-క్షత్రి యులకు ఆయుధగ్రహణము ఆర్తనాదము లేకుండుటకై అవశ్యక మని నీవే చెప్పియున్నావు. కనుక ఆర్తమునిజనరక్షణము కర్తవ్యమై యున్నది.

"కాలేకాలే చ నియతా నియమై ర్వివిధై ర్వనే ।
భక్ష్యన్తే రాక్షసై ర్భీమై ర్నరమాంసోపజీవిభిః ॥"

బహువిధనియమములతో కాలము గడుపునట్టి మునిజనమును భీకరులైన రాక్షసులు భక్షించుచున్నారు.

అట్టి దురవస్థకు పాలగు దండకారణ్యవాసు లగు మునిజనులు నన్ను శరణు పొందిరి. వారు తమ తపఃప్రభావముచేతనే ఆ పీడ లేకుండ చేసికొనలేరా ? అందువేమో, వారిట్లు మొరపెట్టినారు —

చిరార్జితం చ నేచ్ఛామ స్తపః ఖండయితుం వయమ్ ।
బహువిఘ్నం తపో నిత్యం దుశ్చరం చైవ రాఘవ ॥
తేన శాపం న ముంచామో భక్ష్యమాణా స్తు రాక్షసైః ।

బహువిఘ్నము, దుశ్చరము, చిరార్జితము అగు తపస్సును వ్యర్థము చేయలేక రాక్షసులచే భక్షింపబడుచుండియు, శాపము పెట్టలేకున్నాము. అని.

ఇట్టి మునిజనుల ఆర్తిని తొలగింపవలసివచ్చినది. అనుచు తెలిపెను. ఇక్కడ—

"క్షత్రియాణాం తు శూరాణామ్...
ధనుషా కార్య మేతావ దార్తానా మభిరక్షణమ్"

అని రామప్రభువుతో చెప్పినదే సీతాదేవి, మునిజనులకు ఆ ఆర్తి రాక్షసులు భక్షించుచుండుటవలన ప్రాప్తించెను. దుష్టశిక్షణ కాకుండ ఆర్తరక్షణ కానేకాదు. ఇట్టి స్థితిలో—

'రాక్షసవధతో మనకు పనిలేదు. వ్యర్థముగా హింసాఘోరణిలో ప్రవర్తింపరాదు. అని సీత మొత్తుకొన్నను ఆమె మాట పెడ చెవిని పెట్టెను.'

అను వ్రాతకు అర్థ మున్నదా? దీనినిబట్టి—

'దండకారణ్యవాసులను దండింపవలె నని బ్రాహ్మణులు తన్ను గోరి రన్న వంకతో మునివృత్తిలో ఉన్నట్టు నటించిన శ్రీరాముడు' (పు 164)

అను వ్రాత నిరస్తము.

'వాలివధలో శ్రీరాముడు తాను చేసింది తప్పు కాదని సమర్థించుకొనజూచెను– పరదారను గనయుటతో వాలి తప్పు చేసె నని ఒక ధర్మముగా– వాలి మృగము కావున వేటలో ఏమృగము నైన చాటుమాటుగా ఉండి యైన చంపవచ్చు నని మరొక ధర్మముగా – హేతువాదము రెండు త్రోవలలో నడపెను.

తాను వధించుట తప్పు కాదనవలసివచ్చినపుడు వాలి మృగములలో చేరునా? మృగములలోనే చేరినప్పుడు మృగములకు వావి వరుస లెక్కడివి?

ఒకసారి మృగముగా, ఇంకొకసారి మానవధర్మములను పాటింపవలసినవానిగా చిత్రించుటలో అర్థము లేదు" (పు 16) అట!

వాలి ఐహికాముష్మికోపయుక్త మగు ధర్మాధర్మజ్ఞానము కలవాడే. ఆతడు సంధ్యావందనము చేసినట్టు చెప్పబడినది.

"అపక్షిగణసంపాతా ద్వానరేన్ద్రో మహాజవః ।
క్రమశ స్సాగరాన్ సర్వాన్ సంధ్యాకాల మవన్దత ॥
సభాజ్యమానో భూతైస్తు ఖేచరైః ఖేచరో హరిః ।
పశ్చిమం సాగరం వాలీ ఆజగామ సరావణః ॥
తత్ర సన్ధ్యా ముపాసిత్వా స్నాత్వా జప్త్వా చ వానరః ।
ఉత్తరం సాగరం ప్రాయా ద్వహమానో దశాననమ్ ॥"

ఈవిధముగా వాలి - రావణుని చంక నిరికించుకొనియే మహా వేగముతో సర్వసముద్రములను సేవించుచు, స్నానము, సంధ్యా వందనము, జపము చేయుచుండెడివాడు. కనుక మానవధర్మములను పాటించినవాడే. అని తెలుపుచున్నాము.

ఆ వాలి ఈ విధముగా పలికెను —

"వయం వనచరా రామ మృగా మూలఫలాశనాః ।
ఏషా ప్రకృతి రస్మాకం పురుష స్త్వం నరేశ్వరః ॥"

మేము వనచరులమై ఫలాదులను భక్షించు మృగములము. అన అప్పుడు శ్రీరాము డిట్లనెను--

"న హి మాం కేవలం రోషా త్త్వం విగర్హితు మర్హసి ।
సర్వథా ధర్మ ఇత్యేవ ద్రష్టవ్య స్తవ నిగ్రహః ॥
త దలం పరితాపేన ధర్మతః పరికల్పితః ।
వధో వానరశార్దూల న వయం స్వవశే స్థితాః ॥

నీవు కేవల రోషముతో నన్ను గర్హింపతగదు. నిన్ను నిగ్రహించుట సర్వథా ధర్మ మనియే నీవు గ్రహింపవలెను. ఈవిషయమై నీవు పరితాపము పెట్టుకొనవద్దు. మేము శాస్త్రపరతంత్రులముకాని స్వతంత్రులము కాము సంధ్యావందన – రాజ్యపాలనాదులను నియతముగా అవలంబించుచున్న నీవును శాస్త్రాధీనప్రవృత్తి కలవాడవే అయి యున్నావు.

శ్రుణు చాప్యపరం భూయః కారణమ్ ...
న మే తత్ర మనస్తాపో న మన్యు ర్హరియూథప ॥

ప్రతిచ్ఛన్నాశ్చ దృశ్యాశ్చ గృహ్ణన్తి సుబహూన్ మృగాన్."

నీవన్నమాటలకు నాకు మనస్తాపముకాని, కోపముకాని కలుగ లేదు. ఇంకొకటికూడ చెప్పుచున్నాను. మేము మృగముల మను చున్నావు గనుక ప్రచ్ఛన్నముగాను, ప్రత్యక్షముగాను మృగములను నిగ్రహింతురు కాబట్టి ఆక్షేప మేమి? అని.

"ఏవ ముక్త స్తు రామేణ వాలీ ప్రవ్యథితో భృశమ్ ।
న దోషం రాఘవే దధ్యౌ ధర్మేఽధిగతనిశ్చయః ॥
ప్రత్యువాచ తతో రామం ప్రాంజలి ర్వానరేశ్వరః ।
య త్త్వ మాత్థ నరశ్రేష్ఠ తత్తథైవ న సంశయః ।
య దయుక్తం మయా పూర్వం ప్రమాదా దుక్తమప్రియమ్ ॥
తత్రాపి ఖలు మే దోషం కర్తుం నార్హసి రాఘవ ।

శరాభితప్తేన "విచేతసా మయా ప్రభాషితస్త్వం య దజానతా మయా । ఇదం మహేన్ద్రోపమభీమవిక్రమ ప్రసాదిత స్త్వం క్షమ మే నరేశ్వర ॥"

రామప్రభువుచేత ప్రబోధింపబడిన వాలి పశ్చాత్తప్తుడై ధర్మావ గతి కలవాడై, రామునియందు దోషభావన తొలగి నమస్కరించుచు ఇట్లు పలికెను—— శ్రీరామా! నీవు చెప్పినది నిజమే. నిన్ను నేను ప్రమాదముచేత అయుక్తముగా పరుషముగా అన్నాను. బాణా ఘాతముచేత మనస్సు చెదరి అజ్ఞానముచే నే నన్నమాటలను ప్రస న్నుడవై క్షమింపుము. అని.

ఇట్లు నాడు ఆ వాలి శ్రీరాముని దూషించుట అజ్ఞాన మూలక మని, క్షమింపు మని పశ్చాత్తాపముతో చెప్పుకొనెను.

నేడు ఈరహస్యాలకర్త అజ్ఞానమూలకము లైన ఆ వాలి దూషణ ములనేకాక, ఆవాలియైనను అనని అసభ్యప్రసంగముకూడ చేసి (వాలి తల్లి అహల్య అని) ఆనందించుచుండెను. ఇది దుర్నయము.

## శ్రీరామునిగూర్చి తార వాలికి చెప్పిన విషయము

రహస్యాలకర్త వ్రాత—

"యుద్ధములో ఏదో శంకించి పోవలదని భార్య, తార బ్రతి మాలినను, వాలి ఆమె మాట వినక యుద్ధమునకేపోయి దెబ్బతినెను. (పు 154)

ఆ తార యుద్ధమునకు పోవద్దనుచు కారణ మిట్లు చెప్పినది—

"రామః పరబలామర్దీ యుగాన్తాగ్ని రివోత్థితః ।
నివాసవృక్షః సాధూనా మాపన్నానాం పరా గతిః ॥
ఆర్తానాం సంశ్రయ శ్చైవ యశస శ్చైవ భాజనమ్ ।
జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః ॥
త త్క్షేమో న విరోధ స్తే సహ తేన మహాత్మనా ।

శ్రీరాముడు పరబలమర్దనుడు; యుగన్తాగ్నివంటివాడు; సాధు వుల పాలిటి కల్పవృక్షము; ఆపన్నరక్షకుడు; ఆర్తజనశరణ్యుడు; జ్ఞాన విజ్ఞానసంపన్నుడు. అట్టి ఆ మహాత్మునితో విరోధము నీకు క్షేమ కరము కాదు. అని ఆ వాలి భార్య తార ఉపదేశించినది.

మండోదరి కూడ రావణునకు చెప్పిన విషయము—

"మరియొకడు రావణుడు. వీరి ధర్మపత్నులు వీరికి అనేకాంశములు బోధించిరి. వీరి యుద్యమములు మానుకొనవలె నని ప్రార్థించిరి. వీరిలో ఒకడును వినలేదు. దానిఫలిత మనుభవించిరి"

"వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః ।
అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్ ॥
తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః ।
శ్రీ వత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః ॥
మానుషం రూప మాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః ।
సర్వైః పరివృతో దేవై ర్వానరత్వ ముపాగతైః ॥
సర్వలోకేశ్వర శ్శ్రీమాన్ లోకానాం హితకామ్యయా ॥"

ఇది రావణునకు మండోదరి చేసిన ఉపదేశము—

ఈ శ్రీరాముడు సనాతనపరమాత్మ; ఆదిమధ్యాన్తరహితుడు; శంఖచక్రగదాధరుడు; అట్టి శ్రీమహావిష్ణువు మానుషరూపము ధరించి వానరాకృతి ధరించిన సర్వదేవతలచే పరివేష్టితుడై లోక హితము కోరి ఆవిర్భవించెను.

"యదైవ హి జనస్థానే రాక్షసై ర్బహుభి ర్వృతః ।
ఖరస్తు నిహతో భ్రాతా తదా రామో న మానుషః ॥
యదైవ నగరీం లంకాం దుష్ప్రవేశాం సురై రపి ।
ప్రవిష్టో హనుమాన్ వీర్యా త్తదైవ వ్యథితా వయమ్ ॥
క్రియతా మవిరోధశ్చ రాఘవే ణేతి య న్మయా ।
ఉచ్యమానం న గృహ్ణాసి తస్యేయం వ్యుష్టి రాగతా ॥"

14 వేల రాక్షసవీరులతో కూడియున్న ఖరాసురుని జనస్థానమునందు ఎప్పుడు వధించెనో అప్పుడే రాముడు మనుష్యుడు కాడని తెలియలేదా? దేవతలకైనను ప్రవేశింపశక్యముకాని లంకానగరిలో పరాక్రమముతో హనుమంతుడు ప్రవేశించినపుడే అందరము భయపడలేదా? శ్రీరామునితో విరోధము లేకుండ చేసికొమ్మని నే నెంత చెప్పినను వినకపోతివి. అందుచేతనే ఈముప్పు వచ్చినది. అని.

ఇట్లు శ్రీరాముడు లోకరక్షకుడని, పరమాత్మయని, ఆయనతో విరోధము వద్దని వాలికి తారయు, రావణునకు మండోదరియు సత్య ముపదేశింప దానిని తిరస్కరించి రాముని ధిక్కరించి, దాని ఫలిత మనుభవించిరికద!

"పత్నుల మాటలు వినక దాని ఫలిత మనుభవించిరి" అని వ్రాసిన వీరు— "తమ పత్నుల మాటలు వినవలసినవే." అని తేల్చిన వీరు– ఆ తారా– మండోదరీ— వాక్యములను ప్రదర్శించుటకే ముఖము చెల్లనివీరు శ్రీరామప్రబోధముతో ప్రశ్చాత్తప్తులై నే గన్న మాటలను తలుంపవలసినదని వాలి ప్రార్థింపగా, అట్టి పశ్చాత్తాపము

లేక, ఆ వాలి దూషణవాక్యములతోనే శ్రీరాముని ధిక్కరించిన వీరు- శ్రీరాముని అనేకవిధముల దుర్భాష లాడిన వీరు- తాము చెప్పినట్టే దాని ఫలిత మనుభవింపక తప్పునా?

ఈ మండోదరి మాటలను నాడు రావణుడు వినిపించుకొనకుండుటకేమి కాని, నేడు ఈ రహస్యాలకర్త వినిపించుకొన్నాడా?

ఆమె మాటలు వినిపించుకొనకుండుటలో ఈయన రావణునితో సమానుడై యుండియు — "ఆ మాటలు వినక దాని ఫలమనుభవించెను" అనుచు రావణునిపై నేరము మోపుట హేయము కాదా?

"శోకరక్తేన శోకా దున్మత్త ఇవ లక్ష్యతే!" అన్న వాల్మీకి వాక్యమునకు వ్యాఖ్యాతలు విచిత్రమైన స్వారస్యము వెల్లడించిరి. శోకరక్తేక్షణుడు వలె, ఉన్మత్తునివలె, విలపించువానివలె ఇత్యాదిగ భావింపవలెనట! వాస్తవములో ఆతడు శోకాదులు కలవాడు కాడట! అట్లు నటించినాడట!

ఇంతటి గూఢభావము లున్ననాడు, పరమాత్మస్వరూపమే రామావతార మన్ననాడు మానవుల కాపాత్రలు ఆదర్శము లెట్లగును?" (పు 145) అట!

ఇక్కడ చెప్పుచున్నాము—"సీతావియోగదశలో మతిపోయి, చెట్టుచెట్టును పుట్టపుట్టను పిలిచిపిలిచి, గంతులు వేయుచు, చిందులు త్రొక్కుచు ..."

అని వ్రాసిన మీకు "ఉన్మత్త ఇవ" ఇక్కడ ఇవ శబ్దముండగా మతిపోయి అని వ్రాయుట తప్పు. అని తెలిసెనా? ఈ "ఇవ" నే ఇతరవచనములతో కూడ అన్వయించుట వాల్మీకి తాత్పర్యమని,— "రాజా రతికరః పితుః |... రావణస్య వధార్థిభిః అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"

ఇత్యాది వచనములలో శ్రీమహావిష్ణువే శ్రీరాముడుగా అవిర్భవించె నని చెప్పినవాడగుటచే శ్రీరామునిలో కనబడు శోకాదులు

మనుష్యచేష్టాభినయమాత్రములే అన్నది వాల్మీకి తాత్పర్యమని, ఆ తాత్పర్యమునుబట్టి "ఇవ" ను అన్యత్ర అన్వయింపవలసియున్న దని వ్యాఖ్యాతలు చెప్పినారు. అట్టి తాత్పర్యజ్ఞానములేక వ్యాఖ్యాతలను నిరసించుట అన్యాయము.

"వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః ।
... ... రామో న మానుషః ॥"

అని మండోదరి బోధించియుండ— "పరమాత్మస్వరూపమే రామావతార మన్ననాడు ... అనుచు రాముడు పరమాత్మస్వరూపము కాడని చెప్పు వీరుకూడ—

"మానుషం కృపణం రామ మేకం శాఖామృగాశ్రియమ్ ।
సమర్థం మన్యసే కేన త్యక్తం పిత్రా వనాశ్రియమ్ ॥"

రామునితో యుద్ధము నీకు తగదని చెప్పిన మాల్యవంతునితో వనవాసియై వానరుల కాశ్రయమైన మనుష్యుడయిన ఒక్క రాముని సమర్థుడని నీ వెట్లు తలచుచున్నావు? అని పలికిన ఆనాటి రావణుని తో సమానులే అని స్పష్టమగుచున్నది.

—♦ రావణుడు తన తపస్సు వ్యర్థమైపోయెనని చింతించుట ♦—

సర్వం తత్ఖలు మే మోఘం య త్తప్తం పరమం తపః ।
య త్సమానో మహేన్ద్రేణ మానుషేణ వినిర్జితః ॥

నామహాతపస్సు అంతయు వ్యర్థమైపోయినది. మహేంద్ర సమానుడ నగు నేను మనుష్యునిచేత నిర్జింపబడితిని. అని. ఇక్కడ రహస్యాలకర్త—

విష్ణువు, లక్ష్మియు- నీవు సీతగా పుట్టుము. నేను రాముడనుగా అవతరింతును. అని కూడ బలుకుకొనిరట! ఈ కున్నగడలో సీతయందు రావణునకు అనుచితమైన అనురాగమును బుట్టించి, వానిని మోహాంధునిగా చేసి తన్మూలమున వాని తపోబలమును దూలించి సీతాపహరణముద్వారా అతనిని రూపుమాపి దేవతా కార్యము తీర్చెనట. (ు 14)

అని వ్రాయుటచేత కొంచెము బోధింపవలసియున్నది. విష్ణువు రాముడుగా బుట్టలేదా? లక్ష్మి సీతగా బుట్టలేదా? సీతను రావణుడు అపహరింపలేదా? ఆమెయందు అనుచితానురాగము పెట్టుకొనలేదా? దానివలన రావణుని తపశ్శక్తి క్షీణింపలేదా? నా తపోబల మంతయు వ్యర్థమైపోయినదని ఆరావణుడే యుద్ధములో మొదట విరథుడై ఓడి పోయినప్పుడు చింతించియుండలేదా? రావణసంహారముచేసి దేవతా కార్యము తీర్చ లేదా? ఇందులో జరుగని దేమున్నది? 'కూడబలుకు' కొనినారట?' "దేవతాకార్యము తీర్చెనట" అనువ్రాతతో ఆ విష యము అసత్యమందురా? అయితే రామాయణజ్ఞానము మీకున్నది బయటపడినది కనుక మీ వ్రాత తోసివేయవలసినదే.

## శ్రీ రా ము డు — సు గ్రీ వు ని తో స ఖ్య ము

రామలక్ష్మణులు సీతాన్వేషణతత్పరులై అరణ్యసంచారము చేయుచుండ, శాపగ్రస్తుడై యున్న కబంధుడు వారిని హింసింప నుద్యమించెను. అప్పుడు రామలక్ష్మణులు ఆతని భుజములను ఛేదించిరి. అట్లు భుజచ్ఛేద మైనపుడు శాపవిముక్తియని చెప్పబడినది కనుక నేను శాపవిముక్తుడనైతి నని స్వస్వరూపము ధరించి యున్నపుడు ఆతనితో సీతావిషయకప్రసంగము చేయగా సీతాప్రాప్తికై ఉపాయము నేను చెప్పెదనని కబంధు డిట్లుపదేశించెను—

'శ్రూయతాం రామ వక్ష్యామి సుగ్రీవో నామ వానరః ।
భ్రాత్రా నిరస్తః క్రుద్ధేన వాలినా శక్రసూనునా ॥
సత్యసన్ధో వినీతశ్చ ధృతిమాన్ మతిమాన్ మహాన్ ।
వయస్యం త్వం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ ॥
స చ తే నావమన్తవ్య స్సుగ్రీవో వానరాధిపః ॥
కృతజ్ఞః కామరూపీ చ సహాయార్థీచ వీర్యవాన్ ।
భాస్కర స్యౌరసః పుత్రో వాలిన కృతకిల్బిషః ॥"

సుగ్రీవు డను వానరు డుండెను. ఆతడు సోదరు డగు వాలి చేత నిరసింపబడెను. ఇక్కడనుండియే వెళ్ళి సత్యసంధుడు, వినీతుడు, మతిమంతుడు, కృతజ్ఞుడు, కామరూపి అగు అతనితో సఖ్యము చేసి కొనుము. ఆతనిద్వారా నీకార్య మగును. ఇట్లు చెప్పి, సుగ్రీవు డుండెడి స్థానము ఋష్యమూక మని, అది పాపాత్ములు అధిష్ఠింప శక్యముకాని దని, దానికి మహాగుహ ఉన్నదని చెప్పి—

"తస్యాం వసతి ధర్మాత్మా సుగ్రీవ స్సహ వానరైః"

ఆగుహాయందు ధర్మాత్ముడగు సుగ్రీవుడు కొందరు వానరులతో కలిసి యున్నాడు అని ఉపదేశించెను.

ఇట్లు ఏకపక్షమునకును చెందనివాడును, రామసాన్నిధ్యమున శాపవిముక్తుడై పరలోకమునకు వెళ్ళుచుండువాడును అగు కబంధుడు సుగ్రీవుడు—ధర్మాత్ము డని, సత్యసంధు డని, ఆతనితో సఖ్యము చేసికొమ్మని బోధించెను.

ఆ మాటపై రామలక్ష్మణులు ఋష్యమూకముదగ్గరకే వెళ్ళిరి. ధనుర్ధరులై వచ్చు వీరిని చూచి శంకించు సుగ్రీవుడు వీరి విషయము తెలిసికొమ్మని హనుమంతుని పంపగా ఆయన భిక్షు రూపము ధరించి వారిని సమీపించి సముచితప్రసంగము చేసి వారి వృత్తాంతము తెలిసికొని తన వృత్తాంతయు నిట్లు చెప్పెను—

"సుగ్రీవో నామ ధర్మాత్మా కశ్చి ద్వానర పుంగవః ।
వీరో వినికృతో భ్రాత్రా జగ ద్భ్రమతి దుఃఖితః ॥
ప్రాప్తో ఽహం ప్రేషిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా ।
రాజ్ఞా వానరముఖ్యానాం హనుమా న్నామ వానరః ॥
యువాభ్యాం స హి ధర్మాత్మా సుగ్రీవ స్సఖ్య మిచ్ఛతి ।"

ధర్మాత్ముడైన సుగ్రీవు డను వానరవీరుడు భ్రాత చేత వెడల గొట్టబడి, దుఃఖితుడై జగత్పరిభ్రమణము చేయుచున్నాడు. అట్టి ఆయనచేత పంపబడి హనుమంతు డనబడు నేను మీ సన్నిధికి వచ్చి

తిని. ధర్మాత్ముడైన ఆ సుగ్రీవుడు మీ ఉభయుల సఖ్యమును కాంక్షించుచుండెను. రామలక్ష్మణు లిట్లనిరి-

విదితా నో గుణా విద్వన్ సుగ్రీవస్య మహాత్మనః ।
త మేవ చావాం మార్గావ స్సుగ్రీవం ప్లవగేశ్వరమ్ ॥
యథా బ్రవీషి హనుమన్ సుగ్రీవవచనా దిహ ।
త త్తథా హి కరిష్యావో వచనా త్తవ సత్తమ ॥

మహాత్ముడైన సుగ్రీవుని గుణములు తెలిసికొన్నాము. ఆ సుగ్రీవుని మాటనుబట్టి నీవెట్లు చెప్పితివో అట్లు చేసెదము. ఆ సుగ్రీవునే అన్వేషించుచున్నాము.

అని చెప్పి హనుమంతునిద్వారా సుగ్రీవుని కలిసికొని పరస్పరము సంభాషించుకొని — "గచ్ఛ శీఘ్రమితో రామ సుగ్రీవం... వయస్యం తం కురు క్షిప్రమ్... దీప్య మానే విభావసౌ" అని కబంధు డుపదేశించిన విధముగా సుగ్రీవునితో అగ్నిసాక్షికముగా - "ఏకం దుఃఖం సుఖం చ నౌ" అని సఖ్యము చేసికొనిరి. తరువాత సుగ్రీవుడు-

"అహం వినికృతో రామ చరామీహ భయార్దితః ।
హృతభార్యో వనే త్రస్తః...
వాలినో మే మహాభాగ భయార్త స్యాఽభయం కురు"

భార్య నపహరించి వైరము వహించిన వాలివలన భీతుడనై ఇక్కట్ల పడియున్నాను. భయార్తుడనై యున్న నాకు అభయప్రదానము చేయుము. అని యాచించెను.

అప్పుడు అభయ మిచ్చి శ్రీరాముడు—"కిం నిమిత్త మభూ ద్వైరం శ్రోతు మిచ్ఛామి తత్త్వతః" మీకు వైరకారణమే మో యథార్థము చెప్పు మని అడుగ సుగ్రీవుడు వివరముగా చెప్పెను. (అది మా రామాయణతత్త్వకథనములో చూడవలెను.)

తరువాత వాలిని నిగ్రహించి ఆతడు తన్ను ఆడిన మాటలకు సమాధానములు చెప్పి పశ్చాత్తప్తుని చేసి "క్షమ మే వరేశ్వర" నామాటలు క్షమింపుమని శ్రీరాముడు ప్రార్థింపబడెను. తరువాత-

సుగ్రీవా! పురాకృతములనుబట్టి అవశ్యంభావియైన బుద్ధి మోహముచే నీయందు శత్రుభావనకు లోనైపోయిన నన్ను దోషిగా భావింపకుండుము.

"ప్రతిపద్యత్వ మద్యైవ రాజ్య మేషాం వనౌకసామ్ ।
ఇమాంచ మాలా మాధత్స్వ దివ్యాం సుగ్రీవ కాంచనీమ్ ॥"

ఈవనచరరాజ్యమును నీవిప్పుడే గ్రహింపుము. దివ్యమైన ఈకాంచనమాలను స్వీకరింపుము. అని సుగ్రీవుడు ప్రేమింపబడెను.

"సుషేణ దుహితా చేయ మర్థసూక్ష్మవినిశ్చయే ।
ఔత్పాతికే చ వివిధే సర్వతః పరినిష్ఠితా ॥
య దేషా సాధ్వితి బ్రూయా త్కార్యం త న్ముక్తసంశయమ్ ।
న హి తారామతం కించి దన్యథా పరివర్తతే ॥"

ఈతార- సూక్ష్మార్థనిశ్చయములోను,ఉత్పాతవిషయజ్ఞానము లోను సమర్థురాలు. అట్టి ఈమె ఏపని మంచిదని చెప్పునో ఆపని నిస్సంశయముగా చేయవలసినదే. తారామతము తిరుగులేనిది. అని సుగ్రీవుడు బోధింపబడెను.

"రాఘవస్య చ తే కార్యం కర్తవ్య మవిశంకయా ।
స్యా దధర్మో హ్యకరణే త్వాం చ హింస్యా దమానితః ॥"

శ్రీరాముని కార్యము నీవు నిశ్శంకగా చేయవలసినదే. చేయనియెడల అధర్మము కలుగును.

'మమ ప్రాణైః ప్రియతరం పుత్రం పుత్ర మివౌరసమ్ ।
... ... ... సర్వతః పరిపాలయ ॥'

నాకు ప్రాణప్రియుడైన ఈ అంగదుని సర్వవిధముల పరి పాలింపుము. అని ఉపదేశించుట జరిగినది,

రహస్యాలకర్త వ్రాత— "సుగ్రీవుడు రామలక్ష్మణులకు ఆప్తుడుగా అభినయించి, తన పనులను తీర్చుకొని, రామకార్యము

మరచుట, సీతకై విలపించు శ్రీరామునకు సుగ్రీవుని శీలము కంటక మగుట, రాముడు చేసిన దురాగతములకు ప్రతిఫల మనవచ్చును.
(పు 177) అట!

రాముడు చేసినవి దురాగతము లని రాక్షసు డగు మారీచుడు కూడ అనలేదు సరికదా— 'రామో విగ్రహవాన్ ధర్మః' రాముడు ధర్మస్వరూపుడే. అనిస్వానుభవముతో రావణునకు బోధించెను. కనుక ఈయనమాట మారీచునిచే గర్హింపబడినదే.

వాలి భార్య తార శ్రీరామునిగూర్చి యిట్లు చెప్పినది—

"నివాసవృక్ష స్సాధూనా మాపన్నానాం పరా గతిః ।
ఆర్తానా మాశ్రయ శ్చైవ ... ..."

సాధువులకు కల్పవృక్షము, ఆపన్నులకు శరణ్యము, ఆర్తులకు ఆశ్రయము. అట్టి శ్రీరామునితో విరోధము వద్దు. అని.

'వాలి ఆమె మాట వినక యుద్ధమునకే పోయి దెబ్బతినెను' అని వ్రాసిన ఈరహస్యాలకర్త - ఆమె మాట వినెనా? వాలి చేసినట్లే తాను చేసి వాలి నవుటకు సిద్ధపడవద్దా? వినక పోవుటే కాదు, శ్రీరాముని దూషించిన ఈయన దురాగతములకు ఈయన చెప్పినట్టి ప్రతిఫల మున్న దన్నమాటే.

"అన్నగారి సందేశము వినిపించిన లక్ష్మణునిపై సుగ్రీవునకు కోపము వచ్చినదట! ఎవడో నామీద నేరములు బోధించి యుండును. రామలక్ష్మణులవలన నాకేమియు భయములేదు. నేనేమియు తప్పు చేయలేదు. చెలికాడై యుండి నిష్కారణముగ నన్ను గోపించినపుడు నేనూరకుందునా?" అన్నాడు. అట!

శ్రీరాముడు— నిర్దిష్టసమయము దాటుచుండుట, సీతాన్వేషణకై సుగ్రీవుని ప్రయత్న మేమియు కనబడకుండుట చూచి, సుగ్రీవునకు తొందర కలిగించు సంకల్పముతో లక్ష్మణునిద్వారా కఠినముగానే సందేశ మంపెను. లక్ష్మణుడు కుపితుడై వెళ్ళగా అంగదుడు

చూచి కొందరు మంత్రులతో కూడియున్న సుగ్రీవునకు తెలిపెను. అప్పుడు సుగ్రీవుడు-

"లక్ష్మణం కుపితం శ్రుత్వా ముమోచాసన మాత్మవాన్"
లక్ష్మణుడు కుపితుడైనట్టు విని భయముతో ఆసనమునుండి దిగ్గున లేచెను.

"న మే దుర్వ్యాహృతం కించి న్నాపి మే దురనుష్ఠితమ్ ।
లక్ష్మణో రాఘవభ్రాతా క్రుద్ధః కిమితి చిన్తయే ॥"

నేను వారి విషయమై తప్పుమాట అనలేదు; తప్పుపని చేయలేదు. లక్ష్మణుడు ఎందుకై క్రుద్ధు డయ్యెనా అని చింతించుచున్నాను.

"న ఖల్వస్తి మమ త్రాసో లక్ష్మణా న్నాపి రాఘవాత్ ।
మిత్రం త్వస్థానకుపితం జనయ త్యేవ సంభ్రమమ్ ॥"

నేను నిరపరాధి నగుటచేత అపరాధమూలకమైన భయము రామలక్ష్మణులవలన నాకు లేదు. కాని మిత్రుడు కుపితు డగుట భయమును కలిగించుచునే యున్నది. "ఈతడు మిత్రద్రోహి" అను లోకాపవాదభయమన్నమాట.

"అతో నిమిత్తం త్రస్తోఽహం రామేణ తు మహాత్మనా ।
యన్మమోపకృతం శక్యం ప్రతికర్తుం న త న్మయా ॥"

మహాత్ము డగు శ్రీరాముడు నాపట్ల చేసిన ఉపకారమునకు తగిన ప్రత్యుపకారము నాకు శక్యము కానిది. "అతో నిమిత్తమ్" ఈ కారణమువలన నేను భయపడుచున్నాను. అనుచు సుగ్రీవుడు తన సహచరులతో సంభాషించెను. గ్రంథసందర్భ మిట్లున్నది. ఇందులో "లక్ష్మణునిపై సుగ్రీవునకు కోపము వచ్చినదట. నిష్కారణముగ నన్ను కోపించినపుడు నేనూరకుందునా? అన్నాడు" అని రహస్యాల కర్త వ్రాసినట్లున్నదా? ఈయన పండితుడట కూడను. అప్పుడు అంతఃపురమునకు కుపితుడై వెళ్లిన లక్ష్మణుడు—

"అనార్య స్త్వం కృతఘ్నశ్చ మిథ్యావాదీ చ వానర।
పూర్వం కృతార్థో రామస్య న తత్ప్రతికరోషి యత్ ॥"

అని పరుషముగా మాటలాడెను. అది చూచి తార ఇట్లు పలికెను-

"నైవం లక్ష్మణ వక్తవ్యం నాయం పరుష మర్హతి।
నైవాఽకృతజ్ఞ స్సుగ్రీవో న శఠో నాపి దారుణః ॥
నైవాఽనృతకథో వీర న జిహ్మశ్చ కపీశ్వరః।
ఉపకారం కృతం వీరో నా ప్యయం విస్మృతః కపిః ॥
ప్రసాదయే త్వాం ధర్మజ్ఞ సుగ్రీవార్థం సమాహితా।"

లక్ష్మణా! సుగ్రీవుని నీవిట్లు పరుషముగా అన తగదు. ఈతడు కృతజ్ఞుడే. అనృతము లేనివాడే. కపట మెరుగనివాడే. శ్రీరాముడు చేసిన ఉపకారమును మరువక స్మరించుచున్నవాడే.

ధర్మజ్ఞా! సుగ్రీవార్థము నిన్నును గ్రహింప వేడుచున్నాను. ఈకాలవిలంబమునకు కారణ మేమందువా? వినుము.

"శతకోటిసహస్రాణి లంకాయాం కిల రక్షసామ్।
అయుతాని చ షట్త్రింశ త్సహస్రాణి శతాని చ॥
అహత్వా తాంశ్చ దుర్ధర్షాన్ రాక్షసా న్కామరూపిణః।
అశక్యం రావణం హన్తుం యేన సా మైథిలీ హృతా ॥
తే న శక్యా రణే హన్తు మసహాయేన లక్ష్మణ ॥
ఏవ మాఖ్యాతవాన్ వాలీ స హ్యభిజ్ఞో హరీశ్వరః ॥"

లంకలో కోట్లకొలది రాక్షసు లున్నారు. వారిని వధింపనిదే రావణసంహార మశక్యము, ఆ రాక్షసులు యుద్ధములో అసహాయుని చేత వధింపబడుట అశక్యము. ఈ విషయమంతయు సర్వము తెలిసిన వాలి చెప్పియుండెను. రావణ బలాదికము వాలి- తారకు ఎప్పుడు చెప్పెను? శ్రీరామసుగ్రీవులు సఖ్యము చేసికొన్న విషయము అంగదునివలన వినియున్న తార-యుద్ధమునకు వెళ్ళవద్దని వాలికి

చెప్పినపుడు ఈ సఖ్యవిషయము చెప్పగా అతిబలపరాక్రమసంపన్ను
డగు రావణుని జయించుటలో నన్ను విడిచి దుర్బలు డగు సుగ్రీవు
ని శ్రీరాము డాశ్రయించునా? అని ప్రత్యుత్తరము చెప్పుసందర్భ
ములో నని గ్రహింపవలెను.

సహాయసంపత్తికై ప్రయత్నించుట ఈతనిలో కనబడనందున
మాకు కోప మందువా?

"త్వత్సహాయనిమిత్తం హి ప్రేషితా హరిపుంగవాః ।
ఆనేతుం వానరాన్ యుద్ధే ... ...
తాంశ్చ ప్రతీక్షమాణోఽయమ్ ... రాఘవస్యార్థసిద్ధ్యర్థం
న నిర్యాతి హరీశ్వరః,
'కృతా సు సంస్థా సౌమిత్రే సుగ్రీవేణ పురా యథా ।
అద్య తై ర్వానరై స్సర్వై రాగన్తవ్యం మహాబలైః ॥"

మీ సహాయనిమిత్తము యుద్ధమునకై వానరులను రప్పించు
టకు ఒక అవధి పెట్టి వానరవీరులను పంపియుండెను. వారి రాక కై
ప్రతీక్షించుచుండెను. వారందరు ఇప్పుడు రావలసియున్నది. అని
చెప్పినది.

"ఇంతటి కృతఘ్నుని చెలిమి మీద ఆధారపడకుండ రాముడే
జగదేకవీరుడై నాడు తన కోదండము వెంటబెట్టుకొని సరాసరి రావ
ణునివద్దకు వెళ్ళి వానిని జయించి రావచ్చునుగదా!" (175) అట!

"నైవాకృతజ్ఞ స్సుగ్రీవః" అనుమాటచేత మీరన్నట్టు కృత
ఘ్నుడు కాడని, 'తే న శక్యా రణే హన్తు మసహాయేన' అను
మాటచేత "ఒకని చెలిమిమీద ఆధారపడకుండ సరాసరి రావణుని
వద్దకు వెళ్ళి అతని జయించి రావచ్చును గదా" అను వ్రాత అసం
గత మని తారాప్రబోధముచేతనే విదితమైనందున విషయము తెలి
యని మీరివ్రాత నిరస్తము.

"ఇత్యుక్తస్తు తారయా వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్ ।
మృదుస్వభావః సౌమిత్రిః ప్రతిజగ్రాహ తద్వచః ॥"

ధర్మయుక్తము, వినయోపేతము అగు తార మాట విని మృదుస్వభావము కలవాడై లక్ష్మణుడు ఆమాటను విశ్వసించెను.

అప్పుడు సుగ్రీవుడు లక్ష్మణుని హర్షింపజేయుచు ఇట్లనెను —

పోయిన కీర్తి,- లక్ష్మి, రాజ్యము,- నాకు రామానుగ్రహము వలన లభించినది. జగదేకవీరు డగు శ్రీరామునకు కార్యసాధనములో ఒకని సహాయముతో పనియే మున్నది.

'సీతాం ప్రాప్స్యతి ధర్మాత్మా వధిష్యతి చ రావణమ్ ।
సహాయమాత్రేణ మయా రాఘవ స్స్వేన తేజసా ॥
అనుయాత్రాం నరేన్ద్రస్య కరిష్యేఽహం నరర్షభ ।"

నేను సహాయమాత్రుడనేకాని, తన తేజస్సుచేత శ్రీరాముడే సీతను పొందగలడు. రావణుని వధింపగలడు. ఆయన వెంట నేను వెళ్ళెదను.

"యది కించి దతిక్రాన్తం విశ్వాసా త్ప్రణయేణ చ ।
ప్రేష్యస్య క్షమితవ్యం మే ...... "

నాయందు పొరపాటున్నను భృత్యుడనగు నన్ను క్షమింప గోరుచున్నాను. అని పలుకగా ప్రీతుడైన లక్ష్మణుడు-

"ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సంగ్రామే ష్వనివర్తినః ।
ఉపపన్నం చ యుక్తంచ సుగ్రీవ తవ భాషితమ్ ॥"

సుగ్రీవా! ధర్మజ్ఞుడవు, కృతజ్ఞుడవు అగు నీవు యుక్తముగా పలికినావు.

సదృశ శ్చాసి రామస్య విక్రమేణ బలేన చ ।
సహాయో దైవతైర్దత్త శ్చిరాయ హరిపుంగవ ॥"

బలపరాక్రమములలో శ్రీరామునకు తుల్యుడవైన నీవు సహాయుడవై దేవతలచే దత్తమైతివి. శోకపర్వితు డగు శ్రీరాముని

స్థితిని చూచి "మయా త్వం పరుషా ణ్యుక్త స్తచ్చ త్వం క్షన్తు మర్హసి"

నిన్ను పరుషము లాడితిని. దానిని నీవు క్షమింపవలయును.

ఇట్లు సుగ్రీవుడు లక్ష్మణుని, లక్ష్మణుడు సుగ్రీవుని క్షమింప గోరినవారే. సుగ్రీవుడు కృతజ్ఞు డగుట లక్ష్మణుడు అంగీకరించినదే.

రహస్యాల కర్త వ్రాత—

"అపహృత యైన సీత ఎటు వోయెనో చూచితివా? అని శ్రీరాము డడుగగా— సుగ్రీవుడు మాటాడలేదు. కారణము? ఆ జాడ స్పష్ట ముగా చెప్పినచో రామునకు సీతావ్యసనము పెరిగి మొదలు సీతా న్వేషణప్రయత్నమే చేయు మని నన్ను పురికొల్పును. ఆతని పని నెరవేరిన పిదప నాకు గావలసిన వాలివధకు నడుము కట్టునో కట్టడో, ముందే మన పని చేయించుకొనుట మంచిది. ... ఇది సుగ్రీవుని దృష్టి" (పు 180) అట!

శ్రీరాము డడిగిన దిది- "బ్రూహి సుగ్రీవ కం దేశం హ్రియ న్తీ లక్షితా త్వయా। క్వ వా వసతి తద్రక్షో బ్రూహ ద్వ్యసనదం మమ॥" సీతి నపహరించిన రాక్షసుడు ఎటు తీసికొనివెళ్ళెనో, ఆతని ఉనికి ఎక్కడనో చెప్పుము. అని ఇట్లు అడుగగా – "సుగ్రీవుడు మాటాడ లేదు" అనుటపై అడుగుచున్నాము— మాటాడనప్పుడు శ్రీరాము డూరకుండునా? ఊరకుండుట కైదైనా చెప్పెనా? లేదా? ఏదియు చెప్పకుండుట అసంభవము కనుక శ్రీరాముడు ఊరడించుటకై చెప్పినదిది—

"సత్యం తే ప్రతిజానామి త్యజ శోక మరిందమ।
కరిష్యామి తథా యత్నం యథా ప్రాప్స్యసి మైథిలీమ్॥
రావణం సగణం హత్వా పరితో ష్యాత్మపౌరుషమ్।
తథాఽస్మి కర్తా న చిరా ద్యథా ప్రీతో భవిష్యసి॥"

శ్రీరామా! నీకు ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. సీతాదేవిని పొందుటకు తగిన యత్నము చేయుదును. రావణుని సపరివారముగా వధించి నిన్ను సంతోషింపజేసి నీకు ప్రీతి కలుగునట్లు పౌరుషము ప్రదర్శించెదను. శోకము త్యజింపుము. అని పలికెను. ఈవిషయము నెత్తక శ్రీరాము డడిగినదానికి "సుగ్రీవుడు మాటడలేదు" అని మాత్రమే రహస్యాలకర్త వ్రాసెను. బాగున్నదా?

"ముందు రావణు జాడ వినిపించినచో రాముడే లంకకు ప్రయాణము కట్టునేమో, తన పని నెరవేరిన పిదప వాలి వధకు నడుము కట్టునో కట్టడో, ముందే మన పని చేయించుకొనుట మంచిది. అన్న సందేహమును సుగ్రీవునిలో ఉన్నదని వ్యాఖ్యాతలే వివరించిరి. సుగ్రీవునిలో స్వార్థముతో కూడిన అబద్ధము కావలసి నంత కద్దు." (1 0)

అని వ్రాసినది స్వకపోలకల్పన. వ్యాఖ్యాతలు వివరించినది- వాలివధ ముందు కానియెడల వాలి అధీనములో నున్న వానరసేన కలిసిరాదు. వాలికి ప్రాణసఖుడైన రావణునిపై దండెత్తినపుడు వాలి ప్రతిఘటింపక మానడు. అని భావించినాడు దూరదృష్టి కల సుగ్రీవుడు. అని.

రహస్యాలకర్త – తాను కల్పించిన విషయమును 'వ్యాఖ్యాతలే వివరించిరి' అనుటలో స్వార్థములో కూడిన అబద్ధము కావలసినంత ఉండగా- సుగ్రీవునిలో అబద్ధమనుట హేయము. రామ కార్యసాధనకే వాలివధకు ఆవశ్యకతను గమనించిన సుగ్రీవునిది దూరదృష్టి యని వ్యాఖ్యాతలనగా- రాముని పని నెరవేరిన పిదప మన పనికి (వాలివధకు) నడుము కట్టునో కట్టడో అన్న సందేహము సుగ్రీవునిలోని దుష్టదృష్టి అని కల్పించెను. దుష్టదృష్టి తనదా? సుగ్రీవునిదా? రామలక్ష్మణులతో సంభాషించినవాడు సుగ్రీవుడు. ఆ రామలక్ష్మణులు సుగ్రీవునిది అబద్ధమని,దుష్టదృష్టి యని అనిరా? కనుక ఈ వ్రాత హేయము.

సీతను వెదకు డని వానరులను బంపునపుడు—

"ద్వీప స్తస్యాఽపరే పారే శతయోజన మాయతః।
అగమ్యో మానుషై ర్దీప్తై స్తం మార్గధ్వం సమన్తతః॥
స హి దేశ స్తు వధ్యస్య రావణస్య దురాత్మనః।
రాక్షసాధిపతే ర్వాసః ... ..."

అని వివరించును. ఇంత స్పష్టముగా రావణుని చరిత్ర, నివాసము తెలిసినవాడు సుగ్రీవుడు॥" అనిరి.

వీరే — "వాలి పోయిన పిదప, సుగ్రీవుని సన్నిధిలో తార, లక్ష్మణునితో ప్రసంగించునపుడు రావణుని చరిత్ర సర్వము వెల్లడి పెట్టినది" (18!) అని వ్రాసియున్నారు.

దీనినిబట్టి రావణుని వృత్తాంతము సర్వము లక్ష్మణుని దగ్గర తార చెప్పినది. అదికూడ సుగ్రీవుని సన్నిధిలో కనుక తార చెప్పగా సుగ్రీవునకు తెలిసినది. అది వాలి పోయినపిదపకద!

ఇప్పుడు వానరులను పంపినపుడు రావణుని చరిత్ర, నివాసము వారికి చెప్పుటలో విరోధ మేమున్నది? అని అడుగుచున్నాము.

రహస్యాలకర్త వ్రాత— "యువరాజగు అంగదుని ఆధ్వర్యమున హనుమంతునితోపాటు బయలుదేరిన వానరవర్గమునకు సీత జాడ కన్పింపకపోవుటయేకాక, సుగ్రీవుడు నిర్ణయించిన గడువు కూడ గడచినది. అందరు ఒక్కచోటజేరి సుగ్రీవుడు మనలను చంపును. ఆతని స్వభావ మట్టిది. అని నిర్ణయించుకొని ప్రాయోపవేశముచేసి,మరణించుటే మంచిదని తేల్చుకొనిరి. ఆసమయములో సుగ్రీవుని శీలమునుగూర్చి అంగదుని భావములు— 1. సుగ్రీవుడు నన్ను యువరాజుగా చేసినవాడు కనుక నన్ను చంపడని భావింతువేమో. నన్ను యువరాజుగా చేసినది సుగ్రీవుడు కాదు. శ్రీరాముడే చేయించినాడు.

ప్రాయోపవేశమునకు సమ్మతింపక ఎన్నోవిధముల బోధించిన హనుమంతునితో సుగ్రీవునిగూర్చి అంగదు డిట్లనెను.

2. "తన యన్న బ్రతికియుండగా ఆయనభార్య, తనకు తల్లి వంటిదయైన ఆమెను ఈతడు చేపట్టెను.

3. మహాత్ముడైన అన్న యుద్ధముకొరకై శత్రువు వెంట కొండబిలములో ప్రవేశించునపుడు నీవీ వాకిట నిలిచియుండుమని నియోగించి లోనికి పోగా, అదే సమయమని బిలమును పెద్ద రాతిచే గప్పివైచి రాజ్యమును చేతబట్టి గద్దె యెక్కి కూర్చుండెను. నిందితుడు, పరమద్రోహియైన సుగ్రీవునకు ధర్మ మెట్లు తెలియును?

4. ఉపకరించిన శ్రీరాముని ఈతడు మరచిపోలేదా? రాముడు జడువచ్చి భయపెట్టుటచే సీతాన్వేషణమునకు మనలను పంపెను గాని, భయంకరమైన అధర్మమునకు భయపడి కాదు.

5. ఇట్టి పాపాత్ముడు, కృతఘ్నుడు, స్వార్థపరుడు అయిన సుగ్రీవునియెడ పూజ్యుడైనవానికి విశ్వాసమెట్లు కలుగును?"
(114) అట!

ఈవ్రాతలో మొదటి విషయము అంగదు డన్నది కాదు. ఈయన కల్పించినదే. కనుక త్రోసివేయబడినది.

రెండవ విషయము– వాలి బ్రతికియుండగా తారను చేపట్టెను అనుట అసంగతము, అసంభవము. తారను తల్లినికూడ దుష్టురా అని అంగదు డన్నట్టేకదా! అది సంభవమా? కనుక ఇదికూడ త్రోసి వేయబడినది. వాలి చెప్పినట్టి ఆబిలము దగ్గర సుగ్రీవు డుండగా— "సాగ్రస్సంవత్సరో గతః" సంవత్సరముపైగా నడచినది. ఆ బిల ద్వారమునుండి రక్తము ప్రవహించుట, బిలములోనుండి అసురుల గర్జనము వినబడుట చూచి, వాలి హతుడై యుండు నని దాని చేతనే ఆగర్జనములని భావించి ఆ అసురుల రాకకు ప్రతిబంధకముగా ఆబిలమును మహాశిలతో కప్పి శోకార్తుడనై భ్రాతృమరణనిశ్చయ మూలకమైన ఉదకదానము చేసి కిష్కింధకు వెళ్ళి దుఃఖముతో కూర్చుంటివి. అని సుగ్రీవుడు చెప్పగా "వాలి బిలములోనికి పోగా

అదే సమయ మని బి ముసు పెద్దరాతిచే గప్పివై చెను" అని వ్రాసిన ఈయనను ఏమనవలెను?

అప్పుడు మంత్రులు నన్నడిగి తెలిసికొని అందరును కలిసి రాజ్యాధిపత్యము నాకంటగట్టిరి. అన్నది రామప్రభువు దగ్గర సుగ్రీవుడు చెప్పిన విషయము. దీనినిబట్టి మూడవ విషయము పరాస్తము.

ఇక నాల్గవ విషయము— "ఉపకారం కృతం వీరో నాప్యయం విస్మృతః కపిః" అన్నట్టు తార ప్రబోధము చేతనే పరాస్తమైనది. రామకార్యమును మరువనట్టి సుగ్రీవుడు వానరులను రప్పించుటకు వానరవీరులను పంపియే యున్నాడు. వారందరు ఇప్పుడు రాగలరు. అనికూడ చెప్పెను తార.

ఇక అయిదవ విషయము —

"నైవాఽకృతజ్ఞ స్సుగ్రీవో న శఠో నాపి దారుణః ।
నైవాఽనృతకథో వీర న జిహ్మశ్చ కపీశ్వరః ॥"

అని తారయే చెప్పినది. మరియు—కబంధుడు—

"సుగ్రీవో నామ వానరః ... ...
సత్యసన్ధో వినీతశ్చ ధృతిమాన్ మతిమాన్ మహాన్ ।
కృతజ్ఞః కామరూపీ చ ... ... ॥

యస్త్వేమం విషమాచారః పాపకర్మాధిరోహతి ।
తత్రైవ ప్రహర న్త్యేనం సుప్తమాదాయ రాక్షసాః ॥"

పాపాత్ముడు దేని నధిష్ఠించిన యెడల రాక్షసులు కొట్టుదురో అది ఋష్యమూకము. దానియందున్నాడు సుగ్రీవుడు. అని సుగ్రీవుని యోగ్యతను బహువిధముల ప్రబోధించినవాడు కబంధుడు. ఇట్లు తారావచనములచేతను, కబంధవచనములచేతను పై వ్రాత నిరస్తమైనది.

అంగదుడు— సుగ్రీవనిర్దిష్టసమయము అతిక్రమించెనన్న భీతితో భ్రాంతిలో బడి సుగ్రీవుని వాస్తవికస్వభావమును విరుద్ధముగా భావించి, ఆడిన మాటలు అర్థము లేనివి ... మతిమంతుల ...

గాత్రీహ్యములు కావని చెప్పుచు వీరి వ్రాతను త్రోసివేయు చున్నాము.

—♦ రామలక్ష్మణులు–విభీషణ శరణాగతి ♦—

1. "రామాయణములోని దశరథమహారాజునకు, భారతములోని శంతనుమహారాజునకు, కొంత సామ్యము కన్పించుచున్నది. ఆ యిరువురు ఆ కాలములో చేసిన ఘనకార్యము లేమియు లేవు. కాని వారి యదృష్టవిశేషమున పెద్దకొడుకు లిద్దరు యోగ్యులుగా దొరికిరి. ఒకడు శ్రీరాముడు, వేరొకడు భీష్ముడు" (72)

2. పైకి పితృవాక్యపరిపాలన మని బడాయి కొట్టుటే గాని, లోలోన రాజ్యము పోయెనే అనెడి వగపు అన్నదమ్ము లిర్వురకు హెచ్చుగా లేకపోలేదు. దానము చేసి, పిదప విచారపడిన దాత వోలె పితృవాక్యపరిపాలనమునకై వచ్చినట్టు నటించిన ఈ యన్నదమ్ములు ప్రపంచమునకు ఆదర్శపురుషు లెట్లగుదురు?

3. ఆనాడు తండ్రికోసమై రాజ్యమును విడనాడి విచార పడని భీష్మునికన్న శ్రీరాముడు శ్రేష్ఠు డగునా?

4. ఆధునికకాలములో రవి యస్తమింపని ఆంగ్లసామ్రాజ్యమును తాను వలచిన కాంతకోసమై విడనాడి విచారపడని "లిండ్సర్ ఎడ్వర్డు" కన్న రాము డెట్లు మిన్నయగును? (244)

ఈ వ్రాతలో మొదటిది – దశరథమహారాజునకు పెద్దకొడుకు శ్రీరాముడు. శంతనుమహారాజునకు పెద్దకొడుకు భీష్ముడు. ఈఇద్దరు–వారి అదృష్టవిశేషమున యోగ్యులుగా దొరికిరి. అన్నది.

మూడవది– తండ్రి కోసమై రాజ్యము విడనాడి విచారపడని భీష్మునికన్న శ్రీరాముడు శ్రేష్ఠు డగునా? అన్నది. ఇక్కడ మేము అడుగుచున్నాము– ఆ తండ్రులకు పుత్రులిద్దరు యోగ్యులుగా దొరికిరి. అన్న నోటితో — "భీష్మునికన్న శ్రీరాముడు శ్రేష్ఠు డగునా?" అనుచు శ్రీరాముడు యోగ్యుడు కాడనుట స్వవచనవ్యాఘాతము.

ఇంకొకటి- "రాముడు భీష్మునివంటి స్వార్థత్యాగి అగునా? కాడు. ధర్మజునివంటి మెత్తనిపులి" (84)

అన్న నోటితో - "శ్రీరాముడు, భీష్ముడు తండ్రులకు యోగ్యులుగా దొరికిరి" అనుట స్వవచనవ్యాఘాతమే.

"మెత్తనిపులి" మెత్తనిదే అయితే పులి కాదు. పులి అయితే మెత్తనిది కాదు. ఇక్కడ ధర్మజుడు సంజయునకు చెప్పిన దిది-

"అల మేవ శమాయాస్మి తథా యుద్ధాయ సంజయ ।
ధర్మార్థయో రలంబాఽహం మృదవే దారుణాయ చ ॥"

నేను శాంతించుటకును, మీరు కోరిన యుద్ధము చేయుటకును సమర్థుడనే. అనుచు "మృదవే దారుణాయ చ" అన్న మాటనే "మెత్తనిపులి" అని చెప్పి రని తెలుపుచున్నాము. "యోగ్యతా లక్షణ మిదియే"

ఇక రెండవది— "పితృవాక్యపరిపాలనకై వచ్చినట్టు నటించిరి" అన్నది- 'కైకేయి కోరిన వరములు రెండింటిని' విన్న వెంటనే తండ్రికి గుండె బ్రద్దలైనదిగాని తండ్రి యాజ్ఞ యిది యని పినతల్లి వినిపించిన వెంటనే అది మరణవార్త వంటిదైనను, నిర్వికారుడై అతడామెతో ఇట్లనెను—

"ఏవ మస్తు గమిష్యామి వనం వస్తు మహం త్వితః ।
జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞా మనుపాలయన్ ॥"

మా నాయనగారి ప్రతిజ్ఞను బట్టి అమ్మా నీవు కోరినకోర్కెను తప్పక తీర్తును. (84)

ఇట్లు చెప్పిన నోటితో - పితృవాక్యపరిపాలన మని బడాయి కొట్టి పితృవాక్యపరిపాలనమునకై వచ్చినట్టు నటించిరి" అనుట స్వవచనవ్యాఘాతము కాదా?

కనుక "నిర్వికారచిత్తముతో చేసినది పితృవాక్యపరిపాలనము" అది బడాయికొట్టుట కాదు. దానికై వచ్చినట్టు నటించుట కాదు; అందుచే పై వ్రాత నిరస్తమైనది.

మూడవదానిలో - భీష్ముడు శ్రేష్ఠుడు - తండ్రికోసమై రాజ్యము విడనాడి విచారపడలేదు. అని చెప్పి- అంబను నీతమ్మునికిచ్చి పెండ్లి చేయవయ్యా! అని గురువగు పరశురాముడు శిష్య శిఖామణి యైన భీష్మునకు చెప్పగా, "ససేమిరా" అని మొరాయించి గురువులతో యుద్ధమునకు సిద్ధమయ్యెను (71) అని భీష్ముని లోని అయోగ్యత చెప్పబడినది ఇక్కడ ఈయనకు బోధింపవలసి యున్నది—

అంబ - సాల్వభూపతిని నేను వరించియున్నానని చెప్పగా భీష్ము డామెను పదిలముగా సహాయమిచ్చి పంపెను.

తమ్మునికిచ్చి పెండ్లి చేయుమని గురు వనలేదు. భీష్ముడు మొరాయింపను లేదు. ఇది తెలియని వ్రాత కనుక త్రోసివేయు చున్నాము.

ఇక నాల్గవది - ఆంగ్లసామ్రాజ్యమును తాను వలచిన కాంత కోసమై విడనాడి విచారపడనివ్యక్తి రామునికంటె శ్రేష్ఠుడట! ఓహోహో! ఇది గొప్ప మాట! వీరి రామాయణరహస్యాలలో ఇది యొకటి. సామ్రాజ్యాధికారము స్వతస్సిద్ధమై యుండ కాంతకోసము విడనాడవలసిన పనియేమి? ఆ అధికారమునకు ఆకాంతాపరిగ్రహము విరుద్ధమని చెప్పవలెను. ఏదికూడనో అట్టి కాంతా వ్యామోహములో తాత్కాలికముగా పడి స్వతస్సిద్ధమైన రాజ్యాధికారమునకు దూరమైపోయె నన్నమాట. ఈచర్య రాము డెరుగడుకనుక ఈతడు ఘనుడే. "రాజ్యము పోయినను విచారపడలేదట" అది తమకు తెలిసెనట! ఆ వ్యక్తిలో ఆపై రాజ్యభ్రష్టతకు ఎంత విచార ముండెనో తన కేమి తెలియును?

ఎట్లయినను - "పితృదేవో భవ" అనుసూక్తి ననుసరించి తండ్రికోసమై రాజ్యత్యాగము చేసినవారు శ్రీరాముడు భీష్ముడును. తాను వలచిన స్త్రీకోసము రాజ్యము పోగొట్టుకొన్నవాడు వీరు చెప్పి నట్టి వ్యక్తి. ఇట్టి వానికంటె శ్రీరామునిలో ఘనత యేమున్నది? అని వ్రాసిన వీరి యోగ్యతనేమనవలెనో పాఠకులే నిర్ణయింతురుగాక.

ఇట్లు పై వ్రాత నిరస్తము—

"భరతుడు,- కైకేయియు అడవులకువచ్చి రామునిసన్నిధిలో తమ నేరము మన్నింపవలెననియు, అజ్ఞానము వలన తాము ఆపని చేసితి మనియు విన్నవించి అయోధ్యకు రావలెనని ప్రార్థించిరి గదా! వారి తత్త్వము గుర్తించి తాను రానని కారణము చెప్పి మంచిగా వాండ్రను ఇంటికి పంపించిన రాముడు అయోధ్యలో గాని, దారిపొడుగునగాని లక్ష్మణసుమిత్రాదులు కైకను నిందించు చుండగా అది తప్పని మందలించి, అడవులకు వచ్చిన రాముడు-విరాధుని చేతిలోబడి దుఃఖించు సీతను చూచి, లక్ష్మణా! కైకేయి-తన బిడ్డకు రాజ్యము వచ్చుటతో తృప్తిపడలేదు. నన్ను అడవులకు నెట్టి, నన్ను వెంబడించిఉన్న సీతను ఏరాక్షసుడో అపహరింపవచ్చుననియు, దానితో నేను చితికి చెడిపోదు ననియు, భరతుని రాజ్యము నిష్కంటక మగుననియు, ఇన్ని యూహాలతో వ్యూహములు పన్ని నన్నడవుల పాలు చేసినది." అని తన నోట అనవచ్చునా? లక్ష్మణునికి ఈతనికి భేద మే మున్నది" (101-99) అట!

"చరామి సాయుధో నిత్య మృషిమాంసాని భక్షయన్ ।
ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి ॥"

నేను ఋషిమాంసభక్షణముతో సంచరించు విరాధుడను. ఈ సీత నాకు భార్యకాగలదు. అని చెప్పిన సందర్భములో-తన కుమారుని రాజ్యముతో తృప్తిపడక నన్ను అరణ్యములకు పంపుటలో కైకేయి ఊహించినది ఇదియే అని రాము డనుట ఈయనకు తప్పనిపించెనట! ఈ మాటలో తన ఆపద చెప్పబడెనేకాని, రాజ్యము పోయెనని విచారించినట్లు లేదుకనుక రాజ్యము పోయెనని విచారించినట్లున్న ఈయనవ్రాత నిరస్తమైనది.

"క్వ సూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయా మతిః"

అనుచు సూర్యవంశమునకు చెందిన రఘువంశ మెక్కడ?

అల్పజ్ఞుడనగు నాబుద్ధి ఎక్కడ? అనుచు 'రఘువంశ' రచనలో కాళిదా సంత మహాకవి సిగ్గుపడెను. అట్టిసిగ్గు ఈ రహస్యాలకర్తకు లేనేలేదు. రహస్యాల కర్తవ్రాత—

1 "శ్రీరాము డడవికి బోవలెను, భరతుడు రాజ్య మేలవలెను. ఇంతవరకే కైక కోరిన వరములు.

2 నారచీరలు కట్టుకొని కోడలా! నీవుకూడ మగని వెంట వెళ్ళవే అని కైక అనలేదే" (233) అట!

కైకేయీవివాహసందర్భమున ఆమె బిడ్డకు రాజ్యమిచ్చుటకు ఒప్పుకొనుటవలన, భరతుడు రాజ్య మేలవలె నని కోరుగాక.

రాము డడవికి బోవలెను. అని కోరవలసిన పనియేమి? కనుకనే అపత్సమయములలో సీతారామలక్ష్మణులు ఆమె ఆ కోరికను నిందించుచు వచ్చిరనీ తెలిసికొందురుగాక!

ఇక రెండవది–నారచీరలుకట్టుకొని వెళ్ళవేఅని సీతను అనలేదా? అయితే చూడుడు —

"అథ చీరాణి కైకేయీ స్వయ మాహృత్య రాఘవమ్ ।
ఉవాచ పరిధత్స్వేతి ... స చీరే కైకేయ్యాః ప్రతిగృహ్య ॥"
సూక్ష్మవస్త్ర మవక్షిప్య మునివస్త్రాణ్యవస్త హ ।
"లక్ష్మణశ్చాపి తత్రైవ విహాయ వసనే శుభే ॥
తాపసాచ్ఛాదనే చైవ జగ్రాహ పితు రగ్రతః ।
"అథాత్మపరిధానార్థం సీతా కౌశేయవాసినీ ॥
సంప్రేక్ష్య చీరం సంత్రస్తా ... సవ్యపత్రసమాణేన
ప్రగృహ్య చ సుదుర్మనాః । కైకేయ్యాః కుశచీరే తే
జానకీ ... అశ్రుసంపూర్ణనేత్రా చ"

(అయోధ్యా. స 37)

నారచీరలను కైకేయి స్వయముగా తెచ్చి శ్రీరాముని ధరింపుమని చెప్పగా రెండు చీరలను కైకేయినుండిస్వీకరించిఆమునివస్త్రములను కట్టితన సూక్ష్మవస్త్రములను విసర్జించెను.

లక్ష్మణుడుకూడ ఆజనసంఘములోనే తండ్రిఎదుట ఆముని వస్త్రములను స్వీకరించి తన వస్త్రములను విడిచెను.

తరువాత సీతాదేవి, తాను కట్టుకొనుటకైన చీరను చూచి భీతితో సిగ్గుపడుచు, కైకేయినుండి రెండు చీరలను గ్రహించి కంట నీరుపెట్టుకొనుచుండెను.

అది కైకేయిభవన మగుటచే లోపలికి రమ్మనువారులేక జన సంఘములో కట్టుకొనుట కవకాశములేక మెడలో ఒక చీరవేసికొని రెండవది చేతబట్టుకొని రామప్రభువును చూచినంత ఆయన లేచివచ్చి ఆ చీర తీసికొని సీతాదేవి ధరించియున్న వస్త్రముమీదనే దానిని చుట్టబెట్టెను.

నారచీరలు సిద్ధముగా ఉంచుకొని క్రమముగా రామలక్ష్మణు లకు, సీతాదేవికి ఇచ్చి కట్టించి కైకేయి పంపినదని యిప్పుడైన తెలిసెనా?

— రావణునకు విభీషణోపదేశము —

రహస్యాలకర్త వ్రాత—

"ఒక్క కోతి వచ్చి లంకలో ఇంతపనిచేసెనే. అట్టి కోతులను ఎన్నిటినో వెంటబెట్టుకొనివచ్చి ఆ రామలక్ష్మణులు సర్వరాక్షస సంహారము చేయుట నిశ్చయమని రావణుని మోల పిరికిమందు చల్లినవారిలో మొదటివాడు విభీషణుడు. ఈ విభీషణుడు అన్నకు పక్కలోబల్లెమై రామభక్తులలో ఒకడుగా పేరు మోసెను" (222) "ఇన్నికూతలు కూసినను నిన్ను క్షమించితిని. నీవు కుల ద్రోహివి. ఆవలికి బో్పో ॥" (224)

ఇక్కడ కూతలుగా ఈయనచే గ్రహింపబడిన విభీషణుని మాటలు కొన్ని చెప్పుకొందము—

"హితం తథ్యం త్వహం బ్రూమి దీయతా మస్య మైథిలీ"

నీకు హితము సత్యము అయిన మాట చెప్పుచున్నాను. రాఘు పత్నిని రామునకు సమర్పింపుము.

ఆ రామ పత్ని ఇక్కడకు తెచ్చినది మొదలు అశుభనిమిత్తము లెన్నిరో గోచరించుచున్నవి. అవి సర్వత్రి స్త్రీలకు, పురుషులకు ప్రత్యక్షములే.

నీకు భయపడి నీమంత్రులు చెప్పలేకున్నారు. నేను ఉపేక్షింప లేక వెల్లడించినాను.

"అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్"

పరదారాభిమర్శనము అపకీర్తికరము, అనాయుష్యకరము. ఇట్లు విభీషణుడు చెప్పగా రావణుడు—

"భయం న పశ్యామి కుతశ్చి దప్యహం, న రాఘవః
ప్రాప్స్యతి జాతు మైథిలీమ్"

ఎవ్వనివలనను మనకు భయము లేదు. రాము డెన్నడును సీతను పొందలేడు. అని చెప్పి, ఆనాటికి సభను చాలించెను. మరియొకప్పుడు కుంభకర్ణాదులతో కూడిన సభలో-రామలక్ష్మణులు సుగ్రీవాదివానరసేనతో ఇప్పుడు సముద్రతీరమునకు వచ్చియున్నారు. మనుష్యులనుండి మనకెట్టి భయము లేదు.

"అదేయా చ యథా సీతా వధ్యౌ దశరథాత్మజౌ ।
భవద్భి ర్మన్త్ర్యతాం మన్త్రి స్సునీతం చాఽభిధీయతామ్ ॥"

సీతనివ్వకుండ, రామలక్ష్మణులను వధించుటకు తగిన ఆలోచన మీరు పరిశీలించి చెప్పవలెను. అని రావణుడనగా—"యావద్ధి కేశగ్రహణాత్ ... నిగృహ్య రాజా పరిరక్షితవ్యః"

ఆప్తవర్గము, తను జుట్టుపట్టుకొనువరకు రాజును రక్షింపవలసినదే. అని.

"స్వమతం బ్రవీమి, నరేంద్రపుత్రాయ దదాతు మైథిలీమ్"

నామతము-రామునకు సీత నివ్వవలసినదనియే. అని విభీషణుడనెను. ఈవిభీషణుని మాటలు కూతలట! రావణునకు పిరికిమందు జల్లినవారిలో ఈ విభీషణుడు మొదటివాడట!

మాల్యవంతుని ఉపదేశము—

"త న్మహ్యం రోచ తే సన్ధి స్సహ రామేణ రావణ ।
.........సీతా తస్మై ప్రదీయతామ్ ॥"

సీతను రామునకు సమర్పించి రామునితో విరోధములేకుండ సంధి చేసికొనుట నాకు సమ్మతము. ప్రస్తుతము కనబడు ఉత్పాతములు చూడగా రాక్షసులకు ఇది వినాశసమయమని తోచుచున్నది. అన్న మాల్యవంతునితో రావణు డనెను—

తండ్రి విసర్జింపగా అడవులపాలై, శాఖామృగముల నాశ్రయించిన మనుష్యుడు రాముడు. అతడు సమర్థుడని నీ కెట్లు అనిపించినది? వనమునుండి సీతను తెచ్చిన నేను రామునకు భయపడి యిచ్చుటనా? నీమాటలు నాచెవికి ఎక్కలేదు. అని.

— కుంభకర్ణుని ఉపదేశము —

"శీఘ్రం ఖల్వభ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః ।
ప్రథమం వై మహారాజ కృత్య మేత దచింతితమ్ ॥
కేవలం వీర్యదర్పేణ నాఽనుబంధో విచారితః ।
అనభిజ్ఞాయ శాస్త్రార్థాన్ పురుషాః పశుబుద్ధయః ॥
ప్రాగల్భ్యా ద్వక్తు మిచ్ఛన్తి మన్త్రే ష్వభ్యన్తరీకృతాః ।
అశాస్త్రవిదుషాం తేషాం న కార్య మహితం వచః ॥"

పరదారాపహరణరూపమైన పాపముయొక్క ఫలము నీకు వెంటనే అంటుకొన్నది. ఈపని కర్తవ్యమా? కాదా? అని మొదట ఆలోచింపక వీర్యదర్పముచేత అది యెట్లు పరిణమించునో ఆలోచించితివి కావు.

పశుబుద్ధులగువారు శాస్త్రవిషయము లెరుగక ధార్ష్ణ్యముతో ఏదో చెప్పుచుందురు. శాస్త్రజ్ఞానహీనులమాట వినరాదు.

"య దుక్త మిహ తే పూర్వం క్రియతా మనుజేన చ ।
త దేవ నో హితం కార్యం య దిచ్ఛసి చ త త్కురు ॥

సోదరుడగు విభీషణుడు వెనుక చెప్పినట్టు చేయుటే మనకు హితము.

"య దుక్త మిహ తే పూర్వం ప్రియయా మేఽనుజేన చ।
త దేవ నో హితం వాక్యం యథేచ్ఛసి తథా కురు"

నీభార్య మండోదరి, అనుజుడు విభీషణుడు వెనుక చెప్పినట్టు చేయుటే మనకు హితము. ఆపై నీయిష్టము. అని.

— రావణుని పశ్చాత్తాపము —

కుంభకర్ణుని మాటలు విని రావణుడు — మమాఽపనయజం దుఃఖం విక్రమేణ సమీకురు" నా అవినీతివలన సంభవించిన కష్టమును నీవు పరాక్రమముతో తొలగింపుము. అని చెప్పుచు తాను చేసినది తప్పుపనియే అని ఒప్పుకొనెను. తరువాత కుంభకర్ణుడు భయంకరమైన యుద్ధముచేసి శ్రీరాముని చే సంహరింపబడెను. అప్పుడు ఆరావణుడు ఇట్లు విలపించెను —

"రాజ్యేన నాస్తి మే కార్యం కిం కరిష్యామి సీతయా ।
కుంభకర్ణవిహీనస్య జీవితే నాస్తి మే మతిః ॥
త దిదం మా మనుప్రాప్తం విభీషణవచ శ్శుభమ్ ।
య దజ్ఞానా న్మయా తస్య న గృహీతం మహాత్మనః ॥
తస్యాఽయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోకదః ।
య న్మయా ధార్మిక శ్రీమాన్ స నిరస్తో విభీషణః ॥"

కుంభకర్ణ విహీనుడనైన నాకు రాజ్యముతో పనిలేదు. సీతతో నేమి పని? జీవితమందే నాకు వాంఛ లేదు. మహాత్ముడగు విభీషణుని శుభావహమైన మాట అజ్ఞానమువలన వినకపోతిని. దాని ఫలమే ఇది. ధార్మికుడైన విభీషణుని నిరసించిన నాకృతమే శోకము కలిగించినది. అని విలపించెను.

ఇప్పుడు "రహస్యాలకర్త నడుగుచున్నాము—
"రామపత్నిని రామప్రభువునకు సమర్పింపుము" అని విభీషణుడు చెప్పెను; మాల్యవంతుడు చెప్పెను; కుంభకర్ణుడు చెప్పెను; మండోదరి చెప్పెను.

వీరందరును రావణునికి పిరికిమందు చల్లినవారేనా? వీరందరివి కూతలేనా? కుంభకర్ణుడు — ఎవరి మాటలు వినకూడని వన్నాడో అట్టివారి మాటలే మీావి. కొంచెము గుర్తించిరా?

"విభీషణుడు కులద్రోహి" అని మీా రనగా — ఆరావణుడు, "ధార్మికుడు విభీషణుడు, ఆతని నిరసించి తప్పుపని చేసితి' నని విలపించినాడు. చూచినారా ?

ధార్మికుడైన విభీషణుని హితోపదేశము ధిక్కరించి ఆతని నిరసించిన నేను తప్పుపని చేసినానని రావణుడు విలపించుట చూచి రహస్యాలకర్త తన తప్పునకు సిగ్గుపడవలసిన స్థితి సంభవించిన దని పాఠకులు గ్రహింతురుగాక!

— రావణుడు — పరస్త్రీహరణము —

రహస్యాలకర్త వ్రాత—

"రాజర్షుల యువతులు-పితృదేవతల కాంతలు- గంధర్వుల సుందరులు-రాక్షసకన్యలు-ఎందరెందరో తమంత దామె రావణుని వలచి వచ్చినవారే. కొందర నాతడు బంధించి తెచ్చినను వారిని వలచికాదు. వాండ్ర బంధువులతో యుద్ధము కలుగవలె నని ఆపని చేసెను" సుం-స9- (193) అట!

ఇక్కడ అడుగుచున్నాము — ఆ స్త్రీలను బంధించి తెచ్చి యుద్ధము చేసెనా? యుద్ధముచేసి ఆపై వారిని బంధించి తెచ్చెనా? చూడుడు —

"రాక్షసీభిశ్చ పత్నీభి రావణస్య నివేశనమ్ ।
ఆహృతాభిశ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్ ॥"

(సుం- స.-6)

రావణభవనము రాక్షసజాతిపత్నులచేతను, రాజకన్యలచేతను ఆవృతమై యున్నది. ఆరాజకన్యలకు విశేషణము- 'విక్రమ్య ఆహృతాభిః' అనగా విక్రమించి యుద్ధముచేసి (వారిబంధువులతో) తీసి

కొనిరాబడినవారు. అని యున్నందున యుద్ధముచేసినది ఆరాజకన్యల కొరకే అని స్పష్టమైనది.

దీనినిబట్టి ఆ స్త్రీలను వలచియే ఆయుద్ధము చేసెను గనుక ఈ వ్రాత నిరస్తమైనది.

రావణవధానంతరము మండోదరీవాక్యములు—

నైకయజ్ఞవిలోప్తారమ్... ధర్మవ్యవస్థాభేత్తారమ్...
దేవాసురనృకన్యానా మాహర్తారం తతస్తతః ॥
ఏవం పరిభావం భర్తారం దృష్ట్వా రామేణ పాతితమ్ ॥
యాస్త్వయా విధవా రాజన్ కృతానైకాః కులస్త్రియః ॥
త్వయా విప్రకృతాభి ర్య త్తదా శప్తం త దాగతమ్ ॥"

నీచేత విధవలు చేయబడిన కులకాంత లెందరో నీకు పెట్టిన శాపము ఇప్పుడు పట్టుకొన్నది. అని.

"నివర్తమాన స్సంహృష్టః రావణ స్స దురాత్మవాన్ ।
దర్శనీయాం హి యాం రక్షఃకన్యాం స్త్రీం వాపి పశ్యతి ॥
హత్వా బన్ధుజనం తస్యా విమానే తాం రురోధ సః ।
నాగగన్ధర్వకన్యాశ్చ మహర్షితనయాశ్చ యాః ॥
దైత్యదానవకన్యాశ్చ విమానే శతశోఽరుదన్"

(ఉ।రా।స24)

దురాత్ముడైన రావణుడు దర్శనీయమైన కన్యనుగాని, వివాహితస్త్రీనిగాని, చూచినప్పుడు ఆమె బన్ధుజనమును వధించి ఆమెను తనవిమానము మీద నిరోధించుచుండెను. వందలకొలది ఆస్త్రీలు రోదనము చేసిరి. దీనినిబట్టి-"రావణుని వలచినదేకాని, ఇతరుని చెట్ట పట్టిన యువతి ఎవతెయు లేదు." (193) అను వ్రాత నిరస్తమైనది.

### రావణసంహారము—

రామరావణుల పూర్వానుబంధము,- రహస్యాలకర్త వ్రాత- "మరణపర్యంతమే వైరమ్ముకాని, ఆవల వైరము చూప

రాదని రాముడు బోధించి, విభీషణా! ఈతడు నీకెట్లు సోదరుడో నాకును అట్లే సోదరు డని చెప్పెను." (243)

ఇక్కడ కొంచెము చెప్పవలసియున్నది —

రావణునితో అనుబంధము విభీషణున కున్నదికాని, రామున కేమున్నది? ఏదైన ఉన్నను సీతాపహరణముతో తన్ను దుఃఖపెట్టి మహాయుద్ధములో నాగపాశబంధాదులచే రామలక్ష్మణులను దెబ్బ తిని నెత్తుట దోగి నేలమీద పడగొట్టునట్టి రావణుని పట్ల అనుబంధ మున్నట్టు చెప్పుట సంభవమా? మనుష్యమాత్రు డట్లు చెప్పునా? ఎప్పుడో త్రేతాయుగములో ఎవనినో రాముడు వధించె నని ఏసం బంధము లేని ఈనాటివాడు నేడు రాముని దూషించుచున్నపుడు, సీతారామలక్ష్మణులను చెప్పశక్యము కానంత దుఃఖమునకు పాలు చేసిన రావణునిగూర్చి అప్పుడే ఆరాముడు — "మరణాన్తాని వైరాణి" అనుచు మరణపర్యంతమే వైర మని చెప్పునా? అది మానవలక్షణము కాదుగనుక రాముడు మానవుడు కాడందురా? లేదా? కొంచెము వినుడు—

విష్ణుసన్నిధిలో ద్వారపాలకులై యున్న జయవిజయులే ఈ రావణకుంభకర్ణులు. ఆవృత్తాంత మిదిగో—

బ్రహ్మమానసపుత్రులైన సనందనాదులు 5-6-సంవత్సరముల వయస్సుతో దిగంబరులుగా సంచరించుచు ఒకప్పుడు విష్ణులోకము నకు వెళ్ళగా అక్కడ ద్వారపాలకులైన జయవిజయులు-విష్ణుసన్ని ధికి వారిని వెళ్ళకుండ నిషేధించిరి.

"అశపన్ కుపితా ఏవం యువాం వాసం నచార్హతః ।
రజస్తమోభ్యాం రహితే పాదమూలే మధుద్విషః ॥
పాపిష్ఠా మాసురీం యోనిం బాలిశౌ యాత మాశ్వతః ।
ఏవం శప్తౌ స్వభవనాత్పతన్తౌ తౌ కృపాళుభిః ॥
ప్రోక్తౌ పునర్జన్మభిర్వాం త్రిభిర్లోకాయ కల్పతామ్ ।
జజ్ఞాతే తౌ దితేః పుత్రౌ దైత్యదానవవందితౌ ॥

హిరణ్యకశిపు ర్జ్యేష్ఠో హిరణ్యాక్షోఽనుజః స్మృతః ।
తత స్తౌ రాక్షసౌ జాతౌ కైకస్యాం విశ్రవస్సుతౌ ॥
రావణః కుంభకర్ణశ్చ సర్వలోకోపతాపినౌ ।
తత్రాపి రాఘవో భూత్వా న్యహనచ్ఛాపముక్తయే ।"

(భాగ-స్క- 7- అ 1)

వారప్పుడు కుపితులై- "రజస్తమో రహితమగు విష్ణువు పాదమూల మందు మీ రుండ దగదు. పాపిష్ఠమైన అసురజన్మ మీకు వెంటనే ప్రాప్తించుగాక" అని శపించి అస్థానమునుండి వారు పడుచున్నపుడు, "మీరు మూడు జన్మలతో మరల ఈస్థానమునకు రాగల" రని చెప్పిరి.

అంత, దితి గర్భమునుండి జ్యేష్ఠుడుగా హిరణ్యకశిపుడు, కనిష్ఠుడుగా హిరణ్యాక్షుడు జన్మించి దైత్యదానవవందితులై యుండిరి. తరువాత విశ్రవస్సువలన కైకసియందు రాక్షసులుగా రావణ కుంభకర్ణులు జన్మించి సర్వలోక సంతాపకులై యుండిరి. అక్కడ కూడ ఆవిష్ణువే రఘురాముడై ఆశాపవిముక్తి కొరకు వారిని వధించెను.

ఈగ్రంథ సందర్భమును బట్టి ఆ జయ విజయులే ఈరావణ కుంభకర్ణులు; ఆవిష్ణుమూర్తియే ఈ రఘురాముడు అని ధ్రువపడినది.

కనుక పూర్వానుబంధమును బట్టి రావణుడు తనవాడే అగుట చేతను, శాపవిముక్తికోసమే సంహరించుటచేతను "మరణాన్తాని వైరాణి" మరణాంతమే వైరమని, ఆపై దానిని తలపెట్టకూడ దని, "విభీషణా! ఈరావణుడు నీకు ఆత్మీయుడైనట్లు నాకును ఆత్మీయుడే" అని తమ పూర్వానుబంధమును రఘురాముడు సూచించెను. దీనినిబట్టి—

"విష్ణ్వవతార మనుకొను శ్రీరాముడు బంగారులేడి ఉన్నదని భ్రమించినట్లు, భార్యావియోగమునకు విలపించి మతిపోయి శోచనీయదశకు వచ్చెను.

కారణ మున్నను, లేకపోయినను ఆడుదానిమీద చేయి చేసి కొనుట క్షమింపరాని తప్పు. అంతటి పరాభవము చేసిననాడు ఆదోషము తగులకపోవునా?'' (పు 127) అనువ్రాత నిరస్తము.

శ్రీరాముడు కనకమృగమును చూచి భ్రమపడలేదు—

''అనేన హి నృశంసేన మారీచేన ... హింసితా మునిపుంగవాః ।
తస్మా ద్వధ్య స్త్వయం మృగః ॥''

ఇది కనకమృగముగా వచ్చిన మారీచుడు. మునిపుంగవులను హింసించిన ఈమృగరూపమారీచుని వధింపవలెను. అని చెప్పియే వెళ్ళెనని తెలుపుచున్నాము.

ఆడుదానిమీద (తాటకాశూర్పణఖాదులమీద) చేయి చేసి కొనుటను గూర్చి రఘురాముడే—

''పరోపతాపినో యే వై యే చోత్పథవిసారిణః ॥
తే హన్తవ్యా నృపై స్సర్వై స్సర్వలోకహితైషిభిః ॥''

ఎవరు అపమార్గము ననుసరించి లోకులను పీడించుచుందురో వారు-లోకహితముగా ప్రవర్తించు ప్రజాపాలకు లందరికి హంతవ్యులే అని చెప్పుటచేత, రాముని ఆక్షేపించువారి కిదియే సమాధానమని, ఇది వెనుక నిరూపింపబడిన దని తెలుపుచున్నాము.

''ప్రతివస్తువును చూచి ప్రశ్నించుచు అదిగో సీత యని పలువురు త్రోలుచు, వెర్రివెంగళప్పవోలె దీనుడై పోవుచు చిందులు త్రొక్కు ఈ ''దేభ్యమునకు'' దైవత్వ మంటగట్టి పూజింపు డనుట స్వార్థమో అజ్ఞానమో అనవలెను'' (136) అట!

ఈయనవలెనే అనుకొన్నవాడు రావణుడు. అందుచేతనే రాముని ధిక్కరించి ఆయనతో యుద్ధమునకు సిద్ధపడి ఓడిపోయి—

''ప్రయాహి జానామి రణార్దిత స్త్వామ్ ।
ఆశ్వస్య నిర్యాహి రథీ స ధన్వీ''

నీవు యుద్ధములో పీడితుడవై యున్నావుగనుక ఇంటికి వెళ్ళి, విశ్రాంతితీసికొని రథమెక్కి ధనుర్ధరుడవై రమ్ము. అని రామప్రభువు చెప్పి పంపగా రావణుడు వెళ్ళి చింతించెను.

"సర్వం తిత్థిలు మే మోఘం యత్తప్తం పరమం తపః ।
యత్సమానో మహేన్ద్రేణ మానుషేణ వినిర్జితః ॥"

అనితరసాధారణ మైన నాతపస్సంతయు వ్యర్థమైపోయినది. మనుష్యునిచేత నిర్జింపబడితిని అని.

రామదూత యైన హనుమంతు డొక్కడు శతయోజనసముద్రమును అవలీలగా దాటి, లంకలో ప్రవేశించి సీతాదర్శనము చేసి తనరాక రావణునకు తెలియునట్లు చేయదలచి అశోకవనమును పెకిలించి మీాద పడిన రాక్షస వీరులను ఏకాకియై చెండాడి, తుదకు రావణునిదగ్గరకు చేరి హితోపదేశము చేసి —
"జయత్యతిబలో రామః లక్ష్మణశ్చ మహాబలః" అనుచు గర్జించి లంకను దగ్ధము చేసి వెళ్ళినను, తరువాత వానరసేనతో సేతునిర్మాణ పూర్వకముగా సముద్రముదాటి వచ్చినను, అప్పటికికూడ శ్రీరాముడు మనుష్యుడే అనుకొనుట, సీతావియోగములో శ్రీరాముడు ప్రదర్శించిన శోకమోహాదులను బట్టియే అట్టి తాను జితుడై నా తపోబల మంతయు వ్యర్థమైపోయె నని చింతించుట సీతాదేవియందు తాను పెట్టుకొన్న అనుచితానురాగాతిశయమునుబట్టియే.

ఆస్థితి ప్రాప్తించుటకే సీతాదేవి శ్రీరాముని మృగము వెంట పంపి, తరువాత లక్ష్మణునికూడ పంపివేసి ఒంటరిగా తానుండి అపహరింపదలచిన రావణునకు అవకాశము కలుగజేసినది. ఆ సీతాదేవి — పూర్వము రావణుని శపించి నిన్ను వధించుటకు నేనొక మహాపురుషునకు పుత్రికగా పుట్టుదును. అని ఉద్ఘోషించిన వేదవతియేకదా!

ఈ విషయమునే వ్యాఖ్యాతలు వివరించియున్నారు. రావణుడు ముందు వచ్చు ముప్పు గుర్తింపలేక వీర్యదర్పముతో కుంభకర్ణ విభీషణాదుల మాట తృణీకరించి శ్రీరాముని ధిక్కరించిన ధిక్కరించు గాక.

ఆరావణునిచర్యలు పరిసమాప్తి పర్యంతము వాల్మీకముద్వారా స్వాయముగా తెలిసికొన్న ఈ రహస్యాలకర్త —

"ఈదేభ్యమునకు దైవత్వ మంటగట్టుట అజ్ఞానము" అని వ్రాయుట ఎంతసాహసమో, ఆ అజ్ఞానము వాల్మీకిదనుట ఎంత ధార్ష్ట్యమో పాఠకమహాశయులు గమనింతురుగాక. ఈయన చిందులు ద్రొక్కుచు ఒడలెరుగకుండచేసిన అల్లరికి అజ్ఞానమే కారణ మని మతిమంతులు తెలిసికొందురుగాక.

రహస్యాలకర్త వ్రాత— "సమయమునకు దగినట్లు మాటలు మార్చిన ఘట్టములు, చిన్నవో పెద్దవో అబద్ధములాడిన సందర్భములు రాముని జీవితములో ఎన్నో ఉన్నవి" (259) అట!

రామాయణములో– "అనృతం న హి రామస్య కదాచి దపి సమ్మతమ్"అని వాల్మీకి మహర్షి చెప్పియుండగా, ఈయన రామాయణరహస్యాలుగా అబద్ధము లాడినవాడు రాము డనుట ఎంత వ్యమో?

ఇంద్రజిద్యుద్ధములో ఇంద్రజిత్తును సంహరించుటకు లక్ష్మణ స్వామి తన బాణమును—

"ధర్మాత్మా సత్యసన్ధశ్చ రామో దాశరథి ర్యది।
సమరే చాఽప్రతిద్వన్ద్వః శరైనం జహి రావణిమ్॥"

అని అభిమంత్రించి ప్రయోగింప ఇంద్రజిత్తు హతుడయ్యెను. ఇప్పుడు శ్రీరాముడు-సత్యసంధు డగునో కాడో, ధర్మాత్ము డగునో కాడో ఈ యుదాహరణములో పాఠకమహాశయులు గ్రహింపగలరు కనుక ఇతోధిక మనవసర మని విడువబడినది.

—సీతాపారిశుద్ధ్యప్రదర్శనము—

రహస్యాల కర్త వ్రాత—

"అవతారపురుషు లైన శ్రీరాములవారు పదశకు వచ్చిరో, ఏమన్నారో చిత్తగించవలెను-ఇంతకాలము రావణునికొంపలో ఉన్న ఈ సీతను గ్రహించినచో లోకు లేమను కొందురో, విడిచినచో పాపము చుట్టుకొనునేమో అని బాధపడెను" అట!

"పశ్యత స్తాం తు రామస్య సమీపే హృదయప్రియామ్ !
జనవాదభయా ద్రాజ్ఞో బభూవ హృదయం ద్విధా ॥"

అనియుండుటను బట్టి తన సమీపమునకు వచ్చిన ఆ ప్రియు రాలిని చూచిన రామునకు స్వీకరించుటలో స్వతస్సిద్ధమైన అభి లాషయు, లోకాపవాదభయమును సంభవించినవి. అప్పుడు శ్రీరామునకు—

"రోషం హర్షం చ దైన్యం చ రాఘవః ప్రాప శత్రుహా"

రావణాధీనములో చిరకాలస్థితినిమిత్తముగా లోకదృష్టిని బట్టి తెచ్చిపెట్టుకొన్న రోషము, చిరకాలమై యెడబాసిన ఆమెను చూచుటలో హర్షము, చిరకాలమునుండి తన రాక నపేక్షించుచు బహుదుఃఖ మనుభవించినదని దైన్యము ఒక్కసారిగా ఉద్భవించినవి. లోకాపవాదము లేకుండ జేసికొనుటే ముఖ్య మని భావించి శ్రీరాము డామెతో నిట్లనెను –

"ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా ।
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి ... ॥"

నాయెదుట నన్ను నీవు కళ్లకలకవానికి దీపమువలె ప్రతి కూలముగా నున్నావు. అని.

రహస్యాల కర్త వ్రాత— "నేత్రరోగికి దీపమువలె రామునికి సీత కనిపించెనట! ఇది చక్కని ఉపమానము.

దీపములో దోషము లేదు. నేత్రములోనిదోషమే దీపమును చూడనీయదు. అట్టి దోషము రామునియందే కలదు." (140)

ఈ వ్రాతలో సీత పరిశుద్ధురా లనియే గ్రహించినందుకు సంతోషము. 'దీపమును చూడ నీయనిది నేత్రములోని దోషము- అనుటలో— ఇదివరకు చూచిన 'నేత్రమే అది యగుచున్నందున, ఆదోషము ఆగంతుకదోషమే అనవలెను. అట్టి ఆగంతుకదోషము లోకాపవాదభయమే అగును. అదియే చెప్పబడినది— 'జనవాద భయాద్రాజ్ఞో బభూవ హృదయం ద్విధా'అని.

"తన సందేహమనెడి దోషముచేతనే పవిత్రమైన సీతను తిరస్కరించెను" అనుట అయుక్తము, అసంబద్ధము.

అన్తరాత్మ చ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీమ్"

సీత పరిశుద్ధురా లని నా అన్తరాత్మ కెరుక. అని శ్రీరామునకు సీతాదేవిపట్ల సందేహమా?

"లక్ష్మణే వాథ భరతే కురు బుద్ధిం యథా సుఖమ్ ।
శత్రుఘ్నే వాఽథ సుగ్రీవే రాక్షసే వా విభీషణే ॥
నివేశయ మన స్సీతే యథా వా సుఖ మాత్మనః ।"

లోకాపవాదము లేకుండ జేసుకొనుటకై ఆమె తన పారిశుధ్యమును లోకమునకు ప్రదర్శింపవలె నను తాత్పర్యముతో మాటలాడు శ్రీరాముడు-లక్ష్మణ-భరత-శత్రుఘ్నులు, సుగ్రీవ-విభీషణులు-వీరిలో ఎవరి నైనను రక్షకులనుగా చేసికొని యుండుము. అనెను.

రహస్యాల కర్త వ్రాత--

"రావణు డంటుకొన్నాడన్న కారణముచేతనే సీత శీలము చెడిపోయె నని, మరొక మగనిని చేరి సుఖపడుమని, ఆమగల పేరులు కూడ వినిపించి రోతగా బలికిన శ్రీరాముడు ఆదర్శపురుషుడా?" (పుట 145) అట.

"అన్తరాత్మా చ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీమ్" అని కంఠోక్తిగా అన్న శ్రీరాముని- "రావణు డంటుకొన్నాడని, సీత శీలము చెడిపోయెనని, అను కొన్నాడని చెప్పుట అసంబద్ధప్రలాపము. 'పవిత్ర మైన సీత' అన్ననోటితో--'సీత పరిశుద్ధురా లని నా అన్తరాత్మ కెరుక' అన్నట్టి శ్రీరాముడు-- 'మరొక మగనిని చేరి సుఖపడుమని చెప్పె'ననుటకు నోరెట్లు వచ్చినదో! లక్ష్మణ-భరత-శత్రుఘ్నాదులను మగ లనుటకు ఎట్లు సిగ్గు లేకపోయెనో?

'వాల్మీకి చిత్రించిన శ్రీరాముని శీలమునకు వ్యాఖ్యాతలు విచిత్రమైన అన్వయము చూపిరి--

"కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవిదాం ప్రభుః ॥
ఉపేక్షసే కథం సీతాం పతన్తీం హవ్యవాహనే ॥
కథం దేవగణ శ్రేష్ఠ మాత్మానం నావబుధ్యసే ।
ఉపేక్షసే చ వైదేహీం మానుషః ప్రాకృతో యథా ॥"

రామచంద్రా! నీవు సర్వలోకకర్తవు; సర్వజ్ఞుడవు. నీవు దేవదేవుడవై యుండి ప్రాకృతమానవుడువలె జానకిని ఉపేక్షించు చున్నావేమి?

"భవా న్నారాయణో దేవః శ్రీమాన్ చక్రాయుధః ప్రభుః ।
సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుః...
వధార్థం రావణ స్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్ !
సహతో రావణో రామ ప్రహృష్టో దివ మాక్రమ ॥"

నీవు విష్ణుదేవుడవు; సీత లక్ష్మీదేవి, నీవు రావణవధార్థము మానవదేహము ధరించినావు; రావణసంహారమైనది; ఇక నీవు నీలోకమునకు రావలెను. అని.

"అమోఘా స్తే భవిష్యన్తి భక్తిమన్తో నరా భువి"

శ్రీరామా! నీభక్తులు అమోఘసంకల్పు లగుదురు. అని శ్రీరాముడు సర్వోపాస్యు డని సర్వాభీష్టప్రదాత యని బ్రహ్మ కీర్తించు నంతట అగ్నిదేవుడు సీతాదేవిని తీసికొని దివ్యరూపముతో ఆ జ్వాలలనుండి లేచి సాక్షాత్కరించి యథాపూర్వకముగా నున్న సీతాదేవిని చూసి—

"ఏషా తే రామ వైదేహీ పాప మస్యాం న విద్యతే ॥"

ఇదిగో నీపత్ని, ఈమె నిర్దోషురాలు. అని పలికెను. ఆ మాటపై శ్రీరాము డిట్లనెను—

"దీర్ఘకాలోషితా హీయం రావణాన్తఃపురే శుభా ।
బాలిశో బత కామాత్మా రామో దశరథాత్మజః ॥
ఇతి వక్ష్యతి మాం లోకో జానకీ మవిశోధ్య హి ।"

ఈమె శుభస్వభావముకలదే అయినను చిరకాలము రావణాధీనములో నున్న కారణముచేత జానకిని శోధింపని యెడల రాముడు

అజ్ఞాని, కామాత్ముడు అని లోక మనిపోవు నని ఈపని చేయవలసి వచ్చినది.

"అనన్యా హి మయా సీతా భాస్కరస్య ప్రభా యథా॥"

సూర్యకాంతికి- సూర్యునకువలె-నాకును -సీతకును అవినాభావమే. అని చెప్పెను.

గ్రంథ మిట్లుండగా ఈరహస్యాలకర్త ఏమి చూచి వ్రాసినట్లు? ఈయనకు గ్రంథముతో పని లేదు. వ్యాఖ్యాతలతో పనిలేదు. ఏదో దురభిప్రాయము మనస్సులో పెట్టుకొని రామాయణమును, వ్యాఖ్యాతలను నోటికివచ్చినట్లు తిట్టెడి వ్రాతకు -'రామాయణ రహస్యాలు' అని పేరు పెట్టుట, లోకవంచన మగునో కాదో పాఠక మహాశయులే గ్రహింతురుగాక!

రామాయణమున ఆదిలో విష్ణువే రాముడుగా అవతరించె నని చెప్పబడినది. రావణవధానంతరము ప్రత్యక్షమైన బ్రహ్మ- నీవు సర్వలోకకర్తవు; సర్వజ్ఞుడవు; రావణవధార్థమై అవతరించిన విష్ణు దేవుడవు. అని పలికెను.

ఈ ఉపక్రమోపసంహారములను బట్టి వాల్మీకికి రాముడు విష్ణువే, మానవమాత్రుడు కాడనియే తాత్పర్యమని గ్రహించి వాల్మీకితాత్పర్య మనుసరించియే, విద్వద్వరిష్ఠులగు వ్యాఖ్యాతలు గ్రంథమును సమన్వయము చేసియున్నారు. ఆవ్యాఖ్యాతలను నిరసించుచు ఏదో చెప్పబూనువారు లోకహితము కోరినవారు కారని, యథార్థము తెలిసికొనగలవారు కారని గ్రహింపవలసియున్నది.

## శ్రీరాముడు — శంబుకుని తపశ్చర్య.

రహస్యాలకర్త వ్రాత —

1. "ఎవడో ఏదో గారడి చేసి పిల్లవాడు చచ్చెనని ఘోషపెట్టి త్వరపెట్టుటచే శ్రీరాముడు గుడ్డియెద్దువోలె గబగబ పోయి శంబుకుని జంపవచ్చునా?" (144)

లక్ష్మణాదులయందు మనస్సు ఉంచుకో! అనగా వాండ్రను భర్తలుగా జేసికొమ్మని కాదట!

పుత్రసమానులైన లక్ష్మణాదులు ఇండ్లలో వాండ్ర రక్షణ క్రింద ఉండుమని భావ మట!' (139)

పై శ్లోకములకు వ్యాఖ్యాతలు చెప్పిన భావము బాగులేదట! ఈయన చెప్పిన భావము పై శ్లోకములలో ఉన్నదా?

'లక్ష్మణే వాఽథ భరతే శత్రుఘ్నే వా కురు బుద్ధిమ్ ।'

'అథ సుగ్రీవే రాక్షసే వా విభీషణే నివేశయ మనః ।'

అన్నపుడు 5 పేరులును మగల పేరులే అనుటకు నోరెట్లు వచ్చినది? "అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్' అని రావణునితో ఘోషించిన విభీషణుడు ఒక మగడా?

"పరస్వహరణే యుక్తం పరదారాభిమర్శకమ్ ।

త్యాజ్య మాహు ర్దురాత్మానం వేశ్మ ప్రజ్వలితం యథా ॥'

పరదారాభిమర్శకుడు దురాత్ముడని చెప్పిన విభీషణుడు ఒక మగడా? ఇక సుగ్రీవునిమాట—

"అహం య ద్యహారం భార్యాం రాజపుత్రస్య ... ।

కిం తత్ర తవ సుగ్రీవ కిష్కిన్ధాం ప్రతి గమ్యతామ్"

నేను రామభార్య నపహరించిన నీకేమి పోయినది? నీవు కిష్కింధకు వెళ్ళిపొమ్ము. అను రావణుని మాటపై సుగ్రీవుడు— "ఏకం దుఃఖం సుఖం చ నౌ" అని శ్రీరామునితో అగ్నిసాక్షిగా సఖ్యము చేసికొన్నవాడగుటచే నామిత్రునకు శత్రువగు నీవు నాకును శత్రువవే—

"నిహ న్మ్యహం త్వాం ససుతం సబన్ధుం సజ్ఞాతివర్గం రజనీచరేశ"

నిన్ను సపరివారముగా సంహరింతును. అన్నసుగ్రీవుడు ఆ రామపత్నికి ఒక మగడా? ఇక లక్ష్మణుడు—

"రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్"

అనుచు రాముని దశరథునిగా, జానకిని నన్నుగా తెలిసికొను మని చెప్పిపంపిన సుమిత్రామాత ఆదేశమనుసరించి ప్రవర్తించు లక్ష్మణుడు ఆసీతకొక మగడా?

ఇక భరతశత్రుఘ్నులు—

"కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః।
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః॥"

జ్యేష్ఠానువర్తి, జితేంద్రియుడు, ధర్మాత్ముడు అగు భరతుడు, ఆతని ననువర్తించు శత్రుఘ్నుడు ఆరామపత్నికి మగలా?

"భరతుని శీలము తెలిసియు అంత మంచివానిని పరీక్షింప వచ్చునా?" (252) అన్ననోటితో ఆ భరతుడు ఆరామపత్నికి ఒక మగడనుటకు నోరెట్లు వచ్చినది?

చాలుచాలు! సిగ్గుసిగ్గు! ఈయనపండితుడట? ఏమిపాండిత్యము? ఏమి నిరంకుశత్వము? శాన్తం పాపమ్.

అప్పుడు సీతాసాధ్వి శ్రీరాముని అభిప్రాయము గ్రహించి, అగ్నిప్రవేశము చేయనెంచి, తాను చేయు పనిని చూడలేక తలవంచుకొనియే యున్న పతికి ప్రదక్షిణముచేసి అగ్నిసమీపమున నిలిచి దేవతలకును, మునులకును నమస్కరించి దోసిలి యొగ్గి యిట్లనెను—

"యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్ ।
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః ॥
యథా మాం శుద్ధచారిత్రాం దుష్టాం జానాతి రాఘవః ।
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః ॥"

నా హృదయము ఎన్నడును రామప్రభువును విడిచి యుండనిదైనచో- రామప్రభువుచే అన్యథా భావింపబడు నేను శుద్ధచరిత్రురాలనే అయి యున్నచో— లోకసాక్షియగు అగ్నిదేవుడు నన్ను సర్వతః కేశాంబరాదులకుగూడ హాని కలుగకుండ రక్షించుగాక!

అని పలికి అగ్నికి ప్రదక్షిణముచేసి నిశ్శంకగా అగ్నిలో ప్రవేశించెను. అప్పుడు బ్రహ్మాదిదేవతలు విమానములమీద వచ్చి దోసిలియొగ్గి నిలబడియున్న శ్రీరామునితో నిట్లనిరి-

2. "రామా! నీపరిపాలనలో నీరాజధానిలోనే తల్లిదండ్రు లుండగా బ్రాహ్మణబాలుడు చావవలసివచ్చెనే" అనినోరు గల బ్రాహ్మణులు కొందరు కోటలోనికి జొచ్చి రాముని మందలించి దాని కారణము శూద్రతపస్వి తపస్సని స్పష్టపరచి శంబుకుని జంపించిరి.

3. వసిష్ఠుని జన్మ మెట్టిదైన వారు తుదకు బ్రాహ్మణులే అయిరి. ఇట్లే వెనుకటివా రందరు కులాంతో బనిలేకయే జ్ఞానము సంపాదించుకొని ఋషీశ్వరులైరని తెలసికొన్నచో శంబూకుని జంపిన శ్రీరాము డెంత అవివేకియో అర్థ మగును." (ప్ర 121)

4. "శూద్రుడై పుట్టెనని వంకపెట్టి బ్రహ్మజ్ఞానమునకు తగడని తీర్పు చెప్పి వానికి తపస్సు చేయుట కధికారము లేదని కుట్ర పన్ని శంబుకుని చంపిన శ్రీరాముని ధర్మశాస్త్రపరిజ్ఞానము వెర్రితలలు వైచి వెలగినది." అట! ( 6 )

ప్రథమాంశము—"ఎవడో గారడి చేసి పిల్లవాడు చచ్చెనని ఘోష పెట్టెనట" ఇది రామాయణములో లేదు. 'ఇది శంబుకవధ' కర్త వ్రాసినది. చూడుడు— "వసిష్ఠులవా రెంత తంత్రజ్ఞులు? కుర్రవానిని మూర్ఛ పోగొట్టి శంబుకర్షి తపంబుచే మరణించె నని చెప్పనచ్చిరి" అట! దీసనే శబ్దభేదముతో వ్రాసి "వాల్మీకిరామాయణరహస్య" మని చెప్పిన ఈ ప్రబుద్ధుని ఏమనవలెను? ఈయన అన్నట్టి గుడ్డియెద్దు ఈయన యగునా? ఆశ్రీరాము డగునా?

ద్వితీయాంశము — 'నీ రాజధానిలో బ్రాహ్మణబాలుడు చావవలసివచ్చెనని నోరు గల బ్రాహ్మణులు రాముని మందలించి, దానికి కారణము శూద్రతపస్సని చెప్పి శంబుకుని చంపించి రట!" ప్రథమాంశప్రకారము— గారడి చేయుటచే చావనట్టి బాలునే చచ్చినట్టు నోరుగల బ్రాహ్మణులు చెప్పి ఆచావునకు శంబు తపస్సు కారణమని శంబుకుని చంపించిరట! ఇది 'శంబుకవధ' కర్త

"శ్రీరామచంద్రుడు బ్రాహ్మణుల చేతిలో కీలుబొమ్మ" అని వ్రాసినదానికి రూపాంతరము.

చావనివానిని చచ్చినట్లు చెప్పినారు నోరుగల బ్రాహ్మణులా? వారుచెప్పుటచేత శంబుకుని చంపినవాడు శ్రీరాముడా?

హద్దు మీరిపోయిన ఈవ్రాత వీరికి గల నిర్హేతుకబ్రాహ్మణవిద్వేషమును, శ్రీరామునియందు శత్రుత్వమును చాటుచున్నది.

తృతీయాంశము— "కులాలతో పనిలేకయే వెనుకటి వారు జ్ఞానము సంపాదించుకొని ఋషీశ్వరు లైరని తెలిసికొన్నచో శంబుకునిచంపిన శ్రీరాము డెంత అవివేకియో అర్థ మగు" నట!

ఆనాటి ఋషీశ్వరుల సాహచర్యము కల శ్రీరాముడు ఆనాటి వారి కులములు, వారి జ్ఞానసంపాదనము పూర్తిగా తెలిసియున్నవాడు. వారి మొగమే ఎరుగకున్నవాడు ఈయన.

ఇట్టి స్థితిలో ఈయన అన్నట్టి అవివేకి ఈయన అగునా? శ్రీరాము డగునా? "వసిష్ఠుని జన్మ మెట్టిదైన వారు తుదకు బ్రాహ్మణులే అయి" రట! ఆవసిష్ఠుని యావద్వృత్తాంతము తెలిసికొన్నవాడు శ్రీరాముడు. ఆయన మొగమే ఎరుగకున్నవాడు ఈయన. కనుక ఎటు చూచినను అవివేకి ఈయనయే కాని శ్రీరాముడు కాడు. అని చెప్ప వలసివచ్చుచున్నది.

చతుర్థాంశము—"శూద్రుడై పుట్టెనని వంక పెట్టి బ్రహ్మజ్ఞానమునకు తగడని చెప్పి వానికి తపస్సుచేయుట కధికారము లేదని కుట్రపన్ని శంబుకుని చంపిన శ్రీరాముని ధర్మశాస్త్రపరిజ్ఞానము వెఱ్ఱితలలు వైచె" నట!

'శంబుకవధ' కర్త— "ప్రతిపక్షరచితగ్రంథము లగుటచే స్మృతులు మన కాదరణీయములు గావు" అన్నారు. దానికి భంగ్యంతరమే ఈవ్రాత.

'వెఱ్ఱితలలు వైచి వెలిగినది' శ్రీరాముని ధర్మశాస్త్ర పరిజ్ఞానము కాదు. ఈయన ధర్మశాస్త్రపరిజ్ఞానరాహిత్యము. వాల్మీకి

రామాయణపరిజ్ఞానరాహిత్యము—అట్లు వెలిగిన దని చెప్ప వల సి యు న్నది.

ఆ శంబుకుడు— "బ్రహ్మజ్ఞానమునకు తగ డని తీర్పుచెప్పి" అట! శంబుకుని పట్ల బ్రహ్మజ్ఞానప్రసక్తి ఏమి వచ్చినది! అతడు బ్రహ్మజ్ఞానము నపేక్షించినవాడు కాడే? "వానికి తపస్సు చేయుట కధికారము లేదని కుట్రపన్ని" అట! "నియమేషు తపశ్శబ్దః" అని నియమావలంబనము తప స్సనబడును. బహువిధము లైన ఆ నియమములలో ఏవి అన్యులకు 'అపాయకరములు కాకుండునో వాని నవలభించుట యుక్తము. అందుచే అన్యులకు అపాయకరమైన నియమము నవలబించినవాడు శంబుకు డగుటచే ఆతపస్సు అతనికే అయుక్తమైనట్లు తెలిసికొనవలెను.

ఆశంబుకు డవలంబించిన విధానము— "అవాక్ఛిరా స్తథా భూతః" తలక్రిందుగా ఉండి తపస్సుచేయుట. అది ఒకని అకాల మరణమునకు కారణమైనది. దానిని గ్రహించినవాడు దివ్యదృష్టిగల దేవర్షి యగు నారదమహర్షి. వసిష్ఠులవారు కాదు. ఇట్లు పై 4అంశములు నిరస్తములు.

ఆ శంబుకుని అభీష్టము—

"దదర్శ రాఘవ శ్శ్రీమాన్ లంబమాన మధోముఖమ్ ।
ఉవాచ చ నృపో వాక్యం ధన్య స్త్వ మసి సువ్రత ॥
కౌతూహలా త్త్వాం పృచ్ఛామి రామో దాశరథి ర్హ్యహమ్।
కోఽసౌ మనీషిత స్తుభ్యం స్వర్గలాభః పరోఽథ వా ॥
పరాశ్రయో యదర్థం త్వం తపస్యసి సుదుశ్చరమ్ ।
య మాశ్రిత్య తప స్తప్తం శ్రోతు మిచ్ఛామి తాపస ॥

శ్రీరాముడు పుష్పకవిమానముమీద వెళ్ళి అధోముఖముగా వేల్రాడుచున్న అతనిని చూచి— "ధన్య స్త్వ మసి సువ్రత" నీవు ధన్యుడ వని చెప్పి, దశరథరాముడనైన నేను కుతూహలముతో నిన్ను అడుగుచున్నాను. దేవతాపరలభ్యమైనట్టి నీ అభీష్టము స్వర్గ లాభమా?

మరియొకటా? వినదలచినాను. నీ కోరిక ఏదో చెప్పుమని అడుగగా ఆశంబుకు డిట్లు చెప్పెను—

"శూద్రయోన్యాం ప్రజాతోఽస్మి తప ఉగ్రం సమాస్థితః ।
దేవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాయశః ॥
న మిథ్యాఽహం వదే రామ దేవలోకజిగీషయా ।
శూద్రం మాం విద్ధి కాకుత్స్థ శంబుకో నామ నామతః ॥"

నేను శంబుకు డను పేరు గల శూద్రుడను. ఈ శరీరముతోనే దేవత్వప్రాప్తిని కోరి ఉగ్రతపస్సు నవలంబించియున్నాను. నేను అసత్యమాడువాడను కాను. అని ఈశరీరముతో స్వర్గప్రాప్తి కోరిక. అనెను.

దీనినిబట్టి ఆతడు జీవితేచ్ఛ కలవాడు కాడని స్పష్టమైనది. ఇక ఆ శరీరముతో దేవత్వప్రాప్తియందు ఇచ్ఛకలవాడును, దుశ్చరమైన ఉగ్రతపస్సు చేయుచున్నవాడును అయియుండెను.

ఆ తపస్సునకు ఆ అభీష్టము అసంభవమైనప్పుడును-ఆ ఉగ్ర తపస్సు ఒకనికి అకాలమరణరూపమైన అపాయము కలిగించి యున్నపుడును,-జీవితేచ్ఛ ఏమాత్రము లేనట్టి శంబుకునకు స్వర్గప్రాప్తికై ఆ శరీరవియోగమే కర్తవ్యముగా శ్రీరాముడు భావించినట్లు తెలిసికొనవలసి యున్నది.

అంత దుష్కరతపశ్చర్యలోనున్న శంబుకునిచూచి శ్రీరాముడు- "ధన్య స్త్వ మసి సువ్రత" అని అభినందించెనేకాని ఆగ్రహింపలేదు. అట్టి తపస్సునకు పూనుకొనుటలో ఆతని అభీష్ట మేదో అడిగి తెలిసికొనెను కూడను.

అది ఎందుకు తెలిసికొనెను? ఆ అభీష్టము సిద్ధింపజేయుటకును, ఆ ఉగ్రతపస్సును ఆతడు మానుటకును, కనుకనే కాళిదాసమహాకవి—

"కృతదండ స్స్వయం రాజ్ఞా లేభే శూద్ర స్సతాం గతిమ్"

అనుచు శూద్రతపస్వి రామప్రభువుచే స్వయముగాదండింపబడి సద్గతిని పొందెను. అని ప్రశంసించెను. ఆబ్రాహ్మణబాలుడు జీవించెననుటకు కూడ సాక్ష్యము మహాభారతవచనము—

"శూద్రయుతే శంబుకే శూద్రే హతే బ్రాహ్మణదారకః ।
జీవితో ధర్మమాసాద్య రామాత్సత్యపరాక్రమాత్ ॥"

(శాంతి ప– అ 153)

దీనిని బట్టి ఇటు శంబుకునకు సద్గతి, అటు బాలునకు జీవితసిద్ధి శ్రీరామానుగ్రహముచే లభించిన వని తెలిసికొనవలెను.

కనుకనే మురారిమహాకవి—శ్రీరామవాక్యముగా ఇట్లు చెప్పెను—
"ఖడ్గధారేయ మస్తినః । అదవీయా నయం పన్థాః స్వర్లోక ముపతిష్ఠతే"

స్వర్లోకప్రాప్తికి శ్రీరాముని ఖడ్గధారి దగ్గరదారి. అని. మరియు భవభూతిమహాకవి—ఉత్తరరామచరితములో వధింపబడిన శంబకుడు దివ్యరూపముతో శ్రీరామునకు గోచరించి అన్నమాట ఇట్లు చెప్పెను—

దత్తాభయే త్వయి యమా దపి దండధారే
సంజీవిత శ్శిశు రసౌ మమ చేయ మృద్ధిః ।
శంబూక ఏష శిరసా చరణౌ నతస్తే
సత్సంగజాని నిధనా న్యపి తారయన్తి ॥"

శ్రీరామా! యమునిగూడ దండించెడి నీవు, మరణించిన బాలుని గూర్చి అభయదానము చేయగా ఆ బాలుడు జీవించెను. నాకు ఈసమృద్ధి కలిగెను. ఈశంబుకుడు నీపాదములకు వందనము చేయుచున్నాడు. మరణములుకూడ సత్సంగజములైనపుడు తరింప చేయుచుండును. అని. దీనిని ప్రతివాదులు అవగతము చేసికొందురు గాక.

ఇట్లు కాళిదాస-భవభూతి-మురారి-మహాకవులు-రామప్రభువు శంబుకతపస్విని, స్వయముగా వెళ్ళి చూచి కోరిక తెలిసికొని కృతార్థుని చేసె నని ప్రశంసింపగా, అది ఘోరకార్య మను వారిది దుర్వాదము. ఉగ్రతపస్సు చేయు ఆశంబుకుని యొద్దకు స్వయముగా వచ్చి సల్లాపపూర్వకముగా సంభాషించిన శ్రీరాముడు ఒక్క పరుష

వచనమైన ఆడలేదు. ఆయన అభీష్టము తెలిసికొనియే ఆపని చేయుట-అభీష్టము సిద్ధింపజేయుటకే. ఇట్టి స్థితిలో —

రహస్యాలకర్త — "రాముడు గుడ్డిఎద్దు- రాముని ధర్మ శాస్త్రపరిజ్ఞానము వెర్రితలలు వైచి వెలిగినది-" ఇత్యాది

దుర్భాషలాడినందుకు —'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం' 153 అని రామునిగూర్చి ఈయన అన్నట్టి ఈకర్మ ఫలము అనుభవింపవలసియే యున్న దని తెలుపుచున్నాము.

రహస్యాల ర్త — "శ్రీరాముని అవతారపురుషు డని ఎంచి అతనికి ఆలయములు కట్టించి రామకోటి వ్రాసి సీతారామకళ్యాణ ములు కావించి నేటికిని గొలుచున్న శంబుకజాతీయుల చేష్టలను విచారింపవలసియున్నది' (128)

అనుటచే శ్రీరామవైరిగా తయారయిన ఈయన చేష్టలను శంబుకజాతీయులు విచారింపవలసియున్నదో, శంబుకుని అభీష్టము సిద్ధింపజేసిన శ్రీరాముని ఆరాధించునట్టి శంబుకజాతీయుల చేష్టలను ఈయన విచారింపవలసియున్నదో పాఠ మహాశయులేగమనింతురుగాక.

"యే రామం న భజిష్యన్తి తే నరా జఠరం స్వకమ్ ।
న భర్తుం శక్నువ న్తే తే వస్త్రభోగాదివర్జితాః॥"

రాముని భజింపని వారు కడుపునిండ తిండిలేనివారగుదురు. అను సూక్తి స్మరణీయము.

నరజన్మమునకు పూర్వదశ వానరజన్మ మట!

రహస్యాలకర్త వ్రాత— "నరుడుగా పుట్టిన శ్రీమన్నారాయ ణునకు ఈజన్మలో వానరులే తోడైరి.

నరజన్మమునకు వానరజన్మము పూర్వదశ యుండునుకదా!, (153) అట!

ఆ నరుడుగా పుట్టినవాడు శ్రీమన్నారాయణుడు కనుకనే వానరులు తోడనుట, ఆ రాముకార్యమే తనకార్యమని యెంచి

సహజమైన భక్తితో తమ శరీరము లర్పించి దిగ్విజయము సాధించుట జరిగినది.

అట్టి స్థితి వానరులవలన మరి ఏనరునకు జరిగినది?
కనుక శ్రీరామునకు వానరులు తోడైరని — 'నరజన్మమునకు వానర జన్మము పూర్వదశ' అనుట అసంబద్ధము.

నీతినియమములలో' న్యాయావలంబనములో ఆనాటి ఆ వానరులకు, ఇటువంటి ఈనాటి నరులే తీసికట్టగుటచే ఇట్టి నరజన్మ అట్టి వానరజన్మముకంటె ప్రశస్తము కానే కాదు.

ఆ నరుడుగా పుట్టినవాడు శ్రీమన్నారాయణుడని తెలిసినపుడు వానరులుగా పుట్టినవారెవరో పాపము ఈయనకు తెలియలేదు కాబోలు!

"మానుషం రూప మాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః ।
సర్వైః పరివృతో దేవైః వానరత్వ ముపాగతైః ॥"

అని చెప్పిన మండోదరికి ఆవానరులు దేవతలే అని తెలిసినది.
"వానరులే తోడైరి" అట! వానరులుకూడ తోడైరి అని తెలిసికొనుడు.

"యాన్తి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్ ।
అపస్థానం తు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి ॥"

న్యాయముగా ప్రవర్తించువానికి తిర్యగ్జంతువులుకూడ సహాయపడును. అన్యాయముగా ప్రవర్తించువానిని సోదరుడు (విభీషణుడు) కూడ విసర్జించును.

ఆవానరుల పూర్వదశ దేవతలగుటచేత, ఆనరుని పూర్వదశ నారాయణుడగుటచేత "నరజన్మమునకు పూర్వదశ వానరజన్మము" అను దుర్వాదము నిరస్తమైనది.

## —గర్భసంబంధము లేకుండ జన్మించిన వ్యక్తులు—

రహస్యాల కర్త వ్రాత—

1. "మానవసహజముగా పరస్పరము కలియుట- గర్భోత్పత్తి- నవమాసములు- ప్రసూతి- ఇత్యాదిధోరణి కాక, నేడు పశు

వైద్యులు పశువులకు కృత్రిమ గర్భోత్పత్తి కల్పించుచున్న
విధముగా వసిష్ఠాదుల పుట్టుకలు సాగిన వనవచ్చును.
అట్టి సంతానములలోనే అలౌకికమహిమలు కల్పించును.
వానిని అయోనిజులన్న పేరుతో మరింత మహిమతో మిశ్రము
చేసి ఆరాధింతురు.
సీత-ద్రౌపది వసిష్ఠుడు- ద్రోణుడు- కుంభసంభవుడు-
మున్నగువారందరు ఈజాతివారే.
వీరి దుర్గుణములు సుగుణములుగా ఆరోపించి పురాణ కథలుగా
వినిపింతురు" (120) అట!

2. "అమ్మ- అయ్యలు- లేక ఏపుట్టకో, ఏదొప్పకో, ఏచిప్పకో,
ఏకుండకో పుట్టి పెరిగి బ్రహ్మర్షు లనిపించుకొన్న వారే సనాతన
మహర్షులు" (165) అట!

ఇక్కడ ప్రథమాంశములో— వసిష్ఠాదుల పుట్టుకలు పశు
వైద్యులు- పశువులకు కృత్రిమ గర్భోత్పత్తి కల్పించుచున్నట్లు
సాగినవట" "వానిని అయోనిజులన్న పేరుతో ఆరాధింతు" రట!
వసిష్ఠాదులందరు ఈజాతివారే' అట!

అయితే పశువైద్యులు పశువులకు కల్పించు కృత్రిమగర్భో
త్పత్తివలన పుట్టినవి గర్భమునుండి పుట్టినవే అగును. వానికి అయో
నిజు లన్న పేరు అసంభవము. అయోనిజు లన్న పేరున్నపుడు కృత్రి
మగర్భోత్పత్తి ద్వారా పుట్టుట అసంభవము కనుక ఈవ్రాత పరస్పర
విరుద్ధము.

మరియు ద్వితీయాంశములో చెప్పినట్లి—అమ్మ -అయ్య లేక
ఏపుట్టకో, ఏకుండకో పుట్టినవారే బ్రహ్మర్షులు కాబట్టి వారి పుట్టుకల
కు పశువైద్యుల కృత్రిమ గర్భోత్పత్తిని నిదర్శనముగా చెప్పుట అసం
బద్ధప్రలాపము. వారిదుర్గుణములు సుగుణములుగా ఆరోపించి
పురాణకథలుగా వినిపింతు" రట! వారిదుర్గుణములు సుగుణములుగా
వారు ఆరోపించినారా? వారి సుగుణములు దుర్గుణములుగా వీరు

ఆరోపించినారా? పాఠకులే గ్రహింతురుగాక. "మానవసహజముగా గర్భోత్పత్తి- ప్రసూతి-పద్ధతిగా గాక వారు పుట్టినా" రని వీరి ఆక్షేపము. ఇక్కడ కొంచెము చెప్పుచున్నాము—

పంచాగ్నివిద్యా ప్రస్తావములో- మనుష్యశరీరోత్పత్తి గర్భసంబంధము ద్వారా కలుగుటే చెప్పబడి, పుణ్యాధిక్యము కలవారి శరీరోత్పత్తిమాత్రము గర్భసంబంధము లేకనే కలుగునని చెప్పబడినది. వినుడు—

"అగ్నౌ ప్రాస్తాఽఽహుతి స్సమ్య గాదిత్యం ప్రతిపద్యతే ।
ఆదిత్యా జ్జాయతే వృష్టిఃవృష్టే రన్నం తతః ప్రజాః ॥
అగ్నీన్ పంచక్రమా త్ప్రాప్య హవ్య మేతి మనుష్యతామ్ ।
అగ్నయ స్త్వగ్ని రర్కః క్ష్మా పురుషో యోషి దిత్యపి ॥"

అగ్నియందు సమర్పించిన ఆహుతి ఆదిత్యుని చేరును. ఆ ఆదిత్యునివలన వర్షము సంభవించును. ఆవర్షమువలన అన్నము సంభవించును. ఆ అన్నమువలన శుక్రశోణితములద్వారా స్త్రీగర్భమునుండి మనుష్యశరీరములు కలుగుచుండును.

ఇట్టి-అగ్ని-ఆదిత్యుడు-పృథివీ-పురుషుడు యోషిత్- అను ఈ అయిదును పంచాగ్నులు. వీనిలో అయిదవ స్త్రీ వలన జన్మించుట, మానవసహజముగా గనబడు విషయము.

"ద్రోణో వహ్నిచతుష్కోత్థో యోషి దగ్నే రభావతః ॥"

స్త్రీ గర్భసంబంధము లేకుండ జన్మించిన ద్రోణుడు— వహ్నిచతుష్టయసంభూతుడే.

"అగ్నిత్రయోత్థితా సీతా భూత్వా పిత్రో రభావతః"

తల్లి తండ్రు లిద్దరి సంబంధము లేక పృథివినుండియే జన్మించిన సీతాదేవి వహ్నిత్రయ సంభూతురాలే.

"క్షిప్తమాత్రం హవి ర్వహ్నౌ మిథునత్వ ముపాగతమ్ ।
ఏకాగ్నిజా వతః పుత్రౌ ద్రుపదస్య సురాధికౌ ॥"

ద్రుపదుని పుత్రీపుత్రులగు ద్రౌపదీధృష్టద్యుమ్నులు అగ్ని యందు హవిస్సు వేసిన వెంటనే ఉద్భవించుటచేత వారిద్దరు ఏకాగ్ని సంభూతులే. కనుక వారు దేవతలకంటె పుణ్యాధిక్యము కలవారు. అని. మరియు—

వారెట్లు పుట్టినను పూజ్యులే, పవిత్రులే. "కౌశేయం కృమి జమ్" ఒకానొక పురుగునుండి పుట్టినదే - పట్టుబట్ట. "పంకాత్తామ రసమ్" బురదనుండి పుట్టినదే- పద్మము. ఇవి ఎట్టి పూజ్యములో, పవిత్రములో అట్లే పుట్టకు — దొప్పకు - చిప్పకు — కుండకు - పుట్టినను వారు జగత్పూజ్యులై పరమపవిత్రులై ప్రకాశించిరని తెలిసికొనవలెను. ఇట్లు రహస్యాలకర్త వ్రాత నిరస్తము.

## సంక్షేపరామాయణము ఫలశ్రుతి - రామరాజ్యము

శ్రీరాముడు - రావణసంహారానంతరము సీతా — లక్ష్మణ - సమేతుడై సుగ్రీవ - హనుమత్ విభీషణాది పరివారపరివేష్టితుడై పుష్పకవిమానమధిష్ఠించి, అయోధ్యయందు ప్రవేశించి, భరతశత్రుఘ్నులతో కలిసి పట్టాభిషిక్తుడయ్యెను. అది మొదలు రామరాజ్య మని కీర్తింపబడెను—

"నార్యశ్చావిధవా నిత్యం భవిష్యన్తి పతివ్రతాః।"

1. "రామరాజ్యములోని సౌభాగ్యము చూతము". అట! "దశరథుడు పోయినపిదప భార్యలు మువ్వురి మాట ఏమి? అవతారపురుషుల అమ్మలు కావున ఈవిధవాత్వము వారి కంటదా?" (262) అట!

"న పుత్రమరణం కించి ద్ద్రక్ష్యన్తి పురుషాః క్వచిత్"

2. తండ్రి యుండగా తనయులు చావ రనుటలో పెద్ద కుంభకోణ మున్నది. (263)

ఈరాముడు పుట్టకముందు దశరథునిచేతిలో మునిబాలు కొకడు చావలేదా?" (264) అట!

ప్రథమాంశము - దశరథు డుండగానే కైకేయీ ప్రేరణవల 14 సం॥ అరణ్యవాసము చేసియున్నవాడు రాముడు, రాముడరణ్య

మునకు వెళ్ళినతరువాత దశరథుడు స్వర్గస్థు డయ్యెను. రా
తల్లులకు భర్తృవియోగము రామరాజ్యములోనా?

"రామరాజ్య మనగా ఆలన పాలన లేక పదునాలు?
పంటలు లేక తిండి చాలక ఏడ్చిన రోజులు" (1—7) అట!

రాముని అరణ్యవాసము 14 ఏండ్లును రామరాజ్యమా?

ద్వితీయాంశము— రాముడు పుట్టకముందు దశర
చేతిలో చనిపోయిన మునిబాలుడు,- రామరాజ్యములోనివాడా

ఇంకొకటి—"నార్య శ్చావిధవా నిత్యం భవిష్యన్తి."
పుత్రమరణం కించిత్ ద్రక్ష్యన్తి." అను క్రియాపదములు భ
త్కాలార్థకములు. అనగా శ్రీసీతారామపట్టాభిషేకమునకు అన
కాలమును చెప్పును.

'ప్రాప్త రాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవా నృషిః ।
చకార చరితం కృత్స్నం విచిత్రపద మాత్మవాన్ ॥'

అనుటచే, శ్రీరామునకు రాజ్యప్రాప్తి అయినతరు
వాల్మీకిమహర్షి రామచరితము రచించినందున, రామచరిత
వరకు జరిగినట్లు చెప్పి, ఆపై జరుగబోవు రామచరితమును భ
దర్శకక్రియలతో — భవిష్యన్తి— ద్రక్ష్యంతి—అనుచు చెప్పె

మన కొత్తపండితునకు ఆభేదము తెలియక రామరాజ్యమ
తండ్రి లుండగా తనయులు, వారు పోలేదా? వీరుపోలేదా?
అల్లరి చేసెను. ఇది అసంబద్ధప్రలాప మగుటచే త్రోసివేయబ

రహస్యాలకర్త వ్రాత—

"పవిత్రమైన రామచరిత్రను చదివినవాడు, విన్నవాడు
పౌత్రాదులతో సర్వసౌఖ్యములు జుర్రుకొను" నట!

పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్ । స్యాత్ క్షత్రి
భూమిపతిత్వ మీయాత్ । వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్ । జ
శూద్రోఽపి మహత్త్వ మీయాత్"

...శూద్రుడు పఠించినచో కులమువారిలో గొప్పవాడగు నని చెప్పబడినది. "శూద్ర ఇత్యత్ర పఠన్నితి నానుషజ్యతే. కిన్తు శృణ్వన్నితి అధ్యాహ్రియతే। శ్రవణస్యాపి మహాఫలత్వవచనాత్ — గోవిందరాజు॥" పు (262)

ఇక్కడ కొంచెము చెప్పుచున్నాము— ప్రమాణములైన ఆర్ష గ్రంథములకు ఏకవాక్యతతో సమన్వయము చేయువారు వ్యాఖ్యాతలు. అందువలన వచనాంతరములతో యోజనచేసి చెప్పుటలో శ్లోకములో- 'పఠన్' అని యున్నను నాల్గవపాదములో - "శృణ్వన్" అని అధ్యాహారము చేయవలసియున్న దని చెప్పెను.

ఇంతకు పూర్వము పక్షాంతర మిట్లు చెప్పెను-"పఠన్నితి ఋషి వచనప్రామాణ్యాత్ "వచనాద్రిథకారస్య" ఇతి న్యాయేన అస్మిన్ సంక్షేపపాఠమాత్రేఽధికారోఽస్తీతి సిద్ధమ్"

ఋషివచనము-"పఠన్" అని యున్నందున ఈసంక్షేపగ్రంథ మందుమాత్రము పఠించుట సమ్మత మగును. అని.

ఇట్టి స్థితిలో-"ఇక్కడపఠించుట కర్థము బ్రాహ్మణులవలన వినుట యనియే. అని, పాపము శూద్రజాతికి అనువుగా వ్యాఖ్యాత లనుగ్రహించిరి" (262) అనువ్రాత నిష్కారణ దురాగ్రహమును సూచించుచున్నది.

"పవిత్రమైన రామ చరిత్రను చదివినవాడు, విన్నవాడు, సర్వసౌఖ్యములు జుర్రుకొనును, అని చదివినను విన్నను సమాన ఫలమే అని చెప్పిన ఈయన వినుటను గర్హించుట ఏమిపని?

'రామాయణము స్వయముగా చదివి వంకర టింకరసంకరముగా అర్థము చేసికొన్న ఈయన ఏమి పురుషార్థము సాధించినట్టు? గురు కులవాసముతో సుశిక్షితుడై నవానివలన శ్రవణము చేసినవాడు అభ్యు దయావాప్తికి లోపముండునా?

## రా మా య ణ శ్ర వ ణ ఫ ల ము

"శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పద మే వ వా ।
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా ॥
శ్రీమద్రామాయణం శ్రుత్వా షట్కాండం భక్తి సంయుతః ।
మహద్రాజ్య మవాప్నోతి నాత్ర కార్యా విచారణా ॥"
"యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు"
జన్మవ్యాధిజరావిపత్తి మరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్ ॥

ఈ విధముగా రామాయణశ్రవణమునకు మహాఫలము చెప్ప బడియుండ — శ్రవణమే కాని, పఠనము కాదనిరి వ్యాఖ్యాతలనుచు వ్యాఖ్యాతలమీాద బడుట ఏమిపని ?

"రామాయణములోని ఫలశ్రుతికూడ రామరాజ్యమువలె భయంకరముగా నున్నది" (266) అట!

భయంకరముగా నున్నది ఈయన దృష్టియే కాని, రామ రాజ్యము గాదు. ఫలశ్రుతియు గాదు.

"బుద్ధి ర్యథావిధా యస్య స తథా మన్యతే జగత్"

తనబుద్ధి ఎట్లుండునో అట్లే లోక మున్నట్లు తలచుచుండును.

"దైవధ్యానము చేయు శూద్రతపస్విని శంబుకుని శ్రీరామ చంద్రులవారు చంపివచ్చుట "ఘోరాతిఘోరమైన క్రూర కార్యము (266) అట!"

దీనిని గూర్చి సప్రమాణముగా వెనుక వివరించియున్నాము కనుక ఇది నిరస్తమైనది. శంబుకుని అభీష్టము సిద్ధింపజేయుట క్రూర కార్యమా?

"ఈమతముపేర స్వేచ్ఛగా బ్రతుకుచు హాయిగా పొట్టలు నింపు కొంచు నిమ్నోన్నతము లేర్పరచుచు నీచముగా సంచరించెడి వంచకులను శిక్షించి బుద్ధి చెప్పవలసియున్నది." (267) అట!

వీరన్నట్టు 'నీచముగా సంచరించు వంచకు లెవరు ? జగద్వంద్య మైన రామాయణమును-రామాయణరహస్యా' లను పేరుతో-రంకులకథలతో నిండినదే రామాయణ మని - శ్రీరాము డవివేకి అని - లక్ష్మణుడు - పశువు, షండుడో, పాషండుడో అని అన్నమో రామచంద్రా! అని ఆకలిమంటలచే అలమటించిన రాజ్యము రామరాజ్యమని - అప్రమాణముగా - అసంబద్ధముగా - అసభ్యముగా - నీచముగా వ్రాసి లోకవంచకులుగా సంచరించు ఈరామాయణరహస్యాలకర్త వంటివారు కాక మరెవ్వరు? వీరి వాచాటతను మన్నించి వీరికి సద్బుద్ధిని రామప్రభువే ప్రసాదించుగాక.

రంకులకథలతో నిండినదే రామాయణము అను ఈ రామాయణరహస్యాలకర్త వ్రాతయు, రాముణ్ణి దుష్టుణ్ణిగా చిత్రించిన ఆ రావణకావ్యకర్త వ్రాతయు వెనుక ప్రస్తావనలో చూపియున్న పవిత్రవస్తువుల అపవిత్రీకరణ నేరము పై సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పునకు గుఱియై యున్నవి చూడు డని పాఠకమహాశయులకు మనవి చేయుచు ముగించుచున్నాము.

వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పశ్చాత్సుమిత్రాసుతః,
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషు చ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్ ॥

## రవీంద్రకవీంద్రుని వాదము—దానిసమీక్ష

ఆంధ్రజ్యోతి-25-జూన్-1961-

రవీంద్రుడు ప్రాచీనభారత దేశచరిత్రకు అమూల్యమైన నవీన వ్యాఖ్యానము చేసినాడు. ఆవ్యాసమును సంస్కరించి 1929లో ఎవిజన్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ అను బృహద్వ్యాసము ప్రకటించినాడు.

ఆయన తన భారతదర్శనములో ప్రతిపాదించిన విషయములను ౦ంచుటయే ఈ వ్యాసలక్ష్యము...

1. జనకుడు, విశ్వామిత్రుడు శ్రీరామచంద్రుడు ఆర్య-ద్రావిడ-్మూలనముకై కృషిసల్పినారు. వారొక నూతనోద్యమమునే నడిపి ు. అదే ప్రాచీనక్షత్రియోద్యమము.

2. సమాజములో మహోన్నతస్థానము తమకు ఆజన్మసిద్ధముగా ంచిన దని బ్రాహ్మణుల భావము. బ్రాహ్మణులు కులము ప్రాతి కగా వ్యక్తికి వ్యక్తికి మధ్య అభేద్యదుర్గములను నిర్మించిరి. నిని బద్దలు చేయుటకు ప్రయత్నించినవారు క్షత్రియులు.

3. క్షత్రియులు యజ్ఞయాగాదులను విరోధించిరి. వైదికమత ు తిరస్కరించిరి. మన ప్రాచీనకథలో విశ్వామిత్రుడు-వసిష్ఠులు ్మవిరోధులుగా వర్ణింపబడిరి. వసిష్ఠుడు బ్రాహ్మణమతాను ాయి. విశ్వామిత్రుడు క్షత్రియోద్యమమునకు పట్టుగొమ్మ'' అట!

ఇవి మూడు అంశములు. ఇందులో క్షత్రియోద్యమమని, ్రాహ్మణోద్యమ మని కల్పించుట-జనక- విశ్వామిత్ర శ్రీరామ ంద్రులు-కులము ప్రాతిపదికగా బ్రాహ్మణులు నిర్మించిన అభేద్య ర్గములను బ్రద్దలు చేయుటకు ప్రయత్నించిన క్షత్రియు లనుట - ్జ్ఞాదులను విరోధించి వైదికమతమును తిరస్కరించినారనుట— ాధారమైన స్వకపోలకల్పితము.

చాతుర్వర్ణ్యం త్రయో లోకాః చత్వారశ్చాశ్రమాః పృథక్ ।
భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదాత్ప్రసిధ్యతి ।''
"చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్''

ఇత్యాదివచనములు చాతుర్వర్ణ్యము భగవంతునిచే సృష్టి ్టమై యున్నదని, చాతుర్వర్ణ్య, చతురాశ్రమ వ్యవస్థ వేదప్రసిద్ధ ని ఘోషించుచున్నవి.

వెనుక సమీక్షలో - అశ్వములలో, సర్పములలో వృక్షముల లో కూడ వర్ణవిభాగ మున్న దని ప్రమాణ పూర్వకముగా నిరూపింప బడినది. ఇట్టి స్థితిలో - అవి బ్రాహ్మణులు నిర్మించినవనుట, వానిని బ్రద్దలుచేయ ప్రయత్నించినవారు జనకాదులనుట అసంగతము.

వర్ణాశ్రమధర్మ పరిపాలనమే రాజ్యపాలకు లగు క్షత్రియులకు కర్తవ్యమై యున్నది. కనుకనే అయోధ్యలో—

"వర్ణే ష్వగ్ర్యచతుర్థేషు దేవతాఽతిథిపూజకాః"

అనుచు చతుర్వర్ణములు స్వధర్మపరు లని చెప్పబడినది. కనుక జనక-రామచంద్రాదులు-వర్ణాశ్రమాదివ్యవస్థను పరిపాలించినవారే అని తెలిసికొనవలెను.

"సర్వేషాం జన్మనా జాతిః నాన్యథా కర్మకోటిభిః ।
పశ్వాదీనాం యథా జాతిః జన్మనైవ నచాఽన్యథా ॥"

అని యున్నందున జన్మసిద్ధమే జాతి. స్వజాతివిహితకర్మధర్మ స్వధర్మమై సంసారవిముక్తికి సాధన మగుననుచు—

"స్వజాత్యుక్తం యథా శక్తి కర్మ యః కురుతే పుమాన్ ।
ముక్తి స్తస్యైవ సంసారా దితి వేదానుశాసనమ్ ॥"

అని ప్రతిపాదింపబడినది.

"కర్మశీల గుణాః పూజ్యాః తథా జాతికులేన హి ।
న జాత్యా న కులేనైవ శ్రేష్ఠత్వం ప్రతిపద్యతే ॥"

అనుచు స్వజాతికి చెప్పబడిన ధర్మము, సత్ప్రవర్తన, సద్గుణ ములు, వీనినిబట్టియే పూజ్యతగాని, జాతిచేతను, కులముచేతను, పూజ్యత కాదని, శ్రేష్ఠత్వము జాతిచేతను, కులముచేతను ప్రాప్తింప దని చెప్పబడియుండ—

"మహోన్నతస్థానము తమకు జన్మసిద్ధముగా లభించిన దని బ్రాహ్మణుల భావము"

అని వ్రాయుట అసంగతము.

అలెగ్జాండరు క్రీ॥ పూ. 327 సం॥ ఈ దేశముపైకి దండె వచ్చినపుడు ఆతనితో వచ్చిన చరిత్రకారుడు 'తెమిస్టసు' ఇ వ్రాసియుండెను—

"బ్రాహ్మణులు దూరమునుండి పిడుగులను, మెరుపులను మా వెదజల్లుచు యుద్ధము గావించిరి."

అలెగ్జాండరు-అరిస్టాటలుకి వ్రాసిన ఉత్తరము—

"నా సైన్యము హిందూదేశములో దావాగ్ని సన్నిభంబుల అస్త్రములలో ముంచివేయబడెను"

వెనుక సమీక్షలో గూడ చూపబడియున్న ఈవిషయముల బట్టి ఆబ్రాహ్మణుల ప్రభావము తెలిసికొని వారియందు అపోహ తొలగించుకొందురుగాక.

క్షత్రియుడైన విశ్వామిత్రుడు క్షత్రియోద్యమము నడపి వాడని, ఆయుద్యమమును బట్టియే వసిష్ఠునితో విరోధమని వ్రాసి దానిపై చెప్పుచున్నాము—

ఒకప్పుడు సేనలతో వసిష్ఠాశ్రమమునకు వెళ్ళిన విశ్వామిత్రుడ ఆతిథ్యము తీసికొని అట్టి అపూర్వాతిథ్యమునకు ఆధారమై వశిష్ఠు తపస్సిద్ధిరూపమైయున్న 'శబల' అను గోవును తీసికొనిపోదలచుట వశిష్ఠుడు నిషేధించుట, జరుగగా తన క్షాత్రమును ప్రదర్శించియు కృతార్థుడు కాలేక వెళ్ళి తపస్సుచేసి దివ్యాస్త్రములు సంపాదించి కూడ వసిష్ఠుని ప్రతిఘటింప లేనివాడై—

"ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలమ్ ।
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే ॥"

అనుకొని తాను బ్రహ్మర్షి కావలె నని తపస్సు నవలంబించెను.

## విశ్వామిత్రుని బ్రహ్మర్షిత్వసిద్ధి

అట్లు కఠోరమైన తపస్సు సహస్రవర్ష దీక్షతో, మౌనముతో, నిశ్చలముగా ఆచరించుచున్న విశ్వామిత్రునకు వరమిచ్చుటకై దేతవలతో కలిసివచ్చిన బ్రహ్మ- బ్రాహ్మణ్యసిద్ధిని, దీర్ఘాయుష్యమును ప్రసాదింప ఆ విశ్వామిత్రు డిట్లనెను-

"బ్రాహ్మణ్యం యది మే ప్రాప్తం దీర్ఘమాయు స్తథైవచ ।
ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయన్తు మామ్ ॥
క్షత్రవేదవిదాం శ్రేష్ఠః బ్రహ్మవేదవిదా మపి ।
బ్రహ్మపుత్రో వశిష్ఠో మా మేవం వదతు దేవతాః ॥
తతః ప్రసాదితో దేవై ర్వసిష్ఠో జపతాం వరః ।
సఖ్యం చకార బ్రహ్మర్షి రేవ మస్త్వితి చాఽబ్రవీత్ ॥
బ్రహ్మర్షి స్త్వం న సన్దేహ స్సర్వం సంపత్స్యతే తవ ।
విశ్వామిత్రోఽపి ధర్మాత్మా లబ్ధ్వా బ్రాహ్మణ్య ముత్తమమ్ ॥
పూజయామాస బ్రహ్మర్షిం వసిష్ఠం జపతాంవరమ్ ॥"

మహనీయా! నీవన్నట్టు బ్రాహ్మణ్యము,దీర్ఘాయుష్యము నాకు ప్రాప్తించినయెడల, ఓంకార — వషట్కారములు, సర్వవేదములు నన్ను వరించు (ఆశ్రయించు) గాక. వేదములు స్వయముగా వరించుట బ్రాహ్మణ్యసిద్ధికి చిహ్నమని భావము.

ధనుర్వేదవిదులలోను, బ్రహ్మవేదవిదుల శ్రేష్ఠుడును, బ్రహ్మపుత్రుడును అగు వసిష్ఠుడు 'మీరన్న మాట నన్ను అనవలెను' అని దేవతలను కోరగా - వారు వసిష్ఠునితో చెప్పినంతట - ఆయనవచ్చి నీవు బ్రహ్మర్షివే అని సఖ్యముతో పలికెను.

బ్రహ్మర్షియైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యగు వసిష్ఠుని పూజించెను.

ఇట్లు వశిష్ఠవిశ్వామిత్రులు బ్రహ్మర్షులే అయియుండ "ఒకరిది బ్రాహ్మణోద్యమము, ఒకరిది క్షత్రియోద్యమము' అనుట ఆయిద్దర ఆజన్మవిరోధులు' అనుట అసంగతము.

## విశ్వామిత్ర - జనక - శ్రీరాముల-యజ్ఞానుష్ఠానము

విశ్వామిత్రుడు తన యజ్ఞనిర్వహణమునకు శ్రీరామునికో వచ్చి దశరథునితో ఇట్లు పలికెను—

"యది తే ధర్మలాభం చ యశశ్చ పరమం భువి।
స్థిర మిచ్ఛసి రాజేన్ద్ర! రామం మే దాతు మర్హసి॥"
దశరాత్రం హి యజ్ఞస్య రామం రాజీవలోచనమ్।
నాత్యేతి కాలో యజ్ఞస్య యథాఽయం మమ రాఘవ॥"

రాజేన్ద్రా! నేను తలపెట్టిన యజ్ఞము నిర్విఘ్నముగా నె వేరుటకై శ్రీరాముని నా వెంట బంపగోరుచున్నాను. అని

అట్లు పంపిన రామలక్ష్మణులతో తన యజ్ఞమును పూర్తి చేసిన విశ్వామిత్రుడు శ్రీరామునితో ఇట్లు చెప్పెను—

"మైథిలస్య నరశ్రేష్ఠ జనకస్య భవిష్యతి।
యజ్ఞః పరమధర్మిష్ఠః తస్య యాస్యామహే వయమ్॥
త్వం చైవ నరశార్దూల సహాఽస్మాభి ర్గమిష్యసి।
అద్భుతం చ ధనూరత్నం తత్రైకం ద్రష్టు మర్హసి॥"

శ్రీరామా! జనకుని యజ్ఞము జరుగనై యున్నది. అక్కడకి మేము వెళ్ళెదము. మాతో నీవును రావలెను. అక్కడ అద్భుత మైన ఒక ధనుస్సును చూడగలవు. అని.

ఇక శ్రీరాముని అశ్వమేధము ప్రసిద్ధమే.

ఇట్లు విశ్వామిత్ర — జనక — శ్రీరాములు యజ్ఞానుష్ఠానము చేసి యుండుటచేతను, విశ్వామిత్రుడు బ్రహ్మను - 'వేదాశ్చ వ ... మన్నుః ...' సకలవేదావాప్తి వరము గోరి పొందియుండుటచేతను

"విశ్వామిత్రాదిక్షత్రియులు యజ్ఞాదులకు విరోధించిరి. వైదిక మతమును తిరస్కరించిరి. అందువలన బ్రాహ్మణ క్షత్రియ సంగ్రామము లనివార్యములైనవి"
అను వ్రాత నిరస్తమైనది.

చాతుర్వర్ణ్యము వారిది వేదమతసిద్ధాంతమే అయియుండ, బ్రాహ్మణక్షత్రియులవి విభిన్నసిద్ధాంతము లనుట అసంగతము.

ఇంకొకటి – రవీంద్రనాథానుసారము, క్షత్రియుడగు విశ్వామిత్రుడు క్షత్రియుడగు హరిశ్చంద్రుని కష్టములకు పాలుచేసినాడు.

"దాతా చ ధర్మశీలశ్చ ప్రజారంజనతత్పరః ।
హరిశ్చన్ద్రసమో రాజా న భూతో న భవిష్యతి ॥"

అని బ్రాహ్మణుడైన వసిష్ఠుడు సంస్తుతించినాడు.

ఇక్కడ క్షత్రియోద్యమము కాదు. బ్రాహ్మణోద్యమము కాదు. రెండు విభిన్నసిద్ధాంతములును కావు. సర్వోత్తముడుగా కీర్తింపబడిన హరిశ్చంద్రుని పరీక్షలో బెట్టి కష్టములు కలిగించి ఆయనకీర్తిని ధృవపరచి, సత్యహరిశ్చంద్రుడు" అను అఖండకీర్తిని కలిగించినవాడు బ్రహ్మర్షియైన విశ్వామిత్రుడు.

రవీంద్రుడుకూడ – బ్రాహ్మణు లందరు వసిష్ఠుని పక్ష మవలంబించిరని – క్షత్రియులందరు విశ్వామిత్రు ననుసరించిరని చెప్పజాలము.

క్షత్రియుడైనప్పటికి సత్యహరిశ్చంద్రునిపై విశ్వామిత్రుడు కత్తిగట్టినాడు. వసిష్ఠునకు ప్రీతిపాత్రుడు"

అని వ్రాయుటచే తన కల్పన నిలుచునది కాదనిచెప్పినట్లే.

## బ్రాహ్మణమతమట – క్షత్రియమతమట—

"బ్రహ్మముఖమునుండి ప్రాదుర్భవించినవి చతుర్వేదములు, అవి అపౌరుషేయములు. సార్వకాలికజ్ఞానము అందు నిక్షిప్తమైనది.

అని వైదికమతాచార్యుల సిద్ధాంతము. పరిణామవికాస లగు క్షత్రియుల దృష్టి వేరు. వారి మూలదైవత మగు మూర్తి - లోకత్రాణపరాయణుడు, ధర్మస్థాపనకొరకు ఒక ములో శ్రీరామచంద్రుడుగా, ఒకయుగములో శ్రీకృష్ణుడుగా యుగములో బుద్ధుడుగా అవతరించి మానవకళ్యాణము సాధి వాడు. ఈ అవతారపురుషులందరు క్షత్రియులే. క్షత్రియో నాయకులే" అట!

ఇక్కడ చెప్పుచున్నాము—

"అహం నారాయణో నామ ప్రభవ శ్శాశ్వతో౽వ్యయః ।
విధాతా సర్వభూతానాం సంహర్తా చ ద్విజోత్తమ ॥"
ఋగ్వేద స్సామవేదశ్చ యజుర్వేదో౽ప్యథర్వణః ।
మత్తః ప్రాదుర్భవ న్త్యేతే మా మేవ ప్రవిశన్తి చ ॥" (వన

స్రష్టగా, సంరక్షకుడుగా, సంహర్తగా ఉన్నవాడు వి బడు నారాయణుడని, ఆయనవలన ప్రాదుర్భవించినవే వేదః చెప్పబడియుండుటచే విష్ణువు మూలదైవతముగాగల క్షత్రియ వేదమతము కాదనుట అసంగతమే.

"విష్ణుమూర్తి - ధర్మస్థాపనకొరకు రామ-కృష్ణ-బుద్ధులుగా రించినాడు. ఈ అవతారపురుషులందరు క్షత్రియులే. క్షత్రి ద్యమనాయకులే." అట!

అవతారపురుషు లందరును క్షత్రియులేకారు. బ్రాహ్మణ పరశురాముడును అవతారపురుషుడే అని భాగవతమందున్నది.

"యవీయాన్ జజ్ఞ ఏతేషాం రామ ఇత్యభివిశ్రుతః ।
య మాహు ర్వాసుదేవాంశం హైహయానాం కులాన్తకమ్
ఏవం భృగుషు విశ్వాత్మా భగవాన్ హరి రీశ్వరః ।
అవతీర్య పరం భారం భువో౽హం బహుశో నృపాన్ ॥"

జమదగ్ని మహర్షి కుమారులలో కనిష్ఠుడు రాముడు, వాసు దేవాంశమని, హైహయ కులాన్తకు డని చెప్పి ఇట్లు భృగువంశములో విఖ్యాతుడైన శ్రీహరి అవతరించి భూభారమును హరించె నని చెప్పబడినది.

రవీంద్రుడన్నట్లు ధర్మస్థాపన కొరకే భగవదవతారము కనుక పరశురామావతారము చేసినదియు ధర్మస్థాపనమేఅని తెలిసికొనవలెను

శ్రీరాముడు - "వేదవేదాంగతత్త్వజ్ఞః ధనుర్వేదే చ నిష్ఠితః। సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః" అని కీర్తింపబడినవాడు. వైదికమతమును నిరసించిన పరిణామవికాసవాది యగునా?

'యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః స్కన్ధోఽర్జునో ।
భీమసేనోఽస్య శాఖాః । మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధేమూలం
కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ"

యుధిష్ఠిరు డను ధర్మమయమహావృక్షమునకు- శ్రీకృష్ణుడును,- బ్రహ్మ అనగా వేదములును, బ్రాహ్మణులును, మూలభూతుఽని కీర్తింపబడినట్టి శ్రీకృష్ణుడు వేదమతవిరోధియు, పరిణామవికాసవాది యునా? చాలుచాలు.

యుధిష్ఠిరుని రాజసూయయాగములో ఎవరేయే కార్యములు చేసిరో చెప్పునపుడు—చరణక్షాలనే కృష్ణో బ్రాహ్మణానాం స్వయం హ్యభూత్' శ్రీకృష్ణుడు బ్రాహ్మణపాదప్రక్షాళన కార్యములో స్వయముగా ప్రవర్తించెను. అని చెప్పబడినది. ఆ రాజసూయము లోనే -బ్రాహ్మణులు-క్షత్రియులు-నారదాదిమహర్షులు- రాజర్షులు శోభించుచున్న మహాసభలో పూజాప్రస్తావనము రాగా, పూజ్యతమును శ్రీకృష్ణుడే అని భీష్ముడు ప్రతిపాదింప, అందరును దానికి హర్షించిరి. క్షత్రియుడైన శిశుపాలుడు ఆ మాటను గర్హించెను.

ఇట్టి శ్రీకృష్ణుడు వేదమతవిరోధి, పరిణామవికాసవాది, క్షత్రియోద్యమ...కుడునా? చాలు! చాలు!

అనాటి బ్రాహ్మణ- క్షత్రియ-వర్గములలో వైరుధ్యమేమియు లేదు. అది వీరిప్పుడు కల్పించినదే. అని మతిమంతులు ంతురుగాక!

ఇక బుద్ధునిగూర్చి చెప్పుచున్నాము—

'తతః కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్ ।
బుద్ధో నామ్నా జినసుతః కీకటేషు భవిష్యతి ॥"

కలియుగములో దేవశత్రువులను వ్యామోహింపజేయుటకు ా వైదికమార్గమునుండి తొలగించుటకై బుద్ధుడను పేరుతో ంచును. అని భాగవతములో చెప్పబడినది.

ానగవదవతారము విషముబుద్ధిని కలిగించునా? అందురేమో!

'అహం న్తు దుష్టభావానాం యుష్మాసు సు దురాత్మనామ్ ।
అసమ్యగ్వర్త మానానాం మోహం దాస్యామి దేవతాః ॥"

(హరివంశము)

దేవతలారా! దుస్స్వభావము కలిగి దురాచారులై నీా ఃల దురభిప్రాయము కలవారికి నేను మోహమును (ధర్మమును ర్మమని గ్రహించుట, అధర్మమును ధర్మమని గ్రహించుట) ఁతును. అని భగవంతుడే చెప్పెను, కనుక బుద్ధుడు వేదవిరోధు దూరము చేసి వేదమతము కాపాడినవాడే.

ఇతోధికము బుద్ధునిగూర్చి మా "ఆస్తికత్వము"లో చూడ ను.

## 'ధర్మసంస్థాపనార్థాయ' దీనికి రవీంద్రుని అర్థము

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అను గీతావాక్యమునకు మనము నూతన తాత్పర్యము చెప్పుకొనవలయును.

ఈధర్మము సనాతనమైనదికాదు. త్రికాలాబాధితము కాదు. ప్రతియుగమునకు అనుగుణమైన ధర్మము. ప్రగతికి ప్రతీకమైన ధర్మము" అట!

అది భగవద్గీతావచనము. దానికి గ్రహింపవలసినది ఆ కృష్ణ భగవానుని తాత్పర్యమే కాని, ఈ రవీంద్రుని తాత్పర్యముకాదు. మరియు, ఆగీతావచనము ప్రాచీనముకాని, నవీనముకాదు. దానికి నవీనతాత్పర్యము చెప్పుట హాస్యాస్పదము.

"ధర్మసంస్థాపన" మన్నపుడు, ధర్మము - సనాతనము త్రికాల బాధితము - కా దట!

"త్వ మవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో మతో మే" (గీ 11–18)

అనుచు అర్జునుడు గీతలో, కృష్ణభగవానుని-నీవు సనాతనుడవన్నాడు. అట్టి సనాతనుడు స్థాపించు ధర్మము సనాతనధర్మము కాక మరేదో అగునా? నీవు — అవ్యయుడవు — శాశ్వతధర్మగోప్తవు- అన్నాడు. అట్టివాడు స్థాపించునది, త్రికాలాబాధితము-శాశ్వతము- కాక, మరేదో అగునా?

"త్వత్త స్సనాతనో ధర్మో రక్ష్యతే తనుభి స్తవ"

అను భాగవతవచనము- ఆ యా అవతారములచేత సనాతన ధర్మము నీచే రక్షింపబడుచున్నదని ఘోషించుచున్నది.

"సనాతనస్య ధర్మస్య మూల మేత త్సనాతనమ్"

ఈ సనాతనపరమాత్మయే సనాతనధర్మమునకు మూలాధారమని భారతము చాటుచున్నది.

ఈ ప్రమాణములనుబట్టి రవీంద్రుని వ్రాత అసంబద్ధమగుట తోసివేయబడినది.

అధర్మాత్ముడని రావణుని నింద. నూతనధర్మస్థాపకుడు రవీంద్రుని స్తుతి. ఆరావణుని నిందలను, ఈరవీంద్రుని మాటలు నిరసింపగలవా?

ఆ రావణుని నిందలకు - "రామో విగ్రహవాన్ ధర్మః అన్నది మారీచుని మందలింపు" .

ఇంకొకటి—

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥"

దీనికి-'విష్ణుమూర్తి ధర్మగ్లాని కలిగినపుడు ధర్మసంస్థాపనకొరకు ఆయా యుగములందు సంభవించినాడు' అని అర్థము వ్రాసిన వీ నడుగుచున్నాము.

ధర్మగ్లాని కలిగి, అధర్మము తలయెత్తినపుడు ధర్మముసంభవించు నట్లుకదా ఉన్నది. ఆయన సంభవించి-ధర్మగ్లాని లేకుండ, అధర్మము తలయెత్తకుండ చేయవలెను. అదే ధర్మసంస్థాపనముకద! అది అధర్మము తొలగించగలిగినను, ధర్మగ్లానిని తొలగించవలెనుకదా! గ్లాని ఏధర్మమునకో అధర్మమునే స్థాపించినప్పుడు ఆధర్మగ్లాని తొలగును

మీమాతములో ఆయన సంభవించినతరువాత స్థాపించినది నూతనధర్మము లేదు. ఆయన సంభవించునాటికి ఈనూతనధర్మము లేదు కనుక ఆగ్లాని ప్రాచీనమైన సనాతనధర్మమునకే అయియున్నది ఇప్పుడు మీమత ప్రకారము చూడ ధర్మగ్లాని కలిగినప్పుడు సంభవిం

చుటకాక, ధర్మగ్లాని కలిగించుటకే సంభవించుట అని సిద్ధించినది. ఇది —

'వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్' అన్న ట్లున్నది.

మారీచుని యొద్ద రావణుడు రాముని ఇట్లు నిందించెను- "రామః క్షత్రియపాంసనః। త్యక్తధర్మాత్మా త్వధర్మాత్మా" త్యక్తధర్ముడని రావణుని నింద. సనాతనధర్మము నిరసించిన వాడని రవీంద్రుని స్తుతి. ఇట్లు చూడ, రవీంద్రుని రీతి విదితమైనది కనుక ఈవిషయ మింతటితో వదలివేయుచున్నాము.

## వాల్మీకిరామాయణము ఆదికావ్యము కాదట! దాని సమీక్ష

ఒక జిజ్ఞాసువు ఇట్లు వ్రాసెను— "డాక్టర్-కున్హాన్ రాజా వాదము- వాల్మీకిరామాయణము ఆదికావ్యము కాదని"-ఇది పత్రికలో ప్రకటింపబడినది. ఆయన చెప్పినకారణము- "క్రీ॥ పూర్వము రెండవశతాబ్దిలో-మహాభాష్యము వ్రాసిన పతంజలి అనేక పూర్వ గ్రంథాల ప్రసక్తి తెచ్చాడు,

వాల్మీకిరామాయణ మాదికావ్య మైతే అది తనకాలము నాటికే ఉంటే, దానివిషయమై ఆయన మౌనం వహించేవాడా?" అని. దీని నిర్ణయ మేమి? అని.

## వాల్మీకిరామాయణకాలము బహుప్రాచీనకాలము

ఇక్కడ చెప్పుచున్నాము— మీరన్నట్లు మహాభాష్యకర్త-పతంజలి క్రీ॥ పూ॥ రెండవశతాబ్దివాడైతే, రామాయణము

"త్రేతాయుగే చతుర్వింశే రావణ స్తపసః క్షయాత్।
రామం దాశరథిం ప్రాప్య సగణః క్షయ మీయివాన్ ॥"
(వాయుపురాణ-ఉత్త -9)

6. వాయుపురాణవచనమునుబట్టి—చతుర్వింశే త్రేతాయుగే. 24వ త్రేతాయుగములో - రామావతారము, రావణసంహారము వాల్మీకిరామాయణావిర్భావము జరిగినట్లు స్పష్ట మగుచున్నది ఇప్పుడు వైవస్వతమన్వంతరములో 28వ మహాయుగములో త్రేత యుగము వెళ్ళి, ద్వాపరయుగము వెళ్ళి, వర్తమానకలియుగములో 5 వేల సం॥ లు పైగా గడచినవి. ఇప్పుడు చూడుడు—24 వ మహ యుగములోని ఆ త్రేతాయుగమునకును, 28 వ మహాయుగములో కలియుగమునకును మధ్య 3 మహాయుగములు, మరి కొన్ని యుగము లును గతించినవి. క్రీ. పూ. రెండవశతాబ్దివాడుగా చెప్పబడు పతంజలినాటికి వాల్మీకిరామాయణము లేదా?

"రావణాన్తకరో రాజా రఘూణాం వంశవర్ధనః।
వాల్మీకి ర్యస్య చరితం చక్రే భార్గవనన్దనః॥"

అను మత్స్యపురాణవచనము—రామచరితమైన రామాయణ మును వాల్మీకిమహర్షి రచించె నని చెప్పుచున్నది. అట్టి వాల్మీ రామాయణము— క్రీ. పూ. రెండవశతాబ్దినాటికి లేదా?

ఇంకొకటి— "మహాభాష్యం వ్రాసిన పతంజలి అనేక పూర్వ గ్రంథాల ప్రసక్తి తెచ్చాడు. వాల్మీకిరామాయణం తనకాల నాటికే ఉంటే దానివిషయమై మౌనం వహించేవాడా?" అట!

ఆయన పేర్కొన్న గ్రంథాలలో ఆరామాయణం లేకపో లేదు— చూడుడు— శబ్దప్రయోగమునుగూర్చి ఇట్లు చెప్పెను—

మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః - సప్తద్వీపా వసుమతీ త్రయో లోకాః, చత్వారో వేదాః సాంగా స్సరహస్యాః బహుధా భిన్నాః ఏకశత మధ్వర్యుశాఖాః, సహస్రవర్త్మా సామవేదః, ఏకవిం శతిధా బాహ్వృచ్యం, నవధాఽఽథర్వణో వేదః, వాకోవాక్యమ్ ఇతిహాసః, పురాణం, వైద్యకమ్ ఇత్యేతావాన్ శబ్దస్య ప్రయో విషయః ..."

ఇందు- "పూర్వచరితసంకీర్తన మితిహాసః" "వంశాద్యనుసంకీర్తనం పురాణమ్" అని పురాణమునకు భిన్నముగా పేర్కొనబడినది ఇతిహాసము. దానిని వివరించుచు రాజశేఖరకవి- "రామాయణం భారతం చోదాహరణే" అనుచు ఇతిహాసముగా రామాయణమును కూడా కీర్తించియుండెను.

## —మహాభాష్యములో వాల్మీకి రామాయణ ప్రసక్తి -

అనేక పూర్వగ్రంథాల ప్రసక్తి తెచ్చిన మహాభాష్యకారులు వానిలో ఇతిహాసగ్రంథముల ప్రసక్తి కూడ తెచ్చియే యున్నారు. అందులో రామాయణముకూడ చేరియేయున్నది. భాష్యకారులు ప్రయోగించిన "ఇతిహాస శబ్దమునకు అర్థము ఈవాదికి తెలియనే లేదని తేలినది.

ఇంకొకటి మహాభాష్యకారులు - రామాయణేతిహాసమును పేర్కొనుటే కాదు. వాల్మీకిరామాయణ శ్లోకమునే కంఠోక్తిగా కీర్తించియున్నారు,

సీతారామలక్ష్మణులు, సుగ్రీవాదివానరవీరులతో పుష్పక విమానమునీద వచ్చుచున్నారను శుభవార్త ముందుగా వెళ్ళిన హనుమంతుడు భరతునకు విన్నవింప పరమానందభరితుడై భరతుడిట్లనెను-

"ఏతి జీవన్త మానన్దో నరం వర్ష శతాదపి" (యుద్ధకాండ-స 129)

ఇదియే- "సార్వధాతుకే యక్" అను పాణినిసూత్రము, (అ 3. పా 1. సూ 67) లో భాష్యకారులచేత-

"ఏతి జీవన్త మానన్దో నరం వర్ష శతాదపి" అని ఉదాహరింపబడియున్నది. కున్హాన్‌రాజా వాదము, ఇట్లు నిరస్తమై వాల్మీకి రామాయణము ఆదికావ్యమే" అను సిద్ధాంతము ధ్రువపడినది.

## ఇప్పటి విద్య-విద్యార్థుల వ్రాతలు

ఈగ్రంథములో- 1 "రామాయణరహస్యాల"కర్త వాదము, 2 రవీంద్ర(వీంద్ర)ని వాదము, 3 కృష్ణాన్ రాజా వాదము, ఇవిమూడును సమీక్షింపబడినవి. వీరి వాదము లన్నియు ఆర్ష గ్రంథములకు సంబంధించినవే. ఆగ్రంథములను వీరు ఎట్లు అర్థముచేసికొనిరో, లోకమునకు ఏమని బోధించిరో, ఆ ఆర్ష గ్రంథములు ఏమిచెప్పినవో, మా సమీక్షలో సప్రమాణముగా నిరూపింపబడినది. వీరందరును విద్యార్థికు లనియేకదా ప్రసిద్ధి. ఆర్ష గ్రంథములలోని నిగూఢవిషయములను చక్కగా అవగతము చేసికొనుటకు ఉపయోగపడవలసిన విద్య- ఆగ్రంథములనుచ్ఛేదించుటకే ఉపయోగించుట ఎంత భాగ్యమో? ఇట్టి వారే విద్యార్థికులుగా-అభ్యుదయరచయితలుగా పరిగణింపబడుచున్నారు.

"అన్యతోఽవినయం కుర్వన్ పితృభ్యాం వార్యతే సుతః ।
తయో రేవాఽవినీతస్య కో భవే ద్వినివారకః ॥"

అన్నట్లు అన్యులయెడ తప్పుచేయు కుమారుని తప్పుచేయకుండ తల్లిదండ్రులు నివారింతురు. ఆతడు ఆ తల్లిదండ్రుల యందే తప్పుచేయుచో ఇక నివారించువా రెవరు? అని చెప్పినట్లు - ఆర్ష గ్రంథములు - "మాతేవ రక్షతి పితేవ హితే నియుఙ్క్తే" అన్నట్లు, రక్షించుటలో, తల్లిగా, హితము నుపదేశించుటలో, తండ్రిగా ఉన్నవి.

ఆ ఆర్ష గ్రంథములు- ఇతరత్ర లోకులు చేయు తప్పులను నివారించునవై యుండి ప్రజలకు హితకరములు, రక్షకములుగ ప్రకాశించుచుండ వానినే ఉచ్ఛేదించుటకు పూనుకొన్న వీరి చర్యను పాఠకమహాశయులు గమనింతురుగాక.

## విద్యనుగూర్చి గాంధీజీ ఏమన్నారు?

తెలుగువిద్యార్థి పత్రిక-అక్టోబరు-1968.

"గాంధీజీ చదువులో మతబోధ విధిగా ఉండాలనేవారు. వారి వారి మతముల ప్రాథమిక సూత్రాలు వారికి క్షుణ్ణంగా తెలియాలి. మతగ్రంథాల పరిచయ మేర్పడాలి. భగవద్విశ్వాస మేర్పడాలి. అప్పుడే శీలము సరిదిద్దబడుతుంది. మంచినడవడిక ఏర్పడుతుంది. దైవభక్తి ప్రేరకంగాను,- మతసూత్రాలు తెలిసేదిగాను, ఆధ్యాత్మికతత్త్వవిలసితంగాను—విద్య ఉండితీరా లన్నారు గాంధీజీ.'

మరి ఇప్పుడు జరుగుతోం దేమిటి? లౌకికరాజ్యాంగమన్న ముసుగేసుకుని మతానికి- భగవంతునికి- స్వస్తి చెప్పారు. మన సంస్కృతిని గురించి ఒక్క ముక్కకూడ పాఠ్యగ్రంథాల్లో లేకుండా చేశారు. ఇక విద్యార్థులకు గాంధీజీ ఆశించిన నైతికప్రవర్తన ఎలా అలవడుతుంది? నీతిలేదు, మంచిలేదు, దేవుడులేడు, సంప్రదాయం లేదు.' (శ్రీ. ఎ. ఎస్. అవధాని)

విద్య చూడగా ఇట్లున్నది. విద్యాధికుల వ్రాతలు చూడగా అట్లున్నవి. లోకు లాశించెడి సుఖశాంతులెట్లో ఈశ్వరుని కెరుక.

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు

సమాప్తము

